# అమ్మాయనుకోలేదు

## -మెహ్రీన్ కౌర్

**చాలా మంది సినిమా వాళ్ల నోటి నుంచి ఓ మాట అలవోకగా వచ్చేస్తుంటుంది. అదేమిటంటే...'డాక్టర్ కావాలనుకుని యాక్టర్నయ్యాను' అన్న మాట! ఈ మాట అక్షర సత్యం అంటోంది మెహ్రీన్ కౌర్. చదువుకునే రోజుల్లో డాక్టర్ కావాలని అనుకుందట.. కానీ అందుకు భిన్నంగా యాక్టర్ ఎలా అయ్యిందో ఆమె మాటల్లోనే...**

### మీ గురించి....

నేను పంజాబీ అమ్మాయిని. పుట్టింది పంజాబ్‌లో. పెరిగిందంతా మాత్రం ఢిల్లీలో. కెనడాలో ఉన్నత చదువులు చదవాలనుకున్నాను. అసలు చిన్నతనంలో డాక్టర్, శాస్త్రవేత్త ఇలా ఎవరు గొప్పగా అనిపిస్తే అలా కావాలని ఉండేది. అందరి కన్నా డాక్టర్ బాగా నచ్చడంతో నేనూ అదే అయిపోవాలని ఫిక్సయ్యాను. చివరకి యాక్టర్నయ్యాను.

### సినిమాల్లోకి ఎలా వచ్చారు?

ఇంటర్ తరువాత కెనడాలో చదావాలన్నది నా కోరిక. అందుకు తగిన ఏర్పాట్లు జరిగాక కొన్ని కారణాల వల్ల కెనడా చదువు వాయిదా పడింది. ఆ తరువాత కెనడాలో డిగ్రీ పూర్తి చేశాను. నా చదువు పూర్తయ్యే సమయంలోనే దక్షిణాసియా కెనడా అందాల పోటీలు జరుగుతుంటే నన్నూ పాల్గొనమని మా ఫ్రెండ్స్ ఒత్తిడి చేశారు.

### పాల్గొన్నారా?

నాది మగరాయుడి రూపం. క్రాఫ్ కటింగ్, ప్యాంటూ, షర్టూ ఇలా ఉండేది. ఆడపిల్లలతో కలిసి వస్తుంటే మధ్యలో అబ్బాయి ఎవరా? అనుకునేవాళ్ళు తెలియని వాళ్ళు అలాంటిది ఆ పోటీల కోసం నన్ను నేను చాలా మార్చుకున్నాను. జుత్తు పెంచాను. డ్రెస్ మార్చాను. మొత్తానికి నా అవతారాన్నే మార్చుకున్నాను. ఆ పోటీలో 'మిస్ పర్సనాల్టీ' టైటిల్ గెలుచుకున్నాను. దాంతో అడ్వర్టయిజ్‌మెంట్లు రావడం మొదలయ్యాయి.

### మరి సినిమాల్లోకి ఎలా వచ్చారు?

'కృష్ణగాడి వీర ప్రేమగాథ' సినిమా ఆడిషన్స్ జరుగుతున్న సమయంలో ఓ యాడ్ కోసం ఇక్కడికి వచ్చాను. అప్పుడు దర్శకుడు హనుమ రాఘవపూడి గారు నన్ను చూసి నా ఫోటోలు పంపమన్నారు. రకరకాల యాంగిల్స్‌లో కావాలన్నారు. నాకు భారీగా మేకప్ చేసుకున్న ఫోటోలు పంపడం ఇష్టంలేక సెల్ఫీ ఫోటోలు పంపాను. అవి చూసి ఆడిషన్స్‌కి రమ్మన్నారు. అలా ఆ సినిమాలో ఛాన్స్ వచ్చింది.

### ఉత్తరాది అమ్మాయి అయి దక్షిణాదిలో నటించడం ఇబ్బంది అనిపించలేదా?

దక్షిణాదిలో టాప్ హీరోయిన్లు అనిపించుకున్న వారిలో సగం మంది ఉత్తరాది వారే! భాషకు ఆ భేదం ఉంటుందేమో కానీ, నటనకు ఉండదు. దక్షిణాది సినిమాల్లో నటించాలని నిర్ణయించుకున్న తరువాత తెలుగు భాష నేర్చుకోవడం మొదలు పెట్టాను

### మీ డబ్బింగ్ మీరే చెప్పుకుంటారా?

ఇప్పుడే కాదు, భవిష్యత్తులో చెబుతాను. తెలుగు బాగానే వస్తోంది. ఎదుటి వారు చెబుతోంది అర్థమవుతోంది.

### అనుష్క అంటే ఇష్టమన్నట్టున్నారు?

తెలుగు సినిమాలు చేయాలని డిసైడయ్యాక చాలా సినిమాలు చూశాను. అందులో అనుష్క నటించినవి నాకు బాగా నచ్చాయి. నేను తనకి పెద్ద అభిమానిని అయిపోయాను.

### మొదటి సినిమా తరువాత మరో తెలుగు సినిమాకు గ్యాప్ ఎందుకొచ్చింది?

'కృష్ణగాడి వీర ప్రేమగాథ' తరువాత బాలీవుడ్‌లో ఓ సినిమా చేయడానికి వెళ్ళాను. ఆ సినిమా పూర్తయిపోయింది. అందుకే తిరిగి దక్షిణాది సినిమాల మీద దృష్టి పెట్టాను.

### బాలీవుడ్‌లో సినిమాలు చేస్తున్నారా?

నా మొదటి సినిమా విడుదలైన తరువాతే ఇంకో సినిమా చేయాలనుకుంటున్నాను. నా మొదటి సినిమా చేస్తున్న సమయంలోనే చాలా ఆఫర్లు వచ్చాయి. వేటినీ ఒప్పుకోలేదు.

### డ్రీం రోల్స్ ఉన్నాయా?

అలాంటివి ఏమీ లేవు. వచ్చినవాటిల్లో నచ్చినవే చేస్తున్నాను. సందీప్ కిషన్‌తో ద్విభాషా చిత్రం చేస్తున్నాను.

### తమిళ సినిమాలు చూశారా?

'నాను మహన్ అల్లాస్' తెలుగులో 'నా పేరు శివ' అని వచ్చింది. ఆ సినిమా చూశాను. బాగా నచ్చింది. ఆ సినిమా డైరెక్టర్‌తోనే ఇప్పుడు సినిమా చేస్తున్నాను. భాష అర్థం కాదు కానీ, చెప్పిన కథ అర్థం చేసుకున్నాను. ఆ సినిమాకు పూర్తి న్యాయం చేస్తానన్న నమ్మకం ఉంది.

-బి.కె.

## సరదాగా....

### నువ్వే తీసుకో!

పట్నం నుంచి వీరేష్ అడవి చివర్లో ఉన్న గ్రామానికి వేటకు వెళ్లాడు. గ్రామం దగ్గరకు వెళ్లగానే ఓ కుందేలు పారిపోతూ కనిపించింది. గురిపెట్టి కాల్చాడు. అంతే... అది ఎగిరి పక్కనే ఉన్న పొలంలో పడింది. ఆ పొలం యజమాని 'నాపొలంలో పడింది కాబట్టి నాదే' అన్నాడు. కాదు, 'నేను కాల్చాను కాబట్టి నాదే' అన్నాడు వీరేష్. ఇలా కొద్దిసేపు ఇద్దరూ వాదులాడుకున్నాక పొలం యజమానికి ఓ ఆలోచన వచ్చింది. వెంటనే వీరేష్‌తో "ముందుగా నేను నిన్ను ఒక్కసారి కొడతాను, తర్వాత నువ్వు కూడా నన్ను అలాగే కొట్టు. ఇద్దర్లో ఎవరు తక్కువగా అరుస్తారో వాళ్ళకే ఆ కుందేలు!" అని అన్నాడు. సరేనని వీరేష్ ఒప్పుకున్నాడు. ముందుగా రైతు అతన్ని ఈడ్చి కొట్టాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక వీరేష్ విలవిల్లాడి పోయాడు. నేల మీద పడి గిలగిలా కొట్టుకున్నాడు. కొంచెం సమయం తర్వాత ఎలాగోలా తేరుకుని "ఇప్పుడు నా వంతు" అన్నాడు బాధను బలవంతంగా ఆపుకుంటూ... రైతు నెమ్మదిగా "ఒక్క చిన్న కుందేలు కోసం ఇంత గొడవ అవసరమా చెప్పు? ఆ కుందేలేదో నువ్వే తీసుకో!" అన్నాడు.

### ఒక ప్రశ్న?

బ్రెయిన్‌మౌల్డ్ ఇంటర్నేషనల్ స్కూల్! దేశంలోనే స్ట్రిక్ట్ అండ్ బెస్ట్ స్కూల్‌గా దానికి పేరుంది. కేవలం ఇక్కడివారే కాక పక్కరాష్ట్రాల వారు కూడా తమ పిల్లల్ని ఈ స్కూల్లో చేర్పించడానికి పోటీపడుతుంటారు.

ఆస్కూల్లో ప్రవేశం పొందాలంటే పరీక్ష రాయాల్సి ఉంటుంది. పరీక్షలో లాజికల్ ప్రశ్నలే ఉంటాయి. రఘువంశ్ తన కొడుకుని ఆ స్కూల్లో చేర్పించాలనుకున్నాడు. కోచింగ్ సెంటర్లో చేర్పించి కొడుకుని బాగా ప్రిపేర్ చేయించాడు. ప్రవేశపరీక్ష తేదీ రానేవచ్చింది. పరీక్ష అయ్యాక, బయటకి వచ్చిన కొడుకుతో ఎలా రాశావురా? పేపర్ టఫ్‌గా ఉందా? ఈజీగా ఉందా? అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు. వాడు నిదానంగా ప్రశ్నాపత్రాన్ని తండ్రి చేతిలో పెట్టాడు. దానికేసి చూసిన రఘువంశ్ ఒక్కసారిగా నోరుతెరిచాడు. ఎందుకంటే ఆ ప్రశ్నాపత్రంలో కేవలం ఒకే ఒక్క ప్రశ్న ఉంది, "ధైర్యం అంటే ఏమిటి?" అని. నిదానంగా కొడుకుని చూసి మరి నువ్వేం రాశావు? అని అడిగాడు. దానికి కొడుకు నవ్వి కరెక్టుగానే రాశాలే! అని చెప్పి తప్పించుకున్నాడు. వారం తరువాత రిజల్ట్స్ అనౌన్స్ చేశారు. తీరా లిస్ట్‌లో రఘువంశ్ కొడుకు పేరు మొదటిప్లేస్‌లో ఉంది. ఆశ్చర్యపోయిన రఘువంశ్ కొడుకు ఏంరాశాడో చూద్దామని, మేనేజ్‌మెంట్‌ని రిక్వెస్ట్ చేసి అతడి ఆన్సర్‌షీట్ చూశాడు. కొడుకు రాసిన సమాధానం చూసి నవ్వకుండా ఉండలేకపోయాడు. ఇంతకీ రఘువంశ్ కొడుకు ఆ ప్రశ్నకి రాసిన సమాధానమేమిటో ఊహించగలరా? ప్రయత్నించండి.

### సమాధానం

"ధైర్యం అంటే ఇదే"! అని రాసి ఆ స్కూల్లో ప్రవేశం పొందాడు రఘువంశ్ కొడుకు.

## తీన్ మార్

బాచి

యిద్దరు పిల్లలకి పెళ్ళిచేసి నాకున్న యింటిని సమానంగా పంచి చెరొక పోర్షను యిచ్చేశా...

టూటౌన్ పోలీస్ స్టేషన్

డాక్టరు గారు!! ఈమధ్య చూపు బాగా మందగించింది.. నావృత్తి నేను చేసుకోలేక పోతున్నా... కళ్ళు చూసి మంచి కళ్ళజోడు రాయండి!!

బాచి



## 8

### సంతోషానికి సమీపంగా...

ఎప్పుడూ ఏదో ఒక బాధ.... అసలు ఆనందమన్నదే కరువైంది అని చాలామంది ఏదో ఒక సందర్భంలో అనుకునే ఉంటారు కదా! కానీ ఆనందమన్నది బయటెక్కడో లేదు మనలోనే ఉంది. సంతోషాన్ని దూరం చేసే కారణాలకు మనం ఎంత దూరంలో ఉంటే అంత మంచిది. మరి ఆ కారణాలేంటో తెలుసుకుందామా?

## 24

### భార్యాభర్తల మధ్య వయసు ప్రభావం

పెళ్ళి అనగానే మొట్టమొదటగా చూసేది అమ్మాయి, అబ్బాయిల మధ్య ఉన్న వయసు అంతరమే! ఈ అంతరం మరీ ఎక్కువగా ఉంటే ఇబ్బందులు తప్పవంటున్నారు పరిశోధకులు. భార్యాభర్తల మధ్య ఉండే వయసు అంతరం ఎలాంటి ప్రభావాలని చూపిస్తుందో మీరూ తెలుసుకోండి!

## 72

### ఇంటర్వ్యూ

కమెడియన్ విలన్‌గా ప్రేక్షకులను నవ్వుల్లో ముంచెత్తిన నటుడు నర్సింగ్ యాదవ్. ఇప్పటి వరకు ఆరు భాషల్లో సుమారు 400 చిత్రాల్లో నటించారు. సినిమా అంటే ఇప్పుడు పచ్చి వ్యాపారమై పోయిందంటున్న నర్సింగ్‌యాదవ్‌తో ఇంటర్వ్యూ...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: రకుల్‌ప్రీత్‌సింగ్

ఫొటో: గోపీకృష్ణ


*రచనలు, కథలు పంపవలసిన చిరునామా*

**నవ్య వీక్లీ,** *ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33.* email: navyaweekly@andhrajyothy.com





### సర్కస్

**ఇం**జనీర్ ప్రసాద్ ఉద్యోగం వేటలో పడ్డాడు. చదివిన సబ్జెక్ట్‌లో ఉద్యోగం సంపాదించాలని తీవ్రంగా ప్రయత్నించాడు. చాలా ఇంటర్వ్యూలకు హాజరయ్యాడు. ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. దాంతో విసిగెత్తిపోయాడు. ఇంజనీర్‌గా కాదు, ఏదో ఒక ఉద్యోగం దొరికితే చాలు! రెండు పూటలా ఇంత తిండి తినొచ్చనుకున్నాడు. ఓ సర్కస్ కంపెనీ మేనేజర్ని కలిశాడు. ఉద్యోగం కావాలని ప్రార్థించాడతన్ని. నీ చదువుకి తగిన ఉద్యోగం లేదయ్యా అన్నాడు మేనేజర్. కాకపోతే కోతిపోస్టు ఒకటి ఖాళీగా ఉంది. కోతివేషం వేసుకుని, కోతిలా నటిస్తూ ప్రేక్షకులను నవ్వించాలి. నవ్విస్తే రోజుకి అయిదువందలు ఇస్తానన్నాడు మేనేజర్. అంతకంటేనా అన్నాడు ప్రసాద్. వెంటనే ఉద్యోగంలో జాయినైపోయాడు. కోతి వేషం వేసుకుని ప్రేక్షకులను నవ్వించసాగాడు.

కోతిలా నటిస్తూ, నవ్విస్తూ ఒకరోజు పొరపాటున లయన్‌రింగ్‌లోకి వెళ్ళిపోయాడు. అక్కడ నిల్చున్న సింహాన్ని చూశాడు. అయిపోయాననుకున్నాడు. వణికిపోసాగాడు. అతనలా వణికిపోతుంటే పాపం కోతి అని జాలి చెందారు ప్రేక్షకులు. పెద్దగా అరవసాగారు. ఒకపక్క ప్రేక్షకుల అరుపులూ, మరోపక్క ప్రాణభయం, ఏం చేయాలో పాలుపోలేదు ప్రసాద్‌కి. దేవుణ్ణి ప్రార్థిస్తూ కూర్చున్నాడు. నిరుద్యోగం ఎంత ప్రమాదకరం? ప్రాణాలనే తీస్తోంది అనుకున్నాడు. సింహం అడుగులో అడుగు వేసుకుంటూ ప్రసాద్ దగ్గరగా వచ్చింది. పంజా విసర్లేదు సరికదా అతన్నే చూస్తూ నిల్చుంది. ప్రసాద్‌కి అంతా ఆశ్చర్యంగా ఉంది. చెవి దగ్గరగా వచ్చింది సింహం. గుసగుసగా అన్నదిలా.

"ఒరేయ్ ప్రసాద్! భయపడకు! నేనురా! రమణారావుని. 2010 బ్యాచ్, మెకానికల్."

### పడకు పడకు! కిందపడకు!

**స్టూ**లు మీద కూర్చుని తాగుతూ రెండు నిమిషాలకొకసారి కింద పడిపోతున్నాడు ఓ వ్యక్తి. అది గమనించాడు బార్‌టెండర్. పక్క టేబుల్ దగ్గర కూర్చుని పడిపోతున్న వ్యక్తిని తనలాగే గమనిస్తున్న తాగుబోతు నారాయణతో అన్నాడిలా.

"కొంచెం ఆయన్ని ఇంటికి తీసుకెళ్ళి పుణ్యం కట్టుకోవయ్యా.'

సరేనన్నట్టుగా తలూపి, వ్యక్తిని తీసుకుని కారు దగ్గరకు నడిచాడు నారాయణ. కారు దగ్గరకు వెళ్తోంటే దారిలో పదిసార్లు పడ్డాడు ఆ వ్యక్తి. పడ్డ ప్రతిసారీ లేవనెత్తి, ఎలాగైతేనేం కారెక్కించి, ఆ వ్యక్తిని ఇంటికి చేర్చాడు నారాయణ. ఇంటి మెట్లు ఎక్కలేకపోతోంటే ఆ వ్యక్తిని మోసుకుని మరీ తలుపుతట్టాడు. తలుపు తెరుచుకుంది. భార్యేమో! లోపలికి అడుగుపెట్టి పడబోతున్న వ్యక్తిని గట్టిగా పట్టుకుని గుమ్మంలో నిలదొక్కుకుంది.

"సాయంత్రం అయితే చాలు! తాగే ఆ ఒక్కగానొక్క పెగ్గుకోసం బారంటాడు. అదీ పూర్తిగా తాగడు. సరేగాని, ఈయన వీల్‌ఛైర్ ఏది? ఎక్కడ" అడిగింది. నారాయణకి తాగింది దిగిపోయింది.

**-వైనతేయ**

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 39
30-11-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



మొదటి పేజి

# ఊయలకుర్చీ

తాతయ్యా, నాన్నమ్మా ఆరోజు ఎందుకో బాగా గొడవపడ్డారట! ఆ గొడవతో భోజనం చెయ్యకుండానే తాతయ్య కచేరికి వెళ్ళిపోయారట! పొద్దున గొడవపడితే సాయంత్రానికి చల్లబడి, నాన్నమ్మకు ఏదో ఒకటి కొనివ్వడం తాతయ్య అలవాటట! ఆ అలవాటుతోనే ఆ రోజు ఇదిగో ఈ రాకింగ్‌చైర్ కొనిచ్చారట! రాకింగ్‌చైర్‌ని ఊగెడుకుర్చీ అంటే నాన్నమ్మకు నచ్చదు. అదేం మాట అంటుంది. బాగాలేదంటూ అసహ్యంగా చూస్తుంది. ఊయలకుర్చీ అనమంటుంది. ఆ మాటంటే సంతోషిస్తుంది. వీధివైపు బాల్కనీలో ఊయలకుర్చీలో కూర్చుని ఉంటుంది నాన్నమ్మ. ముప్పొద్దులా అందులోనే ఉంటుంది. టిఫిన్ అందులోనే! భోజనం అందులోనే! చదువుకోవడం అందులోనే! సంగీతసాధన అందులోనే! నాన్నమ్మ ఫిడేలు బాగా వాయిస్తుంది. పాతసినిమాపాట పగలే వెన్నెల, జగమే ఊయల ఫిడేలు మీద నాన్నమ్మ వాయిస్తోంటే బలేగా ఉంటుంది. వర్షారాత్రి వాయిస్తోంటే ఆ పాట రుచే వేరు అనిపిస్తుంది. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, చలం సాహిత్యం చదువుతూ, అప్పుడప్పుడూ ఒకటీ అరా జీడిపలుకు నోట్లో వేసుకుని ఊగుతూ, నాన్నమ్మ కుర్చీలో నిద్రపోయే దృశ్యం చూడముచ్చటగా ఉంటుంది. ఎందుకో ఉలికిపడుతుంది. మేల్కొంటుంది. అంతలోనే మళ్ళీ కళ్ళు అరమోడ్చి నవ్వుతూ కునుకు తీస్తుంది.

తాతయ్య పోయిన దగ్గర నుంచే నాన్నమ్మ కుర్చీకి అలవాటైంది. దానికి అతుక్కుపోయింది. కుర్చీ అంటే నాన్నమ్మకు ప్రాణం. దాని గురించి గొప్పగా చెబుతుందామె. ఇది కుర్చీ, కూర్చోడానికే తప్ప, ఇంకెందుకూ పనికి రాదనుకుంటున్నారేమో! కాదర్రా! ఇది బంగారులోకం. ఈలోకంలోకి ప్రవేశిస్తే మనల్ని మనం మరచిపోతాం అంటుంది నాన్నమ్మ. తానేమిటో, తన హోదా ఏమిటో ప్రతివ్యక్తికీ చెప్పే మంత్రపీఠంరా ఈ కుర్చీ అంటుంది. ఎవడు కనిపెట్టాడోకాని ఈ కుర్చీ, వాడికీ జీవితాంతం ఋణపడి ఉండాలంటుంది. ప్రపంచంలో ఈ కుర్చీ గొప్ప ఆవిష్కరణరా అబ్బాయ్ అంటుంది. కుర్చీని కళ్ళకద్దుకుంటుంది. ఇది కదుల్తుంది. కాకపోతే చిత్రంగా ఉన్నచోటే ఉంటుంది. అచ్చు తన పోలికే అంటుంది. కళ్ళు చెమర్చుకుంటుంది.



ఆ కుర్చీలో కూర్చునే నాన్నమ్మ, మనవల హోంవర్కులు చేయించింది. ఆ కుర్చీలో కూర్చునే నాన్నమ్మ, మనవరాళ్ళకు కొంటెకుర్రాళ్ళు రాసిన ప్రేమలేఖలను చించి పోగులు పెట్టింది. ఆ కుర్చీలో కూర్చునే నాన్నమ్మ, పిల్లలకి ఎలా సర్దిచెప్పాలో, పెనిమిటిని ఎలా సముదాయించాలో అమ్మకు చెప్పింది. ఆ కుర్చీలో కూర్చునే నాన్నమ్మ, చాలా విషయాల్లో నాన్నకు ధైర్యాన్ని నూరిపోసింది. ఆ కుర్చీలో కూర్చునే నాన్నమ్మ టీవీలో క్రికెట్‌మ్యాచ్‌లు చూసింది. ఆఖరికి ఆ కుర్చీలో కూర్చునే నాన్నమ్మ చనిపోయింది.

నాన్నమ్మ చనిపోయిన రోజు బాగా గుర్తుంది. దాహం తీర్చుకునేందుకు రాత్రివేళ రెండు మూడుసార్లు లేవడం నాన్నకి అలవాటు. దాహం తీర్చుకుని, అలా నాన్నమ్మను ఓసారి చూసి రావడం కూడా అలవాటతనికి. కుర్చీ సన్నగా ఊగుతోంటే పడుకున్నావా? అని అడిగి, నాన్నమ్మ ఊఁ అంటే వెనుతిరగడం నాన్నకి దిలాసాగా ఉండేది. కుర్చీ ఊగడం ఆగితే అనుమానం అతనికి. అమ్మా అమ్మా అని కంగారుపడేవాడు. గట్టిగా అరిచేవాడు. ఆ అరుపులకి నాన్నమ్మ కోప గించుకునేది. పట్టక పట్టక మంచి నిద్రపట్టిందిరా! చెడగొట్టేవనేది. వెళ్ళంటూ కసురుకునేది. ఆ రోజు నాన్న కంగారు పడి పిలు స్తోంటే నాన్నమ్మ లేవలేదు. నాన్నను కోపగించుకోలేదు. కసురుకోలేదు. దాంతో ఆయన ఒకటే ఏడుపు. అమ్మనీ, పిల్లల్నీ లేపి తీసుకొచ్చారు. అమ్మ! నాన్నమ్మపోయిందని గోల చేశారు. కుర్చీని ఊపుతూ కన్నీరుపెట్టుకున్నారు. అప్పటి నుంచే నాన్నమ్మ కథయిపోయింది. మాకుటుంబచరిత్రలో చిరిగిన పేజి అయిపోయింది. ఆమె ఫిడేలు మూగబోయింది. అయితే ఇప్పటికీ వీధి బాల్కనీలో కుర్చీ ఊగితే మాత్రం నాన్నమ్మ బతికి ఉన్నట్టుగా ఉంటుంది. పిల్లలూ రండర్రా అని ఆమె పిలుస్తున్నట్టుగా ఉంటుంది. పలకరింపుగా ఉంటుంది. పరాచికంగా ఉంటుంది.



## టింగ్ టింగ్

ఎప్పుడో ఒకప్పుడు కొన్ని కొన్ని విషయాల్లో వేరేవాళ్ల సహాయం అవసరమవుతూనే ఉంటుంది. వాటన్నిటి పరిష్కారమే ఈ యాప్. కొత్తగా సిటీలోకి అడుగుపెట్టేవారికి చిటికెలో అడ్రస్ చెప్పేస్తానంటోంది. ఇలా ఇంటి అడ్రస్ మొదలుకొని పెట్రోల్ బంకుల వరకు అన్నింటినీ ఒకే ప్లాట్‌ఫాంపైకి తెచ్చి అరచేతిలోనే సమాచారాన్ని అందిస్తోంది టింగ్ టింగ్ యాప్.

సమస్యలు మొరపెట్టుకోవడానికి మనం దేవుని గుడికెళ్ళి, గంట కొడతాం కదా! ఆ చిన్న బెల్ సౌండ్‌ని ఆధారంగా తీసుకుని టింగ్ టింగ్ అనే పేరు పెట్టామని, యాప్ ఫౌండర్ సందీప్ చెబుతున్నాడు. ఈ యాప్‌ని డెవలప్ చేయడంలో స్నేహితుల అండ లభించిందతనికి,

దేశవిదేశాల్లో ఉన్న అందరినీ ఒక చోటికి చేర్చే మైక్రో సోషల్‌యాప్ ఇది. ఈ యాప్‌లో రిజిస్ట్రేషన్ చేసుకున్న వారంతా మన స్నేహితులే కానవసరం లేదు. గతంలో మనకు పరిచయం ఉన్నవారే కానక్కర్లేదు. ఎవరిదగ్గర నుంచైనా సరే ఈ టింగ్‌టింగ్ యాప్ యూజర్లయితే చాలు, వారి దగ్గర నుంచి సాయాన్ని ఆశించవచ్చు.

ఎవరో తెలియదు, తెలియని వ్యక్తిని సహాయం ఎలా అడగడం అనే భయమేమీ అక్కర్లేదు. ఇది చాలా సెక్యూర్డ్ యాప్! మూడంచెల పద్ధతిలో దీన్ని డిజైన్ చేశారు. మొదటిది మేల్ ఫిమేల్ ఫిల్టర్! మీ సమస్యలను మహిళలకు మాత్రమే చెప్పాలంటే ఆన్‌లైన్లో ఉన్న మహిళలకు మాత్రమే నోటిఫికేషన్ వెళ్తుంది. రెండోది రేడియస్ ఫిల్టర్! అంటే ఏదైనా పర్టిక్యులర్ ఏరియాలో మనకు సాయం కావాలంటే ఆ ఏరియా వరకే నోటిఫికేషన్ పెట్టుకోవచ్చు. మూడోది టైం బాండ్! అంటే మీరు మూవీకి కానీ లేదా ఇంకెక్కడికైనా వెళ్లాలనుకుని వెళ్ళలేకపోయారనుకోండి, ఆ టికెట్ వేస్ట్ అవుతుంది అనుకుంటే ఈ యాప్‌లో పోస్ట్ చేస్తే సరి. వేరేవాళ్లకి అమ్ముకోవచ్చు. ఇలా రూపొందించిన ఈ యాప్‌లో 48 గంటలు దాటిన తర్వాత మీరు పంపిన నోటిఫికేషన్ ఆటోమేటిగ్గా డిలీట్ అయిపోతుంది. ఇందులో మీరు పర్సనల్ చాటింగ్ కూడా చేసుకోవచ్చు కానీ ఇది యూజర్ల ఇద్దరి అంగీకారంపైనే ఆధారపడి ఉంటుంది.

నవ్య

# మెయిల్ బాక్స్

### రోకలితో కొట్టాల్సిందే!

నవంబరు 16వ తేదీ నవ్య వీక్లీ సంచిక వావ్‌లో 'తలకి రోకలిచుట్టాలి' చదివి ఎంతో ఆవేదన కలిగింది. జాలి కలిగింది. విలాసాలమత్తులోపడి, వర్జినిటీని కూడా అమ్మకానికి పెట్టడం శోచనీయం. నిజంగా ఇలాంటివాళ్ళని రోకలితో కొట్టాల్సిందే! ఉక్రెయిన్ అల్లోయువి మొబైల్ సంస్థ వ్యాపారం కోసం ప్రజలతో చెలగాటాలాడుతోంది. ఎన్నో విషయాలు నవ్య వీక్లీ ద్వారా తెలుసుకుంటున్నాం.

-వల్లీపద్మావతి, ఎస్సార్‌నగర్, హైదరాబాద్

### అక్షర వెలుగుల సంచిక

చీకట్లను పారద్రోలే దీపావళి సంచిక విశేషాలు సరికొత్త అక్షర వెలుగులను ప్రసరించాయి. ముఖ చిత్రం అత్యద్భుతం. ప్రతి కవితా హృదయాన్ని హత్తుకునేలా ఉంది. నటి రేవతి ఇంటర్వ్యూ, కోట శ్రీనివాసరావుగారి నటనాజీవిత విశేషాలు బాగున్నాయి. సినీవాలి సీరియల్‌ని చదివించడంతో పాటు మాకొక చీర సొంతం చేసుకునే భాగ్యం కలిగించారు. నవ్యకు సదా అక్షరాభివందనం.

-నీలిమ సబ్బిశెట్టి, రాజానగరం. తూ.గో.జిల్లా

### అవేర్‌నెస్ పెంచిన వ్యాసం

తిండి వేళలూ ముఖ్యమే అంటూ ఈటింగ్ టైమింగ్స్ గురించి రాసిన వ్యాసం మాలో హెల్త్ అవేర్‌నెస్‌ను పెంచింది. బింజ్ ఈటింగ్ డిజార్డర్ గురించి, ఒత్తిడిని అధిగమించే విధానం గురించి బాగా చెప్పారు.

-టి. పద్మావతి, విజయవాడ

### ఆద్యంతం రసభరితం రామాయణం

రావణ సంహారం తర్వాత రాముడు సీతను కలిసి ఆమె క్షేమ సమాచారాలు అడిగి ఆర్తిగా ఓదార్చుతాడు అనుకుంటే "ఇదంతా నీకోసం చేయలేదు, నా వంశ ప్రతిష్ట కోసం చేశాను. నిన్ను అనుమానిస్తున్నాను. నీకిష్టమైన వారితో ఉండు" అని రాముడు అనడం సీతకే కాదు, మాకూ పిడుగుపాటులా అనిపించింది. వాల్మీకి రామాయణంలోనే అలా ఉంటే కాదనలేం. అయ్యో సీతమ్మతల్లీ! అయ్యో! 24 సంవత్సరాలుగా, ఏటా పిల్లల్ని ఒక చోట చేర్చి వారి సృజనకు పదునుపెడుతూ బాలోత్సవ్ నిర్వహిస్తున్న వాసికెక్కిన వాసిరెడ్డి రమేష్‌బాబు ఇంటర్వ్యూ ఆకట్టుకుంది. చదువుకున్నాక పరిగెత్తితే మెమొరీ లాస్ ఉండదని తెలిసి ఆశ్చర్యపోయాం.

-లక్ష్మీప్రసన్న, పేరాజుపేట, తూర్పుగోదావరి జిల్లా

### ఇంటింటా పండుగ చేసిన సంచిక

దీపావళి ప్రత్యేక సంచిక దేదీప్యమానమైన 13 కవితా దీపకాంతులతో, చక్కని సందేశాన్నిచ్చి వెలుగులు విరజిమ్మాయి. పదహారు కథా బాణసంచాలతో, అద్భుతమైన సీరియల్స్, ఫీచర్స్‌తో ఇంటింటా పండుగ చేసింది. దీపం పరబ్రహ్మ స్వరూపం, జ్ఞానానికి చిహ్నం అంటూ దీప ప్రాశస్త్యం తెలియజేశారు. నాలుగు యుగాల లోనూ దీపావళి పండుగ జరుపుకోవడం వెనుకున్న గాథలు తెలుసుకున్నాం.

-సరికొండ శ్రీనివాసరాజు, హైదరాబాద్

### మొదటిపేజీ అద్భుతం

పునీతుడైన నాయుడుకథ మొదటి పేజీలో అద్భుతంగా ఉంది. చదువుతూంటే మేను పులకించి మేమూ పునీతులం అయినట్టు అనిపించింది. చార్లీ చాప్లిన్‌కి సంబంధించిన అన్ని విషయాల్ని తెలియజేసే మ్యూజియం అలరించింది. అలాగే మన హాస్యనటుల పేరిట కూడా అలాంటి మ్యూజియంలు నిర్మిస్తే చాలా

మొదటి పేజి

బాగుంటుంది కదా! అలల అంచులపై రిస్కీ ప్రయాణం ఆకట్టుకుంది. సురభిలో గ్రాడ్యుయేట్ శునకం, పసికూన బహుభాషా ప్రావీణ్యం ఆసక్తికరంగా ఉన్నాయి. బాపు, విశ్వనాథ్, బాలచందర్‌లాంటి క్రియేటివ్ జీనియస్‌లందరూ చివరలో ప్రాభవం కోల్పోయి తెరమరుగు అయినవారే! ఇప్పుడు కృష్ణవంశీ, కోడి రామకృష్ణలాంటి వారి వంతు!

-డి. అభిలాష, సాంబమూర్తి నగర్, తూర్పుగోదావరి జిల్లా

### ఆకట్టుకుంటున్న నవ్యవీక్లీ

16-11-2016 నాటి నవ్యవీక్లీ కీర్తి సురేష్ ముఖచిత్రంతో ఆహ్లాదకరంగా ఉంది. మార్నింగ్ కాఫీ ఆద్యంతం కడుపుబ్బా నవ్వించింది. మొదటి పేజి వనభోజనం హృద్యంగా ఉంది. ఆరోగ్యంగా ఉండాలంటే ఆనందం కావాలనీ, ఆ ఆనందాన్ని పొందాలంటే ఎక్కడెక్కడో దొరకదు మనచేతుల్లో మనమే సంపాదించుకోవాలని చాలా చక్కగా అర్థమయ్యేలా చెప్పారు. వెట్టి సీరియల్ చదువుతుంటే ఒక ఫ్యాక్షన్ సినిమా చూస్తున్నట్లుగా అనిపిస్తోంది. మధుమేహంపై అవగాహన కలిగించినందుకు రచయిత్రికి ధన్యవాదాలు. మనసున్న మారాజులు.... నిజంగా ఈరోజుల్లో అలాంటి వారున్నారంటే గ్రేటే! రచయిత్రి, సీనియర్ జర్నలిస్ట్ కె.బి.లక్ష్మి ఇంటర్వ్యూ బాగుంది. కథలూ, నవలలతో నవ్య మరింత కొత్తరూపును సంత రించుకుని మా ఇంటిల్లపాదినీ చదివింపచేస్తోంది.

- డి. మనోజ్‌కుమార్, విజయవాడ

ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్, 040-4959 4959




డా|| జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360 / 040-4959 4959


# ఫ్రోజెన షోల్డర్ సమస్యను ముందే గుర్తిస్తే ముప్పు తక్కువ

## అందుబాటులోకి మెరుగైన చికిత్సా విధానాలు

బాధ్యతంతా భుజస్కంధాలపైనే అనే మాటలు ప్రతిరోజూ వింటూనే ఉంటాం. మన శరీరంలో భుజానికి ఉన్న ప్రాధాన్యత అలాంటిది. దాదాపు మనం చేతులతో చేసే ప్రతి పనిలోనూ భుజం కీలును ఉపయోగించాల్సి వస్తుంది. అలాంటి భుజంలో ఏదైన సమస్య ఎదురైతే రోజువారీ పనులు చేసుకోవడంలో చాలా ఇబ్బందులు ఎదురవుతాయి. భుజాలకు వచ్చే సమస్యలలో ఫ్రోజెన్ షోల్డర్ ఒకటి. ఈ సమస్య పట్ల అవగాహన పెంపొందించుకుని సకాలంలో చికిత్స తీసుకుంటే దీనిని సులువుగా అధిగమించవచ్చు.

### ఫ్రోజెన్ షోల్డర్ అంటే...?

ఫ్రోజెన్ షోల్డర్ అంటే భుజం బిగుసుకుపోయి ఉండడం. భుజంలో ఒక బంతి ఆకారంలోని కీలు, మూడు ఎముకలు పైచేయి ఎముక(హ్యూమరస్), షోల్డర్ బ్లేడ్(స్కాపుల), కాలర్‌బోన్(క్లావికల్) సాకెట్‌లు ఉంటాయి. పైచేయి ఎముక, షోల్డర్ బ్లేడులోని సాకెట్‌లో ఫిట్ అయి ఉంటుంది. భుజం కీలు బలమైన కణజాలం, క్యాప్సుల్, లిగమెంట్‌తో నిర్మితమై ఉంటుంది. ఫ్రోజెన్ షోల్డర్ సమస్యలో భుజం బిగుసుకుపోయి విపరీతంగా బాధిస్తుంది. ఈ సమస్య సరైన కారణాలు తెలియవు కానీ మధుమేహ రోగులలో ఎక్కువగా వస్తుంది. సంక్లిష్టమైన ఈ నిర్మాణంలో భుజం కీలు అంతా బాగానే ఉన్నప్పటికీ క్యాప్సూల్ భాగం బాగా మందంగా మారుతుంది. భుజం కదలికలు చాలా పరిమితంగా మారతాయి. చాలా కేసులలో కీళ్ల జాయింట్ల మధ్య ఘర్షణను తగ్గించే సైనోవియల్ ద్రావణం తక్కువగా ఉంటుంది.

### లక్షణాలు

- భుజం కదలికలు చాలా పరిమితంగా మారతాయి. కొన్ని సందర్భాలలో భుజాన్ని కదలించడానికి ఇతరుల సహాయం తీసుకోవాల్సి రావడం.
- బట్టలు ధరిస్తున్న సమయంలో, తల దువ్వుకుంటున్న సమయంలో నొప్పి రావడం.
- భరించలేనంతగా భుజం నొప్పి ఉండడం.



### ఫ్రోజెన్ షోల్డర్‌లో మూడు దశలు ఉంటాయి

**ఫ్రీజింగ్:** ఫ్రీజింగ్ దశలో భుజం నొప్పి క్రమంగా పెరుగుతూ ఉంటుంది. నొప్పి పెరిగే భుజం కదలికలు తగ్గిపోతూ ఉంటుంది. ఈ దశ ఆరు వారాల నుంచి తొమ్మిది నెలల వరకు ఉండవచ్చు.

**ఫ్రోజెన్:** ఈ దశలో భుజం నొప్పి లక్షణాలు బాగా బాధిస్తుంటాయి. ఈ దశలో రోజువారి కార్యకలాపాలలో తీవ్ర ఇబ్బంది కలుగుతూ ఉంటుంది. నాలుగు నుంచి ఆరు నెలలు పాటు భుజం బిగుసుకుపోయినట్లు ఉంటుంది.

**తావింగ్:** ఈ దశలో భుజం కదలికలు నెమ్మదిగా సాధారణ స్థితికి తిరిగి వస్తుంది. ఈ ప్రకియ ఆరు నెలల నుంచి రెండు సంవత్సరాల వరకు కొనసాగవచ్చు.

### కారణాలు

ఫ్రోజెన్ షోల్డర్ సమస్యకు సరైన కారణాలు పూర్తిగా తెలియవు. కానీ మధుమేహ రోగులలో 10-20 శాతం ఈ సమస్య వచ్చే అవకాశం ఉంటుంది. దాంతోపాటు పార్కిన్‌సన్ వ్యాధి ఉన్నవారిలో, గుండెజబ్బులు, హైపోథైరాయిడిజం, హైపర్‌థైరాయిడిజం ఉన్నవారిలో ఈ సమస్య ఉత్పన్నం అయ్యేఅవకాశం ఉంటుంది. సర్జరీ, ఫ్రాక్చర్ వంటి కారణాల వల్ల భుజం కదలకుండా ఉండటం వల్ల కూడా ఫ్రోజెన్ షోల్డర్ అభివృద్ధి చెందే అవకాశం ఉంటుంది.



### జాగ్రత్తలు

- ఎక్కువగా బరువులు ఎత్తకూడదు.
- రెగ్యులర్ భుజాల వ్యాయామం చేయడం మంచిది.
- విరామం లేకుండా పనిచేస్తున్నప్పుడు కొంత సమయం విరామం తీసుకోవడం మంచిది.
- విపరీతమైన భుజాల కదిలికలు చేయకూడదు.

### నిర్ధారణ పరీక్షలు

వైద్యుడు, రోగిని పరీక్షించిన సమయంలోనే చాలా వరకు ఈ సమస్య తెలిసిపోతుంది. కొన్ని సందర్భాలలో ఎక్స్-రే, ఎంఆర్ఐ పరీక్షలు అవసరమవుతాయి.

### చికిత్స

సాధారణంగా ఫ్రోజెన్ షోల్డర్ సమస్యలో నొప్పిని తగ్గించి, భుజం కదలికలను మెగురుపరచడానికి చికిత్స అందిస్తారు. నొప్పి తీవ్రంగా ఉంటే పెయిన్ కిల్లర్స్, యాంటీ-ఇంఫ్లమేటరీ పెయిన్ కిల్లర్స్‌తో పాటు భుజానికి సంబంధించిన వ్యాయామాలు చేయించడం, ఫిజియోథెరఫీ చేయిస్తారు. అవసరాన్ని బట్టి స్టెరాయిడ్ ఇంజక్షన్ ఇస్తారు.

### సర్జరీ

ఫ్రోజెన్ ఫోల్డర్ సమస్యను తగ్గించడానికి ఇతర చికిత్సలు పనిచేయని సందర్భాలలో సర్జరీ నిర్వహించవలసి ఉంటుంది. అవసరాన్నిబట్టి వివిధ పద్ధతులలో సర్జరీ నిర్వహిస్తారు.

**మానిపులేషన్:** ఈ విధానంలో రోగి మత్తులో ఉండగా సర్జన్ భుజాన్ని కదిలిస్తూ సర్జరీ నిర్వహిస్తారు.

**ఆర్థ్రోస్కోపిక్ క్యాప్సులర్ రిలీజ్:** ఇది కీహోల్ విధానంలో చిన్న కోతతో నిర్వహించే సర్జరీ. ఈ విధానంలో భుజం కండానికి బిగుసుపోయిన క్యాప్సూల్‌ను ప్రత్యేక పద్ధతిలో తొలగిస్తారు. ఫ్రోజెన్ షోల్డర్ సర్జరీలలో మెరుగైన ఫలితాలు లభిస్తున్నాయి.

# సంతోషానికి సమీపంగా...



**ఎప్పుడూ ఏవో బాధలు...సంతోష మన్నదే కరువైంది అని మనలో చాలామంది ఏదో ఒక సందర్భంలో అనుకోకుండా ఉండరేమో! బాధలు, సంతోషాలు ఒకదానివెంట ఒకటి వస్తూ పోతూనే ఉంటాయి. కష్టాలు, కన్నీళ్లు, సమస్యలు... ఇవేవీ లేకుండా ఆనందంగా ఉండాలని ఎవరు కోరుకోరు చెప్పండి. కానీ ఒక్కోసారి అదుపు తప్పిన భావనల వల్ల ఆ ఆనందం కాస్తా ఆవిరై పోతుంది.**

సంతోషకరమైన జీవితం అంటే ఏమిటి? అసలు సంతోషం అనేది ఎలా వస్తుంది? చాలామంది సంతోషాన్ని ఏదో ఒక అంశంలో వెతుక్కుంటూ ఉంటారు. కానీ బయట ఎక్కడో సంతోషం దొరుకుతుందని అనుకుంటే మీరు పొరబాటు పడినట్లే లెక్క! అది మనదగ్గరే ఉంటుంది. కానీ దాన్ని గుర్తించే మార్గాలు కావాలి. కొన్ని కొన్ని కారణాల వల్ల దాన్ని మనం దూరం చేసుకుంటున్నాం. అందుకే సంతోషాన్ని దూరం చేసే కారణాలకు మనం ఎంత దూరంగా ఉంటే అంత మంచిది! మరి అలాంటి కారణాలేంటి? సంతోషంగా ఉండాలంటే ఏంచేయాలి? అనే విషయాలను తెలుసుకోండి!!

### గొప్పలకు పోకండి!

మనలో చాలామందికి ఎవరి గొప్పలు వారే స్వయంగా చెప్పుకోవడం, తమను తామే పొగుడుకోవడం లాంటి అలవాట్లు ఉంటాయి. కానీ ఇలాంటివి అస్సలు చేయకూడదట. అలా పాటిస్తే జీవితంలో ఏదో ఒకరోజున తప్పకుండా బాధపడతారట. కొన్ని సందర్భాల్లో పతనమైపోతారట కూడా. అందుకే ఎవరికి వారు సొంత డబ్బా కొట్టుకోకూడదంటున్నారు పరిశోధకులు. అలాగే ఎదుటివారిలో తప్పులను కూడా ఎంచకూడదట. కొందరు ఎల్లప్పుడూ తమ తప్పులను కాకుండా ఎదుటివారి తప్పులను వెతికి పట్టుకోవడమే పనిగా పెట్టుకుంటారు. అలాంటి వారు కూడా సంతోషకరమైన జీవితం గడపలేరట. తమ తప్పులను మాత్రమే తెలుసుకుని ముందుకు సాగేవారే సంతోషకరంగా ఉంటారుట.

### అసూయ పడకండి!

సంతోషాన్ని దూరం చేసే కొన్ని అంశాలలో అతి ముఖ్యమైనది అసూయ. కొంతమందిలో ఇది పైకి కనిపించదు, కొంతమందిలో కనిపిస్తుంది. ఇది ప్రవర్తన, మాటతీరును బట్టి వ్యక్తమవుతూ ఉంటుంది. ఉదాహరణకి పక్కింట్లోవారు ఏదైనా కొత్త వస్తువు తెచ్చుకుంటే నాకు లేదే అని కలిగే ఒకరకమైన మానసిక భావం. దీని వల్ల మన మానసిక ప్రశాంతతకే భంగం కలుగుతుంది. అంటే ఇలాంటి ప్రతికూల ఆలోచనల వల్ల మనమే కాదు మనతో ఉన్నవారు కూడ ఇబ్బంది పడాల్సి వస్తుంది. మన సంతోషమూ పోతుంది.

### ఆందోళన కూడదు..

కొందరు ప్రతి చిన్న విషయానికే భయపడుతూ, ఆందోళన పడుతూ ఉంటారు. మనసును కుంగదీసి ఆనందాన్ని పోగొట్టే అంశాలలో అవి కూడా ఉన్నాయి. చిన్న విషయాలకే భయపడిపోవడం, పనులు అవుతాయో లేదో, ఎలా ఉంటుందో ఏమిటో అని అనవసరంగా ఆందోళన చెందడం వల్ల సంతోషంగా గడపలేరట. ఇలాంటి భావనలు మనసులో చేరడం వల్ల మనమీద మనకుండే నమ్మకాన్ని కూడా కోల్పోతారట. ఎలాంటి సందర్భాలు ఎదురైనా ధైర్యంగా ఎదుర్కొనే మనస్తత్వం అలవరుచుకోవడం మంచిది. దీంతో సానుకూల దృక్పథం, ఆనందం రెండూ మీ సొంతమవుతాయి.

### డల్‌గా ఉండకండి

ఎలాంటి బాధలు లేకున్నా సరే కొందరు ఏదో కోల్పోయినట్లు విచారంగా ఉంటారు. ఏదైనా అడిగినా సరే ముభావంగా డల్‌గా సమాధానమిస్తారు. కొందరైతే ప్రతి చిన్న విషయానికీ కలత చెందుతుంటారు. కొందరు ఏదైనా జరగరానిది జరిగితే ఆ సంఘటనను అప్పుడే వదిలేసి తిరిగి ఏమీ జరగనట్లు ఉంటారు. మరికొందరేమో దాన్నే తలుచుకుని తెగబాధపడిపోతూ ఉంటారు. ఇలా తలుచుకుని బాధపడడం వల్ల ఏమీ ప్రయోజనం ఉండదు. ఒకవేళ మీ తప్పు వల్ల ఆ సంఘటన జరిగినట్లయితే వెంటనే దానికి క్షమాపణ చెప్పండి. అలా చెప్పడం వల్ల మనసు ప్రశాంతంగా ఉంటుంది. ఫలితంగా మీరు కూడా

### ఇవి తింటే చాలు!



**సం**తోషంగా ఉండాలంటే, ఆహారంలో ఇవి భాగం చేసుకోవాలంటున్నారు పరిశోధకులు. పండ్లూ, కూరగాయలూ అధికంగా తినడం వల్ల ఆరోగ్య స్థాయితో పాటు జీవితంలో ఆనందం స్థాయిలు కూడా పెరుగుతాయని తాజా అధ్యయనంలో వెల్లడైంది. ఈ అంశంపై భారీస్థాయిలో శాస్త్రీయంగా చేపట్టిన తొలి యత్నంగా భావిస్తున్నారు. అసలేమాత్రం పండ్లు, కూరగాయలు తినే అలవాటు లేని వారు రోజుకు ఎనిమిదిపాళ్లు తిన్నప్పుడు జీవన సంతృప్తి పెరిగినట్లు ఈ పరిశీలనలో గుర్తించారు. పండ్లూ, కూరగాయలూ తినడం వల్ల మానవ మెదడు ఆరోగ్యంగా, సంతోషంగా ఉత్తేజం పొందుతుందని యూకేలోని వార్విక్ యూనివర్సిటీ పరిశోధకులు ఆండ్రూ ఓస్వాల్డ్ చెబుతున్నారు. పండ్లు, కూరగాయలు అధికంగా తీసుకోవడం వల్ల కేన్సర్ వంటి వ్యాధులపై వాటి ప్రభావం కనిపించడానికి ఏళ్ల కొద్దీ సమయం పట్టినా, మానసిక ఆనందం త్వరగా కనిపిస్తుందని వారు పేర్కొన్నారు. 12 వేల మందిపై చేపట్టిన ఈ పరిశోధన ద్వారా ఈ విషయాన్ని నిర్ధారించారు.



సంతోషంగా ఉంటారు. పగలు, ప్రతీకారాలు వంటి వాటికి దూరంగా ఉంటే మంచిది. వాటిని పెంచుకుంటూ పోతే ఒరిగేది ఏమీ లేకపోగా ఉన్న సంతోషం కూడా ఆవిరైపోతుంది. అందుకే ఇతరులపైన ఉన్న వ్యతిరేక భావాలను వది లేసి, మనసును ఎప్పుడూ ప్రశాంతంగా ఉంచు కోవాలి. అప్పుడు ఆనందం కూడా మీదగ్గరే ఉంటుంది.

## వయసుతో తగ్గుతున్న సంతోషం

వయసు పెరుగుతున్న కొద్దీ సంతోషం తగ్గుతోందని అమెరికాలో జరిగిన ఓ అధ్య యనం చెబుతోంది. ముఖ్యంగా 30 ఏళ్ల దాటిన వారిలో ఇది కనిపిస్తుందట! వారి తల్లిదండ్రులు అదే వయస్సులో పొందిన ఆనందాన్ని వీళ్ల పొందలేకపోతున్నారని, జీవితంలో బోలెడు సౌకర్యాలున్నా కూడా ఇటువంటి పరిస్థితి నెలకొందని ఈ అధ్య యనం చెబుతోంది.

అమెరికాలోని పలు విశ్వవిద్యాలయాలు కలిసి చేసిన ఈ పరిశోధనలో కొన్ని ఆసక్తిక రమైన విషయాలు వెల్లడయ్యాయి. వయ సులో ఉన్నవారు ఉన్నతస్థాయి అంచనాలు పెట్టుకోవడం, గొప్ప కలల్ని కనడం వంటి వాటితో సంతోషంగా ఉన్నట్లు కనిపిస్తుందట. అయితే వయస్సు పెరిగిన కొద్దీ వారిలో భారీ అంచనాలు లేకపోవడంతో ఇలా సంతోషానికి దూరమవుతున్నాయని వారు చెబుతున్నారు.

## ఊహాగానాలు వద్దు

కొంతమంది ఏదో జరుగుతుందని, పరిస్థి తులు, సందర్భాల గురించి పట్టించుకోకుండా భవిష్యత్తుకు సంబంధించి అతిగా ఊహించు కుంటుంటారు. ఆశపడడం కరక్టే కానీ, అతిగా ఆశపడి లేనిపోనిది ఊహించుకుంటే తీరా అంచనాలు నెరవేరకపోతే చాలా బాధపడు తుంటారు. అందుకే స్థితిగతులు దృష్టిలో పెట్టు కుని, చిన్నచిన్న లక్ష్యాలు పెట్టుకుంటూ, వాటిని సాధిస్తూ, అనుకున్న కలలను సాకారం చేసు కోవడానికి ప్రయత్నించాలి. ఇష్టపడి చేసే పనిలో విజయం సాధిస్తే దానిలో పొందే ఆనందం అంతాఇంతా కాదు!

## ప్రతిదానికీ ఆధారపడకూడదు

కొందరు ప్రతి చిన్న విషయానికీ ఇతరు లపై ఆధారపడుతుంటారు. కొందరేమో స్వతం త్రంగా జీవించాలని కోరుకుంటారు. అయితే ప్రతిసారి ఎదుటివారిపైన ఆధారపడడం కాకుండా పరిస్థితులను ఎదుర్కొని, నిలదొక్కు కునే ప్రయత్నం చేయాలి. అంతేకాని నిస్సహా యంగా ఇతరులపైన ఆధారపడి జీవించ కూడదు. అలాగే అవసరమున్నది కదా అని ప్రతి చిన్నదానికి ఇబ్బడిముబ్బడిగా అప్పులు చేయకూడదు. మనకు ఉన్నంతలోనే బతక డాన్ని అలవాటు చేసుకోవాలి. ఎందుకంటే అప్పు తీర్చలేకపోతే, ప్రతిక్షణం టెన్షన్‌తోనే బత కాలి. అప్పు చేసిన దగ్గర నుంచి మనిషి జీవి తంలో ఆనందం కనుమరుగవుతుంది.

## నిజాయతీగా ఉండండి

ఒకసారి అబద్ధం ఆడారంటే దాన్ని కప్పిపుచ్చు కోవడానికి కొన్ని వందల అబద్ధాలాడాల్సి వస్తుంది. అయితే సాధ్యమైనంత వరకు అన్ని సందర్భాల్లోనూ నిజాయతీగా వ్యవహరించడం చాలా మంచి లక్షణం. అలా నిజాయతీగా ఉండే వారికి ఆత్మవిశ్వాస స్థాయి పెరిగి సంతోషం ఎప్పుడూ దగ్గర్లోనే ఉంటుంది. అలా కాకుండా ప్రతిదానికీ అబద్ధాలు చెబితే నష్టపోయేది మనమే అని గుర్తుంచుకోవాలి. తోటివారికి చేత నైనంత సాయం చేసినప్పుడు కలిగే ఆనందం అంతా ఇంతా ఉండదు. ఎంతసేపూ నేను..నా అంటూ అలానే ఉండిపోతే ఈ లోకంలో మనకి మనం తప్ప ఎవరూ ఉండరు. అందుకే స్వార్థం పక్కన పెట్టి అందరితోనూ కలిసిమెలిసి ఉంటూ వీలైనంత వరకు ఇతరులకు సహాయం చేయడానికి ప్రయత్నించాలి.

## చాలామంది ఈ పనే చేస్తున్నారు

సంతోషంగా ఉండడానికి ఏం చేస్తున్నారు అని అడిగితే వారు చెప్పిన సమాధానం విని పరిశోధకులు ఆశ్చర్యపోయారట. ప్రపంచం లోని 134 దేశాలకు చెందిన 18 వేల మందిని ఈ ప్రశ్న అడగ్గా 68 శాతం మంది ఒకేలా సమాధాన మిచ్చారు. తాము సంతోషంగా ఉండేందుకు మిగతావారి కంటే ఎక్కువ విశ్రాంతి తీసుకుం టున్నట్టు చెప్పారు. కేవలం పదిశాతం మంది మాత్రం తమకు తక్కువ విశ్రాంతి సరిపోతుం దని చెప్పారు. బ్రిటన్‌లోని దర్హమ్ శాస్త్రవేత్తలు నిర్వహించిన అధ్యయనంలో ఈ విషయం వెల్లడైంది. ఈ పరిశోధనలో విశ్రాంతి అలవా ట్లలో 58 శాతం మంది చదువుకోవడంలో గడి పేస్తుండగా, ప్రకృతిలో గడపడాన్ని 53.1 శాతం మంది, ఒంటరిగా ఉండడాన్ని 52.1 శాతం మంది, సంగీతం వినడాన్ని 40.6 శాతం మంది కోరుకుంటున్నట్టు, 40 శాతం మంది మాత్రం ప్రత్యేకంగా ఏమీ చేయడం లేదని ఈ అధ్యయనంలో వెల్లడైంది.

**- సంతోషి**



# నిలువు దోపిడి

## -సింహప్రసాద్

**మా ఇంటికి వరద వచ్చినట్టుగా ఉంది.**

**పూనే నుంచి మా పెద్దబ్బాయి రామ్, కోడలు మీనా, పిల్లలూ వచ్చారు.**

**మేమిద్దరం కోణార్క్, పూరి, కలకత్తా టూర్‌కి వెళదామనుకుంటున్నామని, మావాడికి ముందే చెప్పాను. కోణార్క్ దేవాలయాన్నీ, పూరీ జగన్నాథుణ్ణి దర్శించాలనుందనీ, ఠాగూర్ శాంతినికేతన్‌లో తిరిగి శ్రీశ్రీ వర్ణించిన కలకత్తా కాళిక నాలికనీ, ఉగ్రరూపాన్నీ చూడాలని ఎప్పట్నుంచో అనుకుంటున్న సంగతీ చెప్పాను.**

**అయినా పెద్దోడు వినలేదు.**

"తర్వాతెప్పుడైనా వెళ్లదురుగాన్లే డాడీ! మేం మా ప్రోగ్రాం వాయిదా వేసుకోలేం. మీనాకి లీవ్ శాంక్షనైంది. పిల్లలకి వేసవి సెలవులిచ్చేశారు. వచ్చేస్తున్నాం" అంటూ దిగబడిపోయారు.

పండగలకీ పబ్బాలకే కాదు పిల్లలకి వారం రోజులు సెలవులొస్తే చాలు, వాళ్ళని తీసుకుని వైజాగ్‌నుంచి వచ్చేస్తుంది మా అమ్మాయి అలివేలు. పెద్దన్నయ్యవాళ్ళు వస్తున్నారు గనుక ఈసారికి రావద్దన్నా వినిపించుకోలేదు.

"మీ దగ్గరికి కుదరకపోతే మా అత్తారింటికి వెళ్దామని కూర్చుంటారు మీ అల్లుడు. అక్కడ నాకు ఊపిరాడదు. ఇక్కడైతేనే రెస్టుగా ఉంటుంది. అయినా మేం ఎప్పుడో రిజర్వేషన్ చేయించేసుకున్నాం నాన్నా! మీ అల్లుడుగారు కూడా వస్తున్నారు" అంటూ తన ముగ్గురు పిల్లల్నీ, భర్తనీ తీసుకుని వచ్చేసింది మా ముద్దుల కూతురు.

అమెరికా నుంచి మా చిన్న కోడలు కీర్తన కూడా ఈ మధ్యే వచ్చింది.

"జూన్‌లో పంపించరా... అప్పటికంతా వెళ్ళిపోతారు" ఆపటానికి చెప్పినా మా చిన్నోడు లక్ష్మణ్ చెవికెక్కించుకోలేదు.

"మీ దగ్గరేం ఉండదు డాడీ. కారియింగ్ కదా, పుట్టింట్లో ఉండాలని ఉబలాటపడుతోంది" అన్నాడు.

ఆమె వచ్చి, మా దగ్గర రెండ్రోజులుండి పుట్టింటి కెళ్ళిందల్లా, మూడోరోజునే తిరిగొచ్చేసింది.

"ఆ మాయదారి పల్లెటూళ్ళో పగలంతా కరెంటు కట్టే అంకుల్. అక్కడ ఉండటం నాతరం



కాదు బాబోయ్" అనేసింది కీర్తన!

మాది హైదరాబాద్ మహానగరంలో టూబెడ్ రూం అపార్ట్‌మెంట్. నీళ్ళకేం ఇబ్బంది వచ్చిపడుతుందోనని నా బెంగ.

"పనిమనిషి ఎగ్గొడితే ఎలాగండీ ఖర్మా!" ఇది మా ఆవిడ సుమ ఆందోళనతో కూడిన భయం.

ఒకరికి టిఫిను, మరొకరికి కాఫీ, ఇంకొకరికి పాలు ఇస్తూ మధ్యమధ్య పనిమనిషికి పనులు పురమాయిస్తూ నానా హైరానా పడుతోంది సుమ.

పిల్లలు ఆటబొమ్మల కోసం గొడవ పడుతున్నారు. గోల చేస్తున్నారు.

అయినా నిమ్మకి నీరెత్తినట్టు సోఫాలో కూర్చుని, టీపాయ్ మీద కాళ్ళు చాచిపెట్టుకుని, దినపత్రిక ఆమూలాగ్రం చదువుతున్నాను.

"మీ పేపరెక్కడికీ పోదుగాని దాన్ని పక్కనబెట్టి కాస్త వీటి గింజలు ఒలిచిపెట్టండి" కోసిన మూడు దానిమ్మ పండ్లూ, పళ్ళెమూ నా చేతిలో పెట్టింది ఇల్లాలు.

"నేనా?!"

"ఈ మాత్రానికే అరిగిపోరులెండి. కీర్తనకి రోజూ దానిమ్మ జ్యూస్ ఇస్తున్నాను. వట్టి మనిషి కాదుగా!" అంటూ వెళ్ళిపోయింది.

బ్యాంకు మేనేజర్‌గా పనిచేసి రిటైరైన నాకు ఇలాంటి పని అప్పగించింది. రిటైరైతే చాలు ఇల్లాలికి బాగా లోకువైపోతాం.

ముఖాన గంటు పెట్టుకుని ఆడవాళ్ళెవరైనా 'మేం చేస్తాంలెండి, మీకెందుకీ శ్రమ' అంటూ ముందుకొస్తారేమోనని ఆశగా చూశాను.

పెద్దకోడలు మీనా ఐపాడ్‌లో మునిగిపోయింది. మా అబ్బాయిలా ఆమె కూడా సాఫ్ట్‌వేర్ ఇంజనీరే! మా ఇంటికొస్తే చాలు, ఏ పనీ ముట్టుకోదు.

కీర్తన నీరసంగా కూర్చుని అడ్డూ అదుపూ లేకుండా సెల్‌ఫోన్లో మాట్లాడుతోంది. పొరబాటున 'అదిలా అందియ్యమ్మా' అంటే చాలు 'హమ్మో నీరసం!' అంటుంది.

"అయిదో నెలకే అంత ఆపసోపాలు పడక్కర్లేదు. ఉత్సాహంగా పనీపాటా చేస్తే నీకూ, కడుపులోని బిడ్డకూ ఎంతో మంచిది. డాక్టర్లూ ఆ మాటే చెబుతున్నారు. మా బ్యాంకులో తొమ్మిదోనెల వచ్చాక కూడా డ్యూటీకొచ్చేవారు తెలుసా?" అని ఓసారి చిన్నకోడలికి క్లాసు పీకానుగాని తనకి కాదన్నట్టుగా ఉండిపోయింది!"

ఇక తను తాగే జ్యూసు గ్లాసు కూడా చేతికందివ్వాల్సిందే! ఏమైనా మాట తూలితే అలకలూ, కోపాలూ, ఆపైన ముక్కు చీదుళ్ళూ!

ఇహ మా అమ్మాయైనా కలిసొస్తుందేమోనని చూశాను. తన చిన్న కూతురు తిననని గోల చేస్తోంటే బలవంతాన ఇడ్లీ కుక్కుతోంది.

నిట్టూర్చి, దానిమ్మ గింజలు ఒలిచి, సుమకి అప్పగించాను. వెంటనే వాటిని మిక్సీలో వేసి, జ్యూస్ చేసి కీర్తనకిచ్చింది. అది తాగుతూనే కబుర్లు కంటిన్యూ చేసిందామె.

"స్నానానికెళ్తున్నాను, పిల్లల్ని కాస్త చూస్తూండండి..." అంటూ వెళ్ళబోయింది సుమ.

సరిగ్గా అప్పుడు పెద్దోడు నిద్రలేచి ఒళ్ళు విరుచుకుంటూ వచ్చాడు.

"మమ్మీ, కాఫీ.." అరిచాడు పేపర్ అందుకుంటూ.

"ఇదిగో తెస్తున్నాన్రా" వంటింట్లోకి ఒక్కంగలో వెళ్ళి చిక్కని ఫిల్టరు కాఫీ తెచ్చిచ్చింది.

"బావ ఎక్కడా, కనిపించరేం? కాఫీ చప్పరిస్తూ అడిగాడు.

"ఇక్కడ వాళ్ళ సర్కిలాఫీసులో ఏదో పనుందని వెళ్ళాడు. నిన్ను ఆన్‌సైట్‌కి అమెరికా పంపిస్తానన్నారుగా, అదెంతవరకూ వచ్చిందిరా రామ్"

"ఇదిగో అదిగో అంటున్నారు. ఇంకో ఏడాదిలో పంపకపోతే వేరే కంపెనీకి మారిపోతాను"

"దూకుడొద్దు. కొంచెం నిదానించు. లాయల్టీ ఆల్వేస్ పేస్..."

"ఇవి పాత రోజులు కాదు డాడ్! రిజైన్ చేస్తామని బెదిరిస్తేనే మన గురించి సీరియస్‌గా ఆలోచిస్తారు"

ఇంతలో మీనా ఓ వారపత్రిక పట్టుకొచ్చింది. అట్ట వెనుకనున్న నగల దుకాణం వారి ప్రకటన చూపిస్తూ, "ఈ డైమండ్ నెక్లెస్ ఎలా ఉంది?" రామ్‌ని అడిగింది.

"డిజైన్ బావుంది..."

"కీర్తన నెక్లెస్ కన్నా పోష్‌గా లేదూ? త్రీ పాయింట్ ఫైవేనట!" ఊరికే ఇచ్చేస్తున్నారన్నట్టుగా అంది.

"మనం విల్లా కొందామని చూస్తున్నాంగా. ఇప్పుడీ ఖర్చెందుకు?"

"మీరేం కొనక్కర్లేదులెండి. నా శాలరీ సేవింగ్సుతో కొనుక్కుంటాను" గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయింది.

క్రితం ఏడాది ఇండియా వచ్చినప్పుడు కీర్తన డైమండ్ నెక్లెస్ కొనుక్కుంది. ఆరునూరైనా ఇప్పుడు మీనా కొనేస్తుంది. వచ్చే ఏడాది "నేనూ కొనుక్కుంటాను. మీ అల్లుడుగారు అంత డబ్బు లేదంటున్నారు. నువ్వు కొంచెం సర్దు డాడీ" అని అలివేలు గోముగా అడగడమూ ఖాయమే!

ఎంత చదివినా ఎంత పెద్ద ఉద్యోగాలు వెలగబెడుతున్నా ఆడవాళ్ళకి నగలు, చీరల పిచ్చి పోదు కాబోలు! పాపం సుమ ఎన్నడూ అవి కొనమని ఒత్తిడి తేలేదు. కుటుంబ అవసరాలకే, పిల్లల చదువులకే పెద్దపీట వేసేది!

సుమ పూజ చేసుకుంటూనే, "మీనా, పొయ్యి మీద కూర ఇగిరిపోయిందేమో చూడు" అని కోడలికి చెబుతూ, "అంట్లు నొక్కి తోమవే, ఎక్కడా జిడ్డు వదలటం లేదూ!" అని పనిమనిషిని కసురుతూ, "అలివేలూ, కాస్త పెద్దన్నయ్య పిల్లలకి టిఫిన్లు పెట్టవే" అని కూతురికి పనులు పురమాయిస్తోంది.

"దేవుడి ముందు కూర్చుని ఈ అష్టావధానాలూ, కథాకేళీలూ ఎందుకే? అన్నీ మరచి ప్రశాంతంగా ధ్యానం చేసుకోవచ్చుగా!" కించిత్తు కసురుకున్నట్లుగానే అన్నాను.

"మీకేం, కూర్చుని ఎన్ని కబుర్లైనా చెబుతారు. నాకెక్కడ కుదురుద్దీ!" అంటూ కర్పూరం వెలిగించి హారతి ఇస్తూ, "అమ్మో, మాడు వాసనొస్తుంది. కూర మాడిపోయిందేమో ఖర్మ!" అనుకుంటూ వంటింట్లోకి పరిగెత్తింది.

"ఒక ప్లానింగ్ ప్రకారం పని చేసుకోవాలి. లేకపోతే ప్రతీదీ ఇలాగే అరకొరగా తయారవుతుంది" జనాంతికంగా అన్నాను.

కాని నా మాటల్నెవరూ పట్టించుకోలేదు.

కోడళ్ళూ, కూతురూ గదిలో చేరి డైమండ్ నెక్లెస్ గురించే చర్చించుకుంటున్నారు. అబ్బాయి బాత్‌రూంకెళ్ళాడు.

ఒక గేమ్ కోసం ఇద్దరు మనవళ్ళు గొడవ పడుతోంటే కోప్పడ్డాను. వాళ్ళు బిక్కమొహాలు పెట్టారు. వాళ్ళని అనునయించేసరికి మిగతావాళ్ళు రెచ్చిపోయారు. తల పట్టుకున్నాను.

సుమ గబగబా వచ్చి, "రెండు పాల ప్యాకెట్లు తీసుకురండి. ఇప్పుడే టీలు కావాలని కూర్చుంటారు..." మెల్లగా చెప్పింది.

"అప్పుడే అయిపోయాయా?!"



"పాయసం చేస్తున్నా. బెల్లంతో చేసింది పెద్దోడికెంతో ఇష్టం"

"హు! రిటైరైనా నాకు రెస్టు లేదుగా!" నిష్ఠూరంగా అన్నాను.

"మాకసలు రిటైర్మెంటే లేదుగా!" అనేసి వెళ్ళిపోయింది.

నోర్మూసుకుని చెప్పులు తొడుక్కున్నాను.

నేను తిరిగొచ్చేసరికి పెద్దపిల్లలు టీవీలో చోటాభీం రెప్పవేయకుండా చూస్తున్నారు. చిన్నపిల్లలిద్దరూ మారాం చేస్తోంటే ఒకర్ని భుజాన వేసుకుని రెండోవాణ్ణి సముదాయిస్తోంది. పెద్దవాళ్ళ జాడలేదు.

"పిల్లల్ని నీ మెడకి చుట్టి వీళ్ళంతా ఎక్కడికి చెక్కేశారు?"

"నగల షాపుకెళ్ళారు" అంది ఇడ్లీల ప్లేటు తెచ్చుకుంటూ.

"ఇప్పటిదాకా నువ్వు టిఫిన్ చెయ్యలేదా? టైం పదకొండవుతోందే. ఇలాగైతే నీ ఆరోగ్యం బాగుపడినట్లే! బీపీ ఇంకా డౌనవుతుంది. నీరసం ఎక్కువవుతుంది, తెలుసా? మన కాళ్ళూ చేతులూ బాగున్నంతసేపే! ఏమైనా తేడా వస్తే వీళ్ళేదో తవ్వి తలకెత్తుతారనుకుంటున్నావేమో, ఏమీ చెయ్యరు. కనీసం తొంగి చూడరు!" కోప్పడ్డాను.

నా మాటల్ని సీరియస్‌గా తీసుకోలేదు. "చూస్తున్నారుగా. పనెక్కడా తెమలడం లేదు. అన్నీ నేనే చేసుకోవాలి. ఒక్కరూ ఒక్క పనికీ కలిసిరారు గదా!" ఆమె స్వరం వణికింది.

"చెప్పాలోయ్. చెప్పి చేయించుకోవడం ఓ కళ. చెప్పకపోతే ఎవరూ ఏమీ చెయ్యరు. హాలిడే హోం అనుకుని ఎంజాయ్ చేస్తారంతే."

"అయ్యో సంబడం! చూస్తున్నారుగా, వాళ్ళ పిల్లల పని వాళ్ళు చేసుకున్నా చాలు. అదీ చేయరు. ఏమైనా అంటే మాట మిగిలిపోతుందంతే! చెయ్యక చెయ్యక ఏదైనా చేసినా అది సవ్యంగా ఉండదు. మళ్ళీ నేను చేసుకోవాల్సిందే. ఎవరికి తప్పినా నాకు తప్పదు కదా!"

"సరిసర్లే. తొందరపడి ఎవర్నీ ఏమీ అనబోకు. నాలుగురోజులు ముక్కు మూసుకుంటే ఎవరిళ్ళకు వాళ్ళెళ్ళిపోతారు."

ఆడుకుంటున్న చిన్న మనవరాల్ని ఎత్తుకుని ముద్దు చేయబోయి దించేశాను. "ముందొచ్చి దీని డైపర్ మార్చు సుమా"

సగం ఇడ్లీ తిన్నదల్లా గభాలున లేచి చేతులు కడుక్కొచ్చింది.

"ఇందాక అలివేలు ఎంత ప్రయత్నించినా ఏం తిన్లేదు. ఇప్పుడు దిగుమతి అయిపోయింది గనుక ఇంక తింటుందిలెండి" సంబరంగా చెబుతూ చంటిదాన్ని బాత్రూంకి తీసుకెళ్ళింది.

పిల్లలకు అన్నాలు పెడుతోంది సుమ. వాళ్ళు కిందా మీదా ఒలకబోస్తూ విసిగిస్తున్నారు.

అర్జంటుగా వాట్సాప్ చూడమని రామ్ ఫోన్ చేశాడు. మూడు డైమండ్ నెక్లెస్‌ల ఫోటోలు పంపి ఏది నచ్చిందో చెప్పమన్నారు.

మేమిద్దరం తర్జనభర్జనలు పడి, ధరలు చూసి, మధ్యస్థంగా ఉన్నది బావుందని మెసేజ్ పెట్టాం. మరుక్షణం మూడింట్లో ఖరీదైనది కొనేశామని ఫోన్!

●●●

అర్ధరాత్రి వంటింట్లోంచి మిక్సీ శబ్దం విన్పిస్తే అదాటున లేచివెళ్ళాను.

"నిద్రపోకుండా ఈ అంకాలమ్మ శివాలేంటే?"

"నిద్ర రావటం లేదండీ. ఇడ్లీకని మినప్పప్పు నానబెట్టాను. ఒక పనైపోద్దికదాని...."

"దానికి ఇప్పుడింత తొందరేం వచ్చిపడిందే"

"నిన్న ఉప్మా చేశాను కదా, తినలేకపోతున్నానని మీనా ఒకటే రుసరుసలు...ఇంకో రెండ్రోజుల దాకా ఇబ్బంది ఉండదులెండి..."

"ఈ పనులెప్పుడూ ఉండేవే గాని వెళ్ళి పడుకో. నిద్ర అదే వస్తుంది."

"ఇదిగో ఇదైపోగానే పడుకుంటాను. మీకో గుక్కెడు కాఫీ కలపనా?"

ఏవేళ అయినా సరే కాఫీ అంటే చెవి కోసుకుంటానని తనకి తెలుసు. ఒక్కక్షణం తటపటాయించి, "ఇస్తానంటే ఇవ్వు" అన్నాను.

●●●

మధ్యాహ్నం భోజనాలయ్యాయి. సుమ నడుం వాల్చడానికెళ్ళబోతుంటే, "రోజూ కట్టుకునే చీరలు లేవు మమ్మీ. బజారుకెళ్దాం. నీ సెలక్షన్ అదురుతుంది. మీ అల్లుడిగారికి నీ సెలక్షనే నచ్చుతుంది." అంది అలివేలు.

"ఏదైనా సరే మమ్మీకి తెలిసినట్లు ఎవరికీ తెలీదు. ఎలాగూ వెళ్తున్నావు గనుక మాకు డోర్ కర్టెన్లు కొనుక్కురా మమ్మీ. ఎప్పట్నించో కొనాలనుకుంటున్నాంగాని కుదరడం లేదు" అన్నాడు రామ్.

"డీమార్ట్‌లో రెడీమేడ్‌వి చాలా వెరైటీలున్నాయిరా. కొలతలు తెలిస్తే చెప్పు, కొనుక్కొస్తాను"

వాడు మీనాని పిలవగా ఆమె కొలతలు చెప్పింది.




**పిల్లల కోసం ఎంత కష్టమైనా భరిస్తుంది తల్లి! చివరికి తన ఆరోగ్యాన్ని కూడా పట్టించుకోదు. అమ్మా అని పిలవటమే ఆలస్యం పరిగెత్తుకుంటూ వెళ్ళి సేవలు చేస్తుంది. మరి పిల్లలు ఆ తల్లి గురించి ఆలోచిస్తున్నారా? ఆ స్త్రీకి ఓ ఉనికి, అస్తిత్వం, అభిలాష, విశ్రాంతి ఉండకూడదా? ఎల్లప్పుడూ పిల్లల కోసమే జీవితం అన్నట్టుగా బతికేయాలా? అలా ఉండాలని ఆశించడం తప్పు కాదు కదా?**

"నువ్వూ రారాదా మీనా, నీకు నచ్చిన కలరూ, డిజైనూ తీసుకోవచ్చు."

"బాగా టైర్డుగా ఉంది ఆంటీ. హాయిగా పడుకోవాలనిపిస్తోంది. మీరు తెచ్చేయండి. లేటెస్ట్ డిజైన్స్ మీకే బాగా తెలుస్తాయి" అని తప్పించుకుందామె.

తల్లీకూతుళ్ళు బజారుమీద పడ్డారు.

భోంచేశాక ఒక కునుకు తీయడం అలవాటు. గదులు ఖాళీలేవు. టీవీ చూస్తూ సోఫాలో పడుకున్నాను. నిద్ర పట్టేసింది.

నాలుగింటికి మెలకువ వచ్చింది. టీనీళ్ళ కోసం పేగులు అరుస్తున్నాయి. సుమ ఇంకా రాలేదు. కోడళ్ళు నిద్రపోతున్నారు కాబోలు అలికిడి లేదు.

సుమకి నాలుగుసార్లు ఫోన్ చేశాను. ఇదిగో వచ్చేస్తున్నామంటారుగాని ఎక్కడా ఊడిపడరు. ఎట్టకేలకు ఏడింటికొచ్చారు. ఆ సరికి ఇంటిని కిష్కింధ చేసేశారు పిల్లలు.

ఎంతో అలసిపోయి ఉన్న సుమని చూసేసరికి జాలేసింది.

"ఇంతసేపుండిపోయారేంటి మమ్మీ. త్వరగా టీ ఇవ్వు" నా డైలాగ్ పెద్దోడు చెప్పాడు.

"అరె, ఇంకా టీ తాగలేదా!" అంటూనే కొంగు బిగించింది. కోడళ్ళూ కూతురూ కొత్త చీరలు చూస్తూ కూర్చున్నారు. పిల్లల్ని కసిరి ఇల్లు సర్దింది. అందరికీ స్వీటూ హాటూ ప్లేట్లలో పెట్టి అందించింది. అవి తినేప్పటికి పొగలు కక్కే టీ తెచ్చిచ్చింది. నాకు ప్రాణం లేచొచ్చింది.

"రేపు అయిదింటికి లేపు మమ్మీ, క్రికెట్ మ్యాచ్ ఉంది" తల్లితో అన్నాడు రామ్.

"సెల్‌లో అలారం పెట్టుకోవచ్చుగా!" సాగదీసింది మీనా.

"అలారమే కదాని బద్ధకిస్తే మ్యాచ్ అటకెక్కేస్తుంది. అదే మా మమ్మీ అయితే ఎంచక్కా లేపుతుంది. అమ్మ టాక్టీసే వేరు. నీకు తెలీదు గాని నేను నైన్త్‌లో ఉండగా శ్రీశ్రీ అకాడమీకి ఐఐటీ ఫౌండేషన్ క్లాసులకు వెళ్ళేవాణ్ణి. క్లాసులెన్నింటికో తెలుసా? ఫైవ్ ఏఎంకి. అప్పట్లో డాడీ నిజామాబాద్‌లో పని చేసేవారు. వారానికోసారి ఇంటికొచ్చేవారంతే. మమ్మీయే రోజూ అకాడమీకి తీసుకెళ్ళేది తెలుసా?"

సుమ ముసిముసిగా నవ్వుకుంటూ, "లేపుతాన్లేరా" అంది.

"ఏమైనా ఈ అన్నదమ్ములకి అమ్మ అంటేనే గురి. అయినా అంతే. ఎంత బాగా వండినా సరే 'మా అమ్మ చేసినట్టు లేదు అని గునుస్తారు" కీర్తన పితూరీకి హాయిగా నవ్వారంతా.

సుమ కించిత్తు గర్వంగా ఫీలవడం నా దృష్టిని దాటిపోలేదు.

●●●

పెసరట్లు, ఉప్మా హాట్‌ప్యాక్‌లో పెట్టి, కాఫీ ఫ్లాస్కులో పోసి మీనాకీ, అలివేలుకీ అప్పగింతలు పెట్టి, నన్ను రైతుబజార్‌కి లాక్కెళ్ళింది సుమ.

వాళ్ళ వీరవాసరం షాపతని దగ్గర మామిడి కాయలు కొని, వెంటతెచ్చిన మంచినీళ్ళతో కడిగి, తుడిచి, ముక్కలు కోయించి, వాటిలోపలి జీడిపొర తీసి, మళ్ళీ పొడిగుడ్డతో తుడిచి క్యాన్‌లో సర్దేసరికి ఎండ సుర్రుమంటోంది.

"ఇప్పుడీ ఆవకాయ గోలెందుకే! ఎవరు తింటున్నారనీ!"

"అల్లుడుగారు నువ్వుపప్పు ఆవకాయ కావాలని నోరు తెరచి అడిగారు. వాళ్ళొక్కళ్ళకీ పెట్టి ఊరుకోలేం గదా. అబ్బాయిలిద్దరికీ ఇంత పచ్చడి పెట్టొచ్చని పాతిక కాయలు కొన్నాను."

"ఇదెంత పెద్ద పనో తెలుసా? అసలు నీ వయసెంతనుకుంటున్నావ్. ప్రతీదీ మీదేసుకుంటున్నావ్? యంత్రాలకే రెస్టుకావాలి. నీకక్కర్లేదా? ఎప్పుడూ పని పని పని తప్ప ఇంకేం పట్టించుకోవా?" నిజంగానే తన ఆరోగ్యం గురించి ఆదుర్దాపడ్డాను.

నవ్వింది. "పదిరోజుల పాటు విపాసనా కార్యక్రమానికి తీసుకెళ్తానంటున్నారుగా. అక్కడ ధ్యానం తప్ప పనేమీ ఉండదు గనుక అప్పుడు కావల్సినంత విశ్రాంతి తీసుకుంటాన్లెండి."

"నువ్విహ మారవు" కోపంగా విసుక్కున్నాను.

ఒకపక్క వంటపని, మరోపక్క పచ్చడి పని, మధ్యలో పిల్లల అవసరాలు అన్నీ చూస్తూ బొంగరంలా తిరుగుతోంది సుమ.

"ఇంకా వంటవ్వలేదా? హోటల్లో తినెయ్యమా?" రామ్ బెదిరిస్తోంటే, "ఏమైనా అర్జంటు పనిమీదెళ్ళాలా?" అడిగాను.

"సినిమా ప్రోగ్రాం వేసుకున్నాం డాడీ. మమ్మీ చూడు ఇంకా వంటే చెయ్యలేదు!" ఫిర్యాదు చేశాడు.

"ఇదిగో వడ్డించేస్తున్నా, కాళ్ళు కడుక్కురండి..."

రామ్, మీనా, అలివేలు, అల్లుడు సత్యం, కీర్తన భోం చేసి హడావిడిగా బయల్దేరారు.

"నువ్వూ వెళ్తున్నావా? మూడుగంటలపాటు కూర్చోగలవా?" కీర్తనని అడిగాను.

"హాయిగా ఎంజాయ్ చేయగలను అంకుల్. మీరేం వర్రీ కాకండి."

"ఒరే రామ్, కనీసం పెద్దపిల్లల్నైనా మీతో తీసుకెళ్ళండ్రా"

నవ్వాడు. "అప్పుడింక మేం సినిమా చూడం. వాళ్ళకి పాప్‌కార్న్, చిప్స్, కూల్‌డ్రింకులు అందిస్తూ తిరుగుతాం.."

అయిదుగురు పిల్లల్నీ మాకప్పగించి వాళ్ళు చేతులూపుకుంటూ వెళ్ళిపోయారు!

●●●

బాల్కనీలో పక్క పరచుకుంటుంటే వచ్చింది సుమ. ఏదో చెప్పబోతోందని అర్థమైంది. "సంగతేంటి?"

"మీనాకి వాళ్ళ పుట్టింటివాళ్ళు సీమంతం చేశారు. అలివేలుకి మనం చేశాం. కీర్తనకి కూడా చేస్తే బావుంటుందంటున్నాడు చిన్నోడు..."

"వాళ్ళ అత్తవారిని అడగమనకపోయావా?"

"అడిగాట్ట. ఆనవాయితీ లేదన్నార్ట. మనమే ఆ ముచ్చట కాస్తా తీరిస్తే బావుంటుంది. లేకపోతే చిన్నోడు చిన్నబుచ్చుకుంటాడండీ..."

వెర్రిగా చూశాను. పిమ్మట కయ్‌మన్నాను. "నీకసలు బుద్ధుందా? ఇంట్లో బండెడు చాకిరీ పెట్టుకుని బుడబుడమంటూ కొత్తపని నెత్తికెత్తుకుంటానంటావేంటి?"

"పదిమంది బంధువుల్నీ మన అపార్టుమెంటు వాళ్ళనీ పిలిచి ఇంట్లోనే సింపుల్‌గా చేసేద్దామండీ. పెద్దోడూ కోడలూ, అమ్మాయీ అల్లుడూ వచ్చే ఉన్నారు. అమెరికా నుంచి చిన్నోడు ఎలాగూ రాలేడు. వస్తే గిస్తే కీర్తన వాళ్ళ అమ్మానాన్నా వస్తారు. కీర్తన ఎంతో సంతోషిస్తుంది. పెద్దల ఆశీస్సులతో పండంటి బిడ్డని కంటుంది..."

"సరే కానియ్. నువ్వనుకుంటే అవ్వాల్సిందే. ఇంటికి నన్ను యజమాని నంటారు కాని అసలు సిసలు యజమానురాలివి నువ్వే"

"మాటలు నేర్చారు" గుండెలమీంచి వేయి టన్నుల బరువు దిగిపోయినట్లు కాగా హాయిగా నవ్వుతూ వెళ్ళిపోయింది.

విషయం చెప్పగానే, "పదివేలు ఇస్తాం. నలుగుర్లో డాబుగా ఉండేలా ఖరీదైన పట్టుచీర కొనండి. పదిరకాల పండ్లూ మిఠాయిలూ కొనండి" ఆర్డరేసినట్టుగా అంది మా వియ్యపురాలు.

"అవన్నీ మీరు కొని తెస్తేనే అందంగా ఉంటుంది" అంది సుమ.

"పనుల రోజులు... మాకు రావడం కుదర్దు"

మళ్ళీ షాపింగ్ మొదలైంది. 13,500 పెట్టి కీర్తనకి నచ్చిన పట్టుచీర కొన్నారు. రిటర్న్ గిఫ్ట్లు కొన్నారు. అలివేలు సీమంతం ఫంక్షన్‌కి ఇచ్చినవాటి కన్నా ఎక్కువ ఖరీదు పెడితే గాని ఊరుకోలేదు కీర్తన.

సీమంతం రోజు ఉదయమే కీర్తన తల్లీ దండ్రీ, ఇతర బంధువులూ మొత్తం పదిమంది దిగారు.

నా గుండెలు గుభిల్లుమన్నాయి. సుమ కాళ్ళు చల్లబడ్డాయి. ఇంట్లో నిలబడటానికే చోటు లేదు. ముందుగా చెప్పి ఉంటే ఇంకేదో ఏర్పాటు చేసేవాళ్ళం.

స్నానాలకి క్యూ తప్పలేదు. రామ్ వెళ్ళి హోటల్నుంచి టిఫిన్లు తెచ్చాడు.

ఇదే అదనన్నట్టు పనిమనిషి ఎగ్గొట్టేసింది. మరో పనిమనిషి దొరకలేదు. ఇహ సుమకి తప్పలేదు.

భోజనాలు, బంధుమర్యాదలు, సీమంతం, ఫలహారాలు...!

అటో అడుగు ఇటో అడుగు వేసి అన్నీ చూడడానికి సుమ ఎంత టెన్షన్ పడిందో ఆ దేవుడికే తెలియాలి!

## కాజల్ మాటలు నమ్మొచ్చా?

గతంలో కాజల్‌ని టాలీవుడ్ ఎంత నెత్తిన పెట్టుకున్నా తన చూపులన్నీ బాలీవుడ్ మీదే ఉండేవి. ఇప్పుడు దక్షిణాది పరిశ్రమ విలువ తెలిసొచ్చినట్టు ఉంది. అందుకే.. ఇక బాలీవుడ్‌కి వెళ్ళను అని స్పష్టం చేస్తోంది. అయితే కాజల్ మాటలు నమ్మడానికి లేదనీ, బాలీవుడ్‌లో సినిమాలు బోర్లాపడడంతో దక్షిణాదే దిక్కయ్యిందనీ, తిరిగి అక్కడ ఎవరన్నా మంచి రెమ్యునరేషన్ ఇస్తామంటే అటు వైపు పరుగెడుతుందనీ సినీ జనాలు అంటున్నారు. నాకు బుద్ధి వచ్చింది...ఇక బాలీవుడ్ వెళ్ళను అని కాజల్ ఎంత చెబుతున్నా ఆమె మాటలు ఎవరూ నమ్మడం లేదు. 'ఎవరు తీసుకున్న గోతిలో వారే పడడం' అంటే ఇదే మరి అంటున్నారు కొందరు. కాజల్‌ని నెత్తిన పెట్టుకున్న సమయంలో బాలీవుడ్ ముద్దు అంటూ అటువైపు పరుగులు పెట్టింది. అక్కడ ప్రేక్షకులు ఆదరించకపోయేసరికి ఇక్కడికి వచ్చింది.

'హమ్మయ్య, గట్టెక్కాం' అనుకుంటుంటే వియ్యపురాలు బాంబు పేల్చింది.

"బొత్తిగా నాసిరకం చీర కొన్నారు వదినగారూ! తల కొట్టేసినట్టుగా ఉంది. సీమంతానికి వచ్చిన వాళ్ళకి భోజనాలు పెట్టకుండా ఫలహారాలతో సరిపెడతారా? హవ్వ. ఇదెక్కడైనా ఉందా? మీరింత పీనాసిగా చేస్తారనుకోలేదు."

వాళ్ళటు వెళ్ళగానే ఇటు సణుగుడు మొదలెట్టింది కీర్తన.

"కూతురికి హోటల్లో ఘనంగా చేశారు. కోడలికేమో తూతూ మంత్రంగా కానిచ్చేశారు. ఇలాంటి వాళ్ళు అసలు సీమంతం ఎందుకు చేయాలి? ఎవరు దేబిరించారని?"

మనస్సు చివుక్కుమంది. ముఖంలోని రక్తమంతా విరిగిపోగా రెప్పలమాటున కన్నీరు అదిమిపట్టింది సుమ. ఆ రాత్రి భోజనం చేయకుండా ఉండిపోయింది. నేను చెప్పినా విన్లేదు. ఆకలిగా లేదంది.

మర్నాడు కాస్త ఆలస్యంగా లేచింది సుమ. పది లంఖణాలు చేసిందాన్లా ఉంది. కాఫీలు కలిపి ఇస్తూ విరుచుకుపడిపోయింది.

గబగబా ఆసుపత్రికి తీసుకెళ్ళాం.




నెర్వస్ బ్రేక్‌డౌనట! నిద్రలేమి, అధిక ఒత్తిడి, పనిభారం, లోబీపీ, విపరీతమైన శ్రమ వల్ల ఇలా జరిగి ఉంటుందన్నారు.

డాక్టర్ మాటలు విని తట్టుకోలేకపోయాను. గత పదిపదిహేను రోజులుగా సుమ పడ్డ కష్టం తలచుకునేసరికి కన్నీళ్ళు ధారలు కట్టాయి.

"ఈ వయస్సులో అన్నన్ని పనులు పెట్టుకోవడం ఎందుకు? హాయిగా కృష్ణారామా అనుకుంటూ ఓ మూలన కూర్చోవచ్చుగా. ఇప్పుడు చూడండి ఎంత ప్రమాదం కొనితెచ్చుకుందో! తనకేమైనా అయితే ఎవరు చూస్తారు?" ఆవేశపడ్డాడు రామ్.

"ఆంటీకి చాదస్తం జాస్తి. అన్నీ తనే చెయ్యాలంటారు. ఎవర్నీ ఏపనీ ముట్టుకోనివ్వరు" అంది మీనా.

"మమ్మీ మొదట్నుంచీ ఇంతే. అన్నీ అంతా తన వల్లే అవ్వాలనుకుంటుంది. అంతా తననే గొప్ప అనుకోవాలని మమ్మీ ఆరాటం" అలివేలు అంది.

"వయస్సు మళ్ళాక కూడా ఇదివరకట్లానే తెయ్‌మంటూ చెయ్యాలనుకుంటే ఇలాగే జరుగుద్ది!" అక్కసుగా అంది కీర్తన.

వారి మాటలు వాడి బాణాల్లా గుండెలకి తగిలాయి!

"రండి ఇలా కూర్చుందాం" హాస్పిటల్ బాల్కనీలోని బెంచీమీద కూర్చుంటూ అందర్నీ పిలిచాను.

"అవతల మమ్మీకి అలా ఉంటే ఇక్కడ మీటింగా?" నిరసనగా అన్నాడు రామ్.

"తను కోలుకుంటుందిలేరా! మనమూ కోలుకోవాలి, మేలుకోవాలి!"

నావంక చిత్రంగా చూశారంతా.

"సుమ మనకోసం ఇన్నేళ్ళుగా అవిశ్రాంతంగా ప్రేమతో ఇష్టాపూర్వకంగా ఎంత చేసిందో ఒకసారి మననం చేసుకుందాం. అదే తరహా సేవ, అభిమానం, బాధ్యత, ఒత్తిడి ఇప్పుడు కూడా ఆమె నుండి మనం ఆశించడం సబబేనా? అమ్మ ప్రేమని - ఊహూ- నన్నూ కలుపుకోవాలి. ఇల్లాలి ప్రేమని మనం ఓవర్ ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్నామా?"

కొత్త సంగతి వింటున్నట్టు మొఖాలు పెట్టారంతా.

"ఈ ఉపోద్ఘాతమంతా మేం మీ ఇంటి మీద మిడతల దండులా వచ్చిపడ్డామని చెప్పడానికే కదా?" ఉక్రోషపడింది మీనా.

"మీరు రావడం తప్పు కాదు. రాకూడదనీ చెప్పడం లేదు. కాని మీ రాక మాకు సంతోషాన్ని కలిగించాలి. శ్రమ అనిపించకూడదు. మీరు మాకు బలం అవ్వాలి గాని బరువు అవ్వకూడదు. ఇన్నేళ్ళూ శ్రమించాం. మా చిరుకోరికల్ని అణచుకుని అలవాట్లు మార్చుకుని, కొండొకచో ఆశల్ని తుంచుకుని, అవసరాల్ని కుదించుకుని మీకోసం అహరహం తపించాం. మీరే లోకంగా బ్రతికాం. మా బాధ్యతలు నిర్వర్తించాం. మీరు ప్రయోజకులయ్యారు. మీమీ కుటుంబాలు ఏర్పరుచుకున్నారు. ఇప్పుడు కూడా ఈ ఆఖరి దశలో కూడా మేం ముఖ్యంగా సుమ ఇంకా ఇంకా త్యాగాలు చేస్తూ పోవాలా? భార్య, అమ్మ, అత్త, అమ్మమ్మ, నానమ్మ- ఇలా జీవితాంతం ఏవో బాధ్యతలు నిర్వర్తిస్తూనే ఉండాలా? అది తప్ప ఇంకో బతుకులేదా?" ఆవేశపడ్డాను.

"విడ్డూరంగా మాట్లాడతారేంటి డాడీ! ఇది అన్ని ఇళ్ళల్లో ఉన్నదే! అంతా చేస్తున్నదే! ఇందులో కొత్త, వింత ఏముంది?" కించిత్తు హేళనగా అన్నాడు రామ్.

"అంటే ఆ సంప్రదాయ పాత్రల్నే కడదాకా పోషిస్తూ ఉండాలంటావు? ఆ స్త్రీకి తనకంటూ ఓ ఉనికి, ఓ అస్తిత్వం, ఓ అభిలాష, ఓ కళ, ఓ ధ్యానం, ఓ విశ్రాంతి ఉండదా లేక ఉండకూడదా? ఎల్లప్పుడూ ఇదే రందిలో శ్లేష్మంలో పడ్డ ఈగలా కొట్టుకుంటూ ఉండాలని ఆశించడం న్యాయమేనా?"

వెంటనే ఎవరూ బదులివ్వలేదు. దిక్కులు చూస్తుండిపోయారు.

"చెప్పండి. ఏది న్యాయమో, ఏది ధర్మమో చెప్పండి" రెట్టించాను.

"మమ్మీ ప్రేమాభిమానాలతో చేస్తోంది గనుక చేయించుకుంటున్నాం. ఇదేమీ నేరం ఘోరం కాదే! అసలు మమ్మీకి ఏమీ చెయ్యకుండా కూర్చోవడం చేతకాదు తెలుసా?" ఎదురు ప్రశ్నించింది అలివేలు.

నవ్వాను. "మేం మీ మీ ఇళ్ళకొచ్చినప్పుడూ ఇదే కథకదా? వంటిల్లు సుమకి అప్పగించి మీరు ఇంకేవో పనులు చూసుకుంటారు. నిజమో కాదో గుండెల మీద చెయ్యి వేసుకుని చెప్పు?"

"సారీ అంకుల్! మాకు తెలీకుండానే మా ప్రవర్తనతో ఆంటీని ఇబ్బందిపెట్టాం" అల్లుడు సత్యం అన్నాడు.

"వెళ్ళిపొమ్మంటే నా జర్నీ ప్రీపోన్ చేసుకుని ఇవాళే ఫ్లైట్ ఎక్కేస్తా" రోషంగా అంది కీర్తన.

"ప్లీజ్, అపార్థం చేసుకోవద్దు. సుమ పరిస్థితి అర్థం చేసుకోడానికి ప్రయత్నిద్దాం. ఇకపై అధిక ఒత్తిడికీ, శ్రమకీ గురికాకుండా స్వేచ్ఛగా తన ఇష్టానుసారం ప్రశాంతంగా జీవించేందుకు తగిన పరిస్థితుల్ని కల్పించలేమా? అది మన బాధ్యత, కర్తవ్యం కాదా? ఏమంటారు?"

"మేమేదో దోషులమైనట్లు మాట్లాడతారేంటి డాడీ. మమ్మీ ఎప్పుడూ చేసేదే చేయించుకుంటున్నాంగాని కొత్త బరువులు ఎత్తడం లేదు. ఫోర్సు చేయడం లేదు. తను చెయ్యనంటే మేమే చేసుకుంటాం" నిష్ఠూరంగా అన్నాడు రామ్.

"అంతేతప్ప ఈ దశలో కూడా ఆమె బతుకుని ఆమెని బతకనివ్వకుండా ప్రేమ పేరుతో, బాధ్యతల వంకతో ఇంకా ఇంకా దోచెయ్యడం తప్పుగా, అన్యాయంగా, ద్రోహంగా అన్పించడం లేదన్నమాట!"

నా సెల్ మోగింది. లైన్లో చిన్నబ్బాయి లక్ష్మణ్...

"డాడీ, మమ్మీకి ఫోనివ్వండి... అర్జంటుగా మాట్లాడాలి."

నాకేదో అనుమానమొచ్చింది. "ఎందుకురా" అంటూనే స్పీకర్ ఆన్ చేశాను. అంతా ఆసక్తిగా చెవులొగ్గారు.

"కీర్తన డెలివరీ టైమ్‌కి మా ఆంటీ, ఆంకుల్ అమెరికా రాలేరట. వారికి కుదరదంట. మమ్మీకో మాట చెప్పి ఫ్లైట్ టికెట్ తీసుకుంటాను."

"మమ్మీ రాలేదురా!"

"నేనడిగితే కాదనదు డాడీ! ఇంటినీ, కీర్తననీ, బిడ్డనీ ఎంతో జాగ్రత్తగా కంటికి రెప్పలా చూసుకుంటుంది. సమయానికి అన్నీ చక్కగా అమర్చిపెడుతుంది. అసలు ఆంటీకన్నా మమ్మీయే బెస్ట్ ఆప్షన్..." వాడు చెప్పుకుపోతున్నాడు.

తలెత్తి చూశాను. అందరి తలలూ అవనతమయ్యాయి!

**సెల్: 98490 61668**

# సు ర భి

## పామే ప్రేయసి!



పాము కనిపిస్తే చాలు అమ్మో అని భయంతో ఆమడ దూరం పరిగెత్తుతారు, ఎవరైనా! కానీ అతడు మాత్రం పరిగెత్తడు, భయంతో పారిపోడు. ఎందుకంటే ఆ పామే అతడి ప్రేయసి! దాన్నే పెళ్ళాడాడు కూడా! ఆశ్చర్యంగా ఉంది కదూ!

థాయిలాండ్‌లో ఓ వ్యక్తి పది అడుగుల పొడుగున్న పామును పెళ్ళి చేసుకున్నాడు. పామును ఎందుకు పెళ్ళి చేసుకున్నావని అడిగితే, ఆ పామును చూస్తుంటే ఐదు సంవత్సరాల క్రితం చనిపోయిన తన ప్రేయసి గుర్తొస్తుందని చెబుతున్నాడు. చనిపోయిన మనుషులు జంతువుల రూపంలో తిరిగొస్తారని తాను నమ్ముతానని, అందుకే తాను పామును పెళ్ళి చేసుకున్నట్లు చెబుతున్నాడు. అయితే కేవలం పెళ్ళి చేసుకోవడం మాత్రమే కాదండోయ్... ఆపాముతో చక్కర్లు కొట్టడం, కలిసి టీవీచూడడం, పడుకోవడం, బయటకు వెళ్లడం దగ్గర నుంచి అన్ని పనులూ చేస్తాడట! ఇలా పాముతో జంటగా కనిపిస్తూ అందరినీ ఆశ్చర్యపరుస్తున్న ఆ యువకుడి ఫోటోలు ఇప్పుడు సోషల్ మీడియాలో వైరల్‌గా మారాయి.

## కీచురాయి పందాలు

కోడిపందాలు, గుర్రప్పందాల గురించి తెలుసు కాని, కీచురాయి(ఉప్పు మిడత) పందాల గురించి ఎప్పుడైనా విన్నారా? ఈ పందాలు చైనాలో జరుగుతాయి. వీటినే నెత్తుటి ఆట అని కూడా అంటారు. సుమారు 1000 సంవత్సరాల క్రితం చైనా రాజవంశీకులు ప్రారంభించిన ఈ ఆట, క్రమంగా చైనా దేశం అంతటా పాకింది. ఒకప్పుడు రాజులు ఈ పందాలలో పాల్గొని రాజ్యాలనే కోల్పోయేవారట. ఆ తర్వాత ఆ పందాలు కనుమరుగయిపోయాయి. మళ్లీ ఇప్పుడు అక్కడ మొదలయ్యాయి. కీచురాళ్లని షాపుల్లో అమ్ముతున్నారు కూడా! 2010లో ఈ కీచురాయి పందాల మార్కెట్ సుమారు 75 మిలియన్ అమెరికన్ డాలర్ల మేరకు విలువ చేసిందంటే ఈ కీచురాయి పందాల మీద చైనా ప్రజలు ఎంత ఖర్చు పెడుతున్నారో ఊహించుకోవచ్చు.



## శునకాల కోసం పీసీ

ప్రపంచవ్యాప్తంగా శునకాలను కుటుంబ సభ్యుల్లా చూసుకునేవారు చాలామందే ఉన్నారు. వాటికోసం ప్రత్యేకమైన రెస్టారెంట్లు, ఆహారం, డ్రెస్సులు, టీవీ చానల్స్ ఇలా బోలెడన్ని సదుపాయాలు అందుబాటులోకి వచ్చాయి. హాంకాంగ్‌కి చెందిన ఓ సంస్థ ఇంకొంచెం ముందుకెళ్ళి, శునకాల కోసమే ప్రత్యేకంగా ఓ పర్సనల్ కంప్యూటర్‌ను రూపొందించింది. చిన్నపాటి మానిటర్‌లా ఉండే ఈ కంప్యూటర్‌ను 'డాగ్ పీసీ' అనే పేరుతో 'టెస్లా టెక్నాలజీ లిమిటెడ్' సంస్థ రూపొందించింది. ఇప్పటికే ఇలాంటివి మార్కెట్లో ఉన్నా, అధునాతన ఫీచర్లని దీనికి జోడించారు. ఈ కంప్యూటర్ ద్వారా ఇంటర్నెట్ సాయంతో మానిటర్‌లో ఉన్న కెమేరాతో కుక్కని నేరుగా చూసే వీలుంది. మానిటర్‌కు ఆనుకుని ఉన్న ఫుడ్‌బాక్స్‌లో ఆహారంపెట్టి రిమోట్ ద్వారా సమయానికి బాక్స్ ఓపెన్ చేయొచ్చు. అంతేకాదు వాటికాళ్లతో, ముక్కుతో ఆడుకునేందుకు వీలుగా కొన్ని రకాల గేమ్స్ కూడా ఇందులో ఉంటాయట. మొత్తానికి వాటి వినోదానికి ఇప్పుడు పీసీ కూడా మార్కెట్లోకి వచ్చేసింది.

## ఓడిపోయిన వారికి స్మారక స్తూపం

సమాజానికి హితవు చేసిన వారికి, యుద్ధంలో గెలిచిన వారికి, ప్రముఖులు కొందరికి స్మారకస్తూపాలు నిర్మించడం మనకు తెలిసిందే! అయితే ఓటమిని చవిచూసిన వారికి కీర్తి స్తూపం నిర్మించడం ఎక్కడైనా చూశారా! కనీసం వినుండరు కూడా! అమెరికాలోని బ్రూక్లిన్‌లో 'మాన్యుమెంట్ టోంబ్ టు అన్ ఎలక్టర్స్' అనే మ్యూజియాన్ని 1783లో నిర్మించారు. ఇది మ్యూజియం పార్క్‌గా ప్రసిద్ధి చెందింది. అయితే 2008 నుంచి ఒక కొత్త సంప్రదాయాన్ని ఈ మ్యూజియంలో ప్రవేశపెట్టారు. అమెరికా అధ్యక్ష పదవికి పోటీచేసి ఓటమిని చవిచూసిన వారికి ఇందులో స్థానం కల్పిస్తారు. ప్రారంభం నుంచి అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో ఓటమి పాలైన వారి అందరిపేర్లూ, వివరాలూ ఇందులో ఉంటాయి. ఇలా ఓడిపోయిన వారి వివరాలను స్మారక స్తంభం పేరిట ప్రదర్శించడం కొత్తగా ఉంది కదా!




## మిరపకాయల రాజధాని

మిరపకాయల ఘాటు తట్టుకోవడం చాలా కష్టం. ఒకటి రెండు రోజులు బస్తాలుబస్తాలు అలా ఉన్నాయంటే ఇంట్లో వాళ్లందరికీ తుమ్ములూ దగ్గులూ రావడం ఖాయం. అలాంటిది ఆ ప్రాంతంలోని వారు మాత్రం మిరపకాయల్ని అలంకరణగా ఎండబెడతారు. చూడడానికి ఎర్రగా బుర్రగా అందంగా ఉన్న మిరపకాయ అంటే అక్కడి ప్రజలకు మహా ఇష్టమండీ బాబు! ఆ ఊరిని మిరపకాయల రాజధాని అనొచ్చు.

సెర్బియా దేశంలో ఉన్న డొన్జా లొకొస్కినా అనే గ్రామంలో సుమారు 1300 కుటుంబాలున్నాయి. అక్కడ ప్రధాన పంట మిర్చి. ఆ పంట అక్కడ శీతాకాలంలో కోతకొస్తుంది. దాంతో వాటిని ఎండబెట్టడానికి అక్కడి ప్రజలు ఒక పద్ధతిని పాటిస్తారు. మిర్చి తెంపిన తర్వాత వాటన్నింటినీ వారు ఉంటున్న ఇళ్లపై తోరణాల రూపంలో, రేకులపైనా అమర్చి ఎండబెడతారు. ఆ సమయంలో ఆ గ్రామమంతా ఎరుపు వర్ణపు శోభతో, మిరపకాయల తోరణంతో ఎంతో అందంగా ఉంటుంది.

-నర్మద వాసిరెడ్డి





# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 8

(గత వారం తరువాయి)

**'ఏడ్సావులే.. ఇంక ఏడవబాకా' అన్నారు.**

**అయినా నాకు కళ్ళ వెంట నీళ్ళు అలా ధారగా కారుతూనే ఉన్నాయి. రెండు చేతుల్తోనూ కళ్ళు తుడుచుకుంటూ ఆయన వంకే చూస్తున్నా.**

**'ఆపవయ్యా బాబూ... ఏడుపాపు' అని అన్నారు.**

**ఈసారి మరికాస్త గొంతు పెంచి గట్టిగా అన్నారో ఏమో ఆటోమాటిగ్గా నా కళ్ళనీళ్ళు ఆగి పోయాయి.**

## నా దురదృష్టం అదే!

కూర్చున్నవాడల్లా లేచి నిలబడి, ఒకసారి చుట్టూ చూశారు మధుసూదనరావుగారు. ఆ చూపు గ్రహించి అప్పటివరకూ నా వంకే చూస్తున్నవాళ్లంతా కొంచెం దూరంగా వెళ్లారు.

'ఇటురా' అన్నట్లు చెయ్యెత్తి సైగ చేశారు మధుసూదనరావుగారు. చేత్తో ఒకసారి మొహాన్ని తుడుచుకొని చేతులు కట్టుకొని ఆయన దగ్గరకు వెళ్లాను.

'ఏం లేదురా! రాత్రి 'ప్రతిఘటన' సినిమా చూశాను. 'మంత్రి కాశయ్య'గా నీ నటన, తెలంగాణ యాస పలికిన తీరు అద్భుతం. అసలు నీ కేలిబర్ ఏంటనేది నాకు అర్థమైపోయింది. ఇన్నేళ్ల నా అనుభవంతో చెబుతున్నా... ఇంకో 15 సంవత్సరాలు నీకు తిరుగులేదురా అబ్బాయ్! క్షణం తీరిక లేని బిజీ ఆర్టిస్టువి అవుతావు. అందుకే ఆ సినిమా చూశాక నా మనసు మార్చుకున్నా! ఈ సినిమాలో వేషం అంత బాగుండదు. వద్దు.. చెయ్యొద్దు. 'ప్రతిఘటన' తర్వాత నీ మీద అంచనాలు బాగా పెరిగాయి. ఇలాంటి చిన్న చిన్న వేషాలు వద్దే వద్దు. నీ కెరీర్‌ను తగ్గించుకోవద్దు. నీకు తగ్గ వేషం ఉన్నప్పుడు తప్పకుండా పిలుస్తా' అని ఆప్యాయంగా నా భుజం తట్టారు.

ఆయన పొగడ్తకి పొంగిపోవాలో, వేషం పోయినందుకు బాధపడాలో తెలియక ఒక నవ్వు నవ్వి, ఆయన దగ్గర సెలవు తీసుకున్నాను.

'ప్రతిఘటన' తర్వాత మళ్లీ ఉషాకిరణ్ మూవీస్ సంస్థ సినిమాలో, అందులోనూ ది గ్రేట్ డైరెక్టర్ మధుసూదనరావుగారి దర్శకత్వంలో నటించే అవకాశం మిస్ అయిపోయిందే అనుకుంటూ భారంగా అడుగులు వేసుకుంటూ, రూమ్‌కి తిరిగి వచ్చేశా!

రూమ్‌లో కూర్చున్నాను కానీ... మనసంతా ఒకటే ఆలోచనలు.

### ఇప్పుడేం చెయ్యాలి?

వేషాన్ని మధ్యలో అలా వదిలేసి వెనక్కి తిరిగి వెళ్లిపోవడమా... లేక మధుసూదనరావుగారినే బతిమాలి ఆ వేషం కంటిన్యూ చెయ్యడమా?

ఆ రాత్రంతా కలత నిద్రే నాకు. తెల్లారుతుండగా ఓ ఆలోచన వచ్చింది.

వెళ్లి రామోజీరావుగారిని కలిస్తే...?

అవును... నేనంటే ఆయనకు అభిమానమే! ఆయన దగ్గరకు వెళ్లి పరిస్థితిని వివరించి, ఆయన ఎలా చెబితే అలా చేద్దామనుకున్నాను.

ఈ ఆలోచన వచ్చాక నా మనసు తేలికయింది. ఆ సాయంత్రమే హైదరాబాద్‌కు తిరుగు ప్రయాణమయ్యాను.

### రామోజీగారిని కలిశా

ఖైరతాబాద్‌లో ఉండే ఈనాడు కాంపౌండుకి ప్రతిరోజూ రామోజీరావుగారు వస్తారని నాకు తెలుసు. ఆయన్ని కలిసి మాట్లాడాలంటే అదొక్కటే మార్గం కనుక ఈనాడు ఆఫీసుకు వెళ్లా. నన్ను వెయిటింగ్ రూమ్‌లో కూర్చోబెట్టి, నేను వచ్చిన విషయాన్ని ఆయనకి చెప్పారు సెక్యూరిటీ సిబ్బంది.

కాసేపటికి ఆయన నుంచి కబురు వస్తే ఛాంబర్‌కు వెళ్లాను.

తలుపు తీయగానే ఎదురుగా పెద్ద చెయిర్‌లో హుందాగా కూర్చుని ఉన్నారు రామోజీరావుగారు. నన్ను చూడగానే 'రండి శ్రీనివాసరావుగారు... ఎలా ఉన్నారు? కుశలమేనా?' అని అడుగుతూనే టీ తీసుకురమ్మని పురమాయించారు.

వెంటనే బోయ్ మంచినీళ్ల గ్లాసులు, టీ కప్పులతో ప్రత్యక్షమయ్యాడు.

టీ తాగాక చెప్పాల్సిన విషయమంతా వివరంగా చెప్పడం ప్రారంభించాను. ఏవో పేపర్లు పరిశీలిస్తూ నేను చెప్పినదంతా విన్నారు రామోజీరావుగారు.

అంతా అయ్యాక ఒకసారి నా వైపు చూసి నవ్వి 'నే మాట్లాడతాను లెండి. మంచి వేషం కాకపోతే డైరెక్టర్‌గారు వద్దని తిప్పి పంపరు కదా!



అయినా నేను ఆయనతో ఒకసారి మాట్లాడతానులెండి' అని అభయం ఇచ్చారు రామోజీరావుగారు.

రెండు చేతులెత్తి నమస్కరించి నేను వెనక్కి వచ్చేశాను. ఆ తర్వాత రామోజీరావుగారు మధు సూదనరావుగారితో ఏం మాట్లాడారో ఏమో కానీ నా చేత ఆ సినిమాలో ఓ కామెడీ వేషం వేయించారు.

## టి.కృష్ణగారి మాటే నిజమైంది

'ప్రతిఘటన' సినిమా సమయంలోనే జరిగిన ఓ సంఘటన మీకు చెప్పాలి. ఒకరోజు మద్రాసులోని రామానాయుడుగారి థియేటర్లో డబ్బింగ్ చెప్పేసి బయటకు వచ్చి క్యాంటీన్‌లో టీ తాగుతున్నాను. నాతోపాటు ఆర్టిస్ట్ వేలుగారు, టి.కృష్ణగారు కూడా టీ తాగుతున్నారు.

టి.కృష్ణగారు కప్పులో టీని సిప్‌చేస్తూ 'ఇంక నీకు హైదరాబాద్‌లో ఉండాల్సిన అవసరం లేదయ్యా! మద్రాసుకు దుకాణం మార్చెయ్. మంచి రోజు చూసు కొని ఫ్యామిలీని కూడా షిఫ్ట్ చెయ్' అని అన్నారు.

తథాస్తు దేవతలు అని అంటారే అలాగే ఆ మహానుభావుడు ఏ క్షణాన అలా అన్నారో కానీ కొన్ని రోజులకు అదే నిజమైంది.

87లో నా ఫ్యామిలీని మద్రాసుకు షిఫ్ట్ చేశా. పెద్దమ్మాయి పావని ఏడో తరగతి, మా అబ్బాయి వెంకట ఆంజనేయప్రసాద్ ఐదు చదువుతున్నారు. మా రెండో పాప పల్లవి ఎన్నో తరగతిలో ఉందో గుర్తులేదు.

పెళ్లాం, పిల్లలు కళ్లెదురుగా ఉంటే కావాల్సిం దేముంటుంది? పిల్లల ముద్దు ముచ్చట్లు వింటూ హాయిగా నా పని చేసుకోవచ్చనుకున్నాను. అదేమి చిత్రమో కానీ మద్రాసుకు షిఫ్ట్ అయిన తర్వాత నేను మరింత బిజీ అయ్యా. మరో విషయమేమి టంటే నా వాళ్లంతా హైదరాబాద్‌లో ఉంటే, నేను మాత్రం ఒంటరిగా ఒక్కడినే షూటింగ్స్ కోసం మద్రాసులో ఉండాల్సి వచ్చేది. అలా కాదనుకునే ఫ్యామిలీని మద్రాసుకు షిఫ్ట్ చేశాను. అయితే అప్పటి దాకా మద్రాసులోని స్టూడియోల్లో జరిగిన షూటింగ్స్ రాయితీల పుణ్యమాని ఔట్‌డోర్స్‌లో ఎక్కువగా జరు గుతుండటంతో కథ మళ్లీ మొదటికి వచ్చినట్లయింది.

భార్యాపిల్లల్ని వదిలి రాజమండ్రి, వైజాగ్, తిరుపతి తిరగడం ఎక్కువైంది.

పిల్లల చదువులు పట్టించుకునే తీరిక లేదు. అంతా మా శ్రీమతి మీదే భారం వేశా. పిల్లలు కూడా నా పరిస్థితిని అర్థం చేసుకొని క్రమశిక్షణతో మెలుగుతూ చక్కగా చదువుకున్నారు. మా పెద్ద పాప పావని పదో తరగతి పాస్ అయింది. ప్లస్ టూ చదివించా. 'పిల్ల పెద్దదయింది కనుక పెళ్లి చేసేస్తే మంచిది' అని మావాళ్లు సలహా ఇవ్వ డంతో ఆ పనే చేశా.

మా పెద్ద మేనమామగారి పెద్దమనవడు ప్రభాకర్‌కి ఇచ్చి పెళ్లి చేశాం. ఆయనిప్పుడు గీతా ఆర్ట్స్‌లో వర్క్ చేస్తున్నారు. వాళ్లకి కవల పిల్లలు... ప్రదీప్, ప్రమోద్. ఒకడు గాలి, ఒకడు నీరు. అంటే ఒకడు ఏరోనాటికల్ ఇంజనీర్, ఇంకొకడు ఏరోనాటికల్ ఇంజనీర్ అన్నమాట. పాతికేళ్ల ఇద్దరికీ.

## ఇబ్బందులు ఎదుర్కొన్నా

పరిశ్రమలోకి ప్రవేశించిన అతి తక్కువ కాలంలోనే గొప్పగొప్ప నటులందరితోనూ నటిం చాను. కానీ నా దురదృష్టం ఏంటంటే మహాను భావుడు నందమూరి తారక రామారావుగారితో మాత్రం నటించలేకపోయా. సినిమా పేరు గుర్తు లేదు కానీ, ఓ సినిమాలో చేయాల్సింది. అదీ తప్పిపోయింది. ఆ తర్వాత ఆయన రాజకీయ రంగ ప్రవేశం చేయడంతో ఇక అవకాశమే దొరక లేదు. ఈ జన్మకి ఇక ఇంతే అనుకున్నాను.





**అనుకోకుండా ఓ సినిమాలో ఎన్టీఆర్‌గారిని పోలిన పాత్ర చేయాల్సి వచ్చింది కోట గారికి. ఆయనే చేయాలని పట్టుబట్టటంతో చేయక తప్పలేదు! అయితే ఆ చిత్రం విడుదలయ్యాక, దాని ప్రభావం కోటగారి కెరీర్‌మీద పడింది. కొందరు దర్శకులు, నిర్మాతలు ఆయన్ని పక్కన బెట్టారు. పరిశ్రమలో ఒక వర్గం ఆయన్ను పూర్తిగా బ్యాన్‌చేసింది. అప్పుడు కోటగారు ఏంచేశారు?**

అయితే అనుకోకుండా 'మండలాధీశుడు' చిత్రంలో రామారావుగారిని పోలిన పాత్ర వేయాల్సి వచ్చింది. హీరో కృష్ణగారు, విజయనిర్మలగారు, ఆదిశేషగిరిరావుగారు, హనుమంతరావుగారు పట్టు బట్టి నాతో ఆ వేషం వేయించారు. ఎన్టీఆర్ సిని మాలు అప్పటికే బాగా చూసేవాడిని కదా, ఆయన హావభావాలన్నీ ఆకళింపు చేసుకున్నా! అది 'మండలా ధీశుడు'కి పనికొచ్చింది.

అన్ని పాత్రల్లాగే దాన్ని కూడా ఒక పాత్రగానే భావించి అందులో నటించా. ఎక్కడా పిచ్చి వేషాలు వెయ్యకుండా ఒళ్లు దగ్గర పెట్టుకొని ఆ వేషం చేశా. రామారావుగారు ఎవరినైనా తిడితే ఎలా తిడతారు? ఆయన ఎలా నడుస్తారు? అన్నది ఇమి టేట్ చేశాను తప్ప ఆయన ఇమేజ్‌ని డామేజ్ చేయా లని ప్రయత్నించలేదు.

కానీ 'మండలాధీశుడు' చిత్రం విడుద లయ్యాక దాని ప్రభావం నా కెరీర్ మీద బాగా పడింది. ముఖ్యంగా రామారావుగారిని అభిమా నించే నిర్మాతలు నాకు అవకాశాలు ఇవ్వలేదు. ఆయన్ని అభిమానించే దర్శకులు నన్ను దూరం పెట్టారు. ఒక్క మాటలో చెప్పాలంటే పరిశ్రమలో ఒక వర్గం నన్ను బ్యాన్ చేసింది. నాతో మాట్లాడటమే తప్పుగా భావించేవారు.

ఇది ఊహించని పరిణామం నాకు. అప్పుడప్పుడే ఎదుగుతున్న నాకు ఇబ్బందికరమైన పరిస్థితి!

దీని ప్రభావం ఏ ఏడాదిన్నర పాటో కనిపిం చిందనే చెప్పాలి. వేషాలు తగ్గిపోయి చాలా ఇబ్బం దుల్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. భవిష్యత్తు అయో మయంగా కనిపించింది.

ఇటువంటి పరిస్థితుల్లో అనుకోకుండా ఓ రోజు రామారావుగారిని ఎయిర్‌పోర్ట్‌లో కలుసు కోవాల్సి వచ్చింది.

## అదెలాగంటే...

రామారావుగారు 'బ్రహ్మర్షి విశ్వామిత్ర'కు డబ్బింగ్ చెప్పడానికి అనుకుంటా, ఓ సారి చెన్నై వచ్చారు. అప్పటికి సీఎం హోదాలో ఉన్నారు. రామారావుగారు ఆజానుబాహుడు. పంచె కట్టు కుని, కిర్రు చెప్పులు వేసుకుని ఎయిర్‌పోర్టులో రాజసంతో నడిచి వస్తుంటే పక్కన ఓ యాభై, అరవైమంది జనం, టైట్ సెక్యూరిటీ... పెద్ద హడా విడిగా ఉండేది.

రామారావుగారిలో గొప్పతనం ఏమిటంటే గంభీరమైన ఆయన విగ్రహం చూడగానే ఎటు వంటి వాడికైనా వణుకు మొదలవుతుంది. ఇక ఆయనతో మాట్లాడాలంటే చెప్పేదేముంది... ఆ వేళ హైదరాబాద్‌లో ప్రొడ్యూసర్స్ కౌన్సిల్ మీటింగ్ ఏదో జరిగింది. ఆ మీటింగ్ కోసమని దాసరి నారా యణరావుగారు, రామానాయుడుగారు ఇలా పెద్ద పెద్ద వాళ్లందరూ ఫ్లయిట్ కోసం ఎదురు చూస్తూ చెన్నై ఎయిర్‌పోర్టులోనే ఉన్నారు.

నేను కూడా ఔట్‌డోర్ వెళ్లడం కోసం ఎయిర్ పోర్ట్‌కి చేరుకున్నాను. నా పక్కనే విజయచందర్ కూడా ఉన్నారు.

రామారావుగారిని చూడగానే మెరుపులా నాకు ఓ ఆలోచన వచ్చింది.

నా సూట్‌కేస్ విజయచందర్‌కి అప్పగించి, 'కాస్త చూస్తుండండి... ఇప్పుడే వస్తాను' అని అన్నా. 'ఎక్కడికెళ్తున్నావ్' అని అడిగారు విజయచందర్.

**(ఇంకావుంది)**

**-డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**

# వెట్టి
## (ది వారియర్)
### -మధుబాబు




**జింకపిల్ల మాదిరి అతివేగంగా వెనక్కి పరిగెత్తబోయిన ప్రత్యూషని, వెంటనే ఆపేశాడు వెట్టి. 'వద్దు ప్రత్యూషా... మీ డాడీని పిలవాల్సిన అవసరం లేదు' అంటూ.**

**అప్పటికే పది అడుగుల దూరం వెళ్ళిపోయిన ఆ పిల్ల, చటుక్కున ఆగి పోయి, వెనక్కి వచ్చింది ప్రశ్నార్థకంగా చూస్తూ.**

**'ఏంటి విఠల్‌బాబు? నీకు ఏదైనా కొత్త ఆలోచన వచ్చిందా?' అయోమయంగా అడిగింది ప్రణవి.**

'ఆలోచన కాదుగాని, అసలు నేను వాడెవడో చెంచా మొఖంవాడు చెప్పినట్టు ఎందుకు చేయాలి?' అడిగాడు అతను.

అర్థం కానట్టు మరింత అయోమయంగా చూసింది ఆమె.

'నిజమే ప్రణవీ! తను కరెక్టుగానే చెప్పాడు. ఎక్కడెక్కడికో వెళ్ళిరమ్మని ఆర్డర్స్ ఇచ్చే అధికారం బాజిరెడ్డికి ఎవరిచ్చారు? ఇస్తే గిస్తే మీ అమ్మగారు ఇవ్వాలి. తనని నీతోపాటు పంపించారు కాబట్టి తనకి నువ్వు చెప్పాలి. నీ అనుమతి లేనిదే తను అవతలికి పోకూడదు కదా! సాలోచనగా చెప్పింది ప్రత్యూష.

ఆలోచనలో పడిపోయింది ప్రణవి. 'నాకు ఈ పాయింట్ తట్టలేదు. తట్టి ఉంటే ఆ చప్పిమొఖం వాడు ఎదురుగా ఉన్నప్పుడే ఛీకొట్టి ఉండే దాన్ని' అన్నది.

### జరిగిన కథ

గూండాల నుంచి తప్పించుకు తిరుగుతూ ఉంటాడు వెట్టి. ఫ్లాష్‌బ్యాక్‌లో అతడు ఇంజనీరింగ్ ఫైనల్ ఇయర్ స్టూడెంట్. అసలు పేరు విఠల్‌రెడ్డి. అన్యాయాన్ని ఎదిరించిన పాపానికి బాజిరెడ్డి గూండా ముఠా అతడిపై కక్ష కడుతుంది. అడుగడుగునా తప్పించుకుంటూ ఎప్పటికప్పుడు వారికి దేహశుద్ధి చేస్తూ ఉంటాడు విఠల్‌రెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. ఆ నేపథ్యంలో మళ్ళీ బాజిరెడ్డికి తారసపడిన వెట్టి అతడి పెత్తనాన్ని సవాలు చేస్తాడు. దాంతో వెట్టిని మట్టుపెట్టేందుకు బాజిరెడ్డి కొడుకు గూండాలతో హాస్పిటల్ బైట మాటువేస్తాడు. వాళ్ళందరినీ తుక్కుకిందబాది కామ్‌గా హాస్పిటల్‌లోకి వెళ్ళిపోతాడు వెట్టి. దాంతో వెట్టిపై ప్రతీకారేచ్ఛతో రగిలిపోతూ ఉంటాడు బాజిరెడ్డి. ఆ తర్వాత......

'ఆ సమయంలో నీకు ఈ పాయింట్ తట్టక పోవడం మంచిదే అయింది. తట్టి ఉంటే, తను ఏదో ఒకవిధంగా నిన్ను కన్విన్స్‌చేసి నీ నోటితోనే చెప్పించి ఉండేవాడు. వాడు సామాన్యుడు కాదు' రోడ్డుమీదికి చూస్తూ అన్నాడు వెట్టి. అతనికి తెలియకుండానే బిగుసుకున్నాయి పిడికిళ్ళు. పళ్ళు పటపట మని శబ్దాలు చేశాయి.

'అదిగో... మమ్మల్ని కాదని నువ్వు మళ్ళీ ఆవేశపడుతున్నావ్' కంగారుగా అతని భుజం మీద చెయ్యి వేస్తూ అన్నది ప్రణవి.

'మీరు లోపలికిపోండి. నేను రెండు నిమిషాల్లో వచ్చేస్తాను' ప్యాంటు జేబులో ఉన్న సిగరెట్ పాకెట్‌ని తడుముకుంటూ అన్నాడు అతను.

ప్రణవి వదనంలో ప్రత్యక్షం అయిన ఆందోళన మరింత అధికం అయిపోయింది. 'నువ్వు తర్వాత రావటం ఏమిటి? ఎక్కడికి పోతావ్? ఎందుకు?' గబగబా అడిగింది.

అటువంటి మాటలే ప్రత్యూష పెదవుల్లో నుంచి బయటికి రాబోయాయి గాని, బలవంతంగా ఆపుకుని, ఒక అడుగు ముందుకు వేసి హాస్పిటల్ ఎదుట ఉన్న రోడ్డునంతా కలియచూసింది.

'ఏమిటి ప్రత్యూషా? ఏం చూస్తున్నావ్?' అడిగింది ప్రణవి.

'బాజిరెడ్డి ఇందాకే వెళ్ళిపోయాడు. అతని జనం ఎవరైనా ఇక్కడే దిగబడి పోయారేమోనని చూస్తున్నాను' అన్నది ఆమె.

'ఇప్పుడు వాళ్ళ సంగతి మనకెందుకు?' అడిగింది ప్రణవి.

'ఈ పెద్దమనిషికి పూనకం వచ్చిందంటే అందుకు కారణం ఆ చప్పిమొఖం వాడే అయిఉంటాడు. ఇంకోసారి వాళ్ళమీద కల



బడటానికి సిద్ధం అవుతున్నాడేమోనని చూస్తున్నా' రోడ్డుమీది నుంచి తలతిప్పకుండా చెప్పింది ఆమె.

మొఖంలోని టెన్షన్ మటుమాయం అయిపోతూ ఉండగా పకపకా నవ్వింది ప్రణవి. 'పట్టపగలు నేను ఎదురుగా నిలబడి ఉండగా నా మనిషి మీద చెయ్యి వేయటం వాడికి చేతకాదు. ఒకవేళ చేతనయినట్లయితే వాడి పెంకును నేనే పగలగొట్టించేస్తాను. ఏదిచేసినా ఎదురుగా వచ్చి చేయటం వాడికి అలవాటు లేదు. వట్టి కట్ల పాము! వెనక నుంచి దెబ్బతీయటమే వాడికి చేతనయిన పని' అన్నది.

పాముల ప్రసక్తి వచ్చేసరికి వెగటుగా తయారయింది వెట్టి నోరు. 'తగాదాలు గిగాదాలు ఏవీ ఇప్పుడు లేవులేగాని, నేను కాస్తంత ఫ్రెష్ ఎయిర్ పీల్చుకువస్తా. మెదడంతా మసిపట్టినట్లుగా ఉంది' అంటూ ఈసారి ఆమె సమాధానం కోసం ఎదురుచూడకుండా రోడ్డుమీదికి వెళ్ళిపోయాడు.

'నువ్వు భవిష్యత్తులో చాలా విషయాలు లైట్ తీస్కోవాలి. అయినదానికి కానిదానికి వివరణలు ఇచ్చే రకంకాదు. ఏదయినా బుర్రలోకి ఎక్కిందంటే తను అనుకున్నదే చేస్తాడు. దేవుడు దిగివచ్చి చెప్పినా ఆగడు, వినడు' ప్రత్యూషకి చెప్పింది ప్రణవి.

బుగ్గలమీది సొట్టలు కనులకింపుగా బయట పడేంతగా సిగ్గుపడి తలను చటుక్కున పక్కకు తిప్పుకున్నది ప్రత్యూష.

•••

'చూశావా అబ్బయ్యా. నేను అవతలికి వెళ్ళిపోగానే ఏం జరిగిందో నువ్వు చూశావా?' దగ్గరికి వచ్చిన వెంటనే వెట్టి ముందు వాపోయాడు చిల్లరకొట్టు యజమాని.

అధికంగా మాట్లాడి లేనిపోని తలనొప్పులు తెచ్చుకోవటం ఇష్టంలేక పోయింది వెట్టికి. 'ఒక టీ ఇవ్వు. తల పగిలిపోతోంది. స్ట్రాంగ్‌గా చెయ్యి' అంటూ సిగరెట్ పాకెట్‌ని బయటికి తీసి సిగరెట్ వెలిగించుకున్నాడు.

'కూర్చుంటావా అబ్బయ్యా. కుర్చీపీట ఇవ్వనా?' ఫ్లాస్కులో ఉన్న టీని పేపర్ కప్పులో పోస్తూ అడిగాడు యజమాని.

రాత్రి తను ఊడపీకిన నాపరాయి రోడ్డుకు ఆవల ముక్కలు ముక్కలై పడిపోయి ఉండటాన్ని గమనిస్తూ, టీ తాగాడు వెట్టి.

'చేసేది శివారెడ్డిసారు దగ్గర ఉద్యోగం. తనే శివారెడ్డిసారు మాదిరి ఒకటే పోజు. ఈ బాజిరెడ్డిని వాడి కొడుకును పట్టుకోవటం చాలాకష్టం అయిపోతోందబ్బయ్యా... నాలాంటోళ్ళ బతుకు నలిగిపోతోంది. ఈడి దూడ మొఖానికి తోడు శివారెడ్డి చెల్లెల్ని చేసుకోవాలనుకుంటున్నాట్ట. అబ్బో ఇప్పుడే ఇలావుంటే అప్పుడు అస్సలు ఆపలేము, అడ్డుకోలేము' తన దుకాణం ముందు ఉండవలసిన నాపరాయి పగిలి పోయినందుకో, రాత్రి తనకు ఇవ్వవలసిన చిల్లర రను ఇవ్వకుండా ఆఫీసుకు వచ్చి తీసుకోమని చెప్పి నందుకో - తెగ బాధపడిపోతూ తన గోడును వెళ్ళబోసుకున్నాడు దుకాణం యజమాని.

నోరువిప్పి చిన్నపాటి కామెంట్ కూడా చేయకుండా ప్రశాంతంగా టీ తాగాడు వెట్టి. ఖాళీ పేపర్ కప్పును ఉండగా చుట్టి అవతలికి విసురుతూ ఉండగా కనిపించింది అది.

దుకాణం వెనుక ఉన్న ప్రహరీగోడ మొదట్లో, బాసిపట్టు వేసుకు కూర్చున్న మనిషి మాదిరి చుట్టలు చుట్టుకుని పడగను ఒక జానెడు ఎత్తుకు మాత్రమే ఎత్తి, అతనివైపే చూస్తున్నది.

సిగరెట్ పొగను గుండెలనిండా పీల్చుకుని, నాశికా రంధ్రాల గుండా వదులుతూ దానివైపే నిశితంగా చూశాడు అతను.

'ఏంటి అబ్బయ్యా.... చూస్తుండవ్?' అతన్ని అడిగాడు దుకాణం యజమాని.

'పాములు ఎక్కువగా తిరుగుతూ ఉంటయ్యా ఇక్కడ?' తల తిప్పకుండా అడిగాడు వెట్టి.

'పాములా... తిరుగుతూ ఉంటయ్‌గాని, ఈ టైములో ఎవరికీ కనిపించవు. నాకైతే ఎప్పుడూ అగుపించలా?' అంటూ దుకాణంలో నుంచి బయటికి వచ్చి, అతను చూస్తున్న వైపుకు తను కూడా చూశాడు.

బారెడెత్తున పైకిలేపిన తలను చక్కగా కిందికి దించి, తన శరీరం మీద పెట్టుకుంది వెట్టికి కనిపిస్తున్న పాము. కళ్ళను మాత్రం అతనివైపే కేంద్రీకరించి ఉంచింది.

'ఏది పాము? ఎక్కడ?' ప్రహరీకి పాతిక అడుగులు అటూ ఇటూ కలియచూస్తూ అడిగాడు దుకాణం యజమాని.

'అదిగో... అక్కడ..' అంటూ చేయి చూపించబోయి వెంటనే ఆగిపోయాడు వెట్టి. అవుట్‌హౌస్‌లో అతి దగ్గరగా తనకు కనిపించినప్పుడు- పక్కనే ఉన్న శంకరయ్యకు గాని, మిగిలిన వాళ్ళకిగాని ఎవరికీ అగుపించలేదు. నాలుగ్గోడల మధ్యన ఉండగా కనిపించనిది ఇప్పుడు ఆరుబయట బంగరు బయలు ప్రదేశంలో ఇంకొకరికి ఎలా కనిపిస్తుంది?

'ఏది అబ్బయ్యా?' అని ఇంకోసారి అడిగిన దుకాణం యజమాని వైపు తలతిప్పి చిరునవ్వు నవ్వాడు వెట్టి.

'రాత్రి సరిగ్గా నిద్రపోలేదు. కళ్ళు ఒకటే మంట. ఏదో కదిలింది. పాముగా భ్రమ కలిగింది' అన్నాడు.

'అంతేనబ్బయ్యా... ఒక్కోసారి అలాగే జరుగుతుంది. మరేం కంగారుపడాల్సిన అవసరం లేదు...' అంటూ వెనుతిరిగి దుకాణంలోకి వెళ్ళిపోయాడు యజమాని.



పడగను మళ్ళీ కొంచెంగా పైకెత్తి పదిక్షణాల పాటు తదేకంగా అతనివైపు చూసి, చరచరా పక్కకు వెళ్ళిపోయింది పాము.

సిగరెట్ చివరికంటా కాలి చేతివేళ్ళను చురుక్కుమనిపించటంతో ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చేశాడు వెట్టి. కింద పడవేసి మడమతో గట్టిగా నలిపి, హాస్పిటల్‌వైపు బయలుదేరాడు.

'డబ్బులు... అబ్బయ్యో... టీకి డబ్బులు ఇచ్చి వెళ్ళు' దుకాణం యజమాని బిగ్గరగా అరవటంతో, సిగ్గుపడుతూ వెనక్కు వచ్చాడు.

'ఏదో ఆలోచిస్తూ వెళ్ళిపోయాను. క్షమించాలి' అంటూ ప్యాంటు జేబులో నుంచి ఒక కరెన్సీ నోటును తీసి అతనికి అందించబోయాడు.

గబుక్కున చేతిని జాచి అందుకోవాల్సిన ఆ పెద్దమనిషి, అటువంటిపని ఏదీ చేయకుండా, కిందినుంచి పైదాకా పట్టిపట్టిచూశాడు అతన్ని.

'ఏమిటి చూస్తున్నావ్?' అయోమయంగా అడిగాడు వెట్టి.

'నువ్వు తాగింది ఒక్క టీ. దానికి నువ్వు ఇవ్వాల్సింది ఐదు రూపాయలు. వెయ్యిరూపాయల నోటును నా మొఖం మీదికి కొడితే అంత చిల్లరను నేను ఎక్కడినించి తీసుకు రావాలి?' కోపంగా అడిగాడు దుకాణం యజమాని.

అప్పుడు - అతను అంత వెటకారంగా మాట్లాడినప్పుడు చూసుకున్నాడు వెట్టి తను బయటికి తీసిన నోటుని.

నిజమే.. వెయ్యిరూపాయల నోటే అది. అది ఒక్కటే కాదు. అంతకుముందు రోజు ప్రత్యూష అందించిన నోట్ల పొత్తికలో ఉన్నవి కూడా ఒకటితప్ప అన్నీ వెయ్యినోట్లే. దానితోనే రాత్రి సిగరెట్ పాకెట్ తీసుకోవటం జరిగింది.

ఈసారి తన తప్పులేకపోయినా సిగ్గుపడ్డాడు అతను. 'నీ దగ్గర ఉంచు. చిల్లరతెచ్చి ఇచ్చిన తర్వాత తీసుకుంటాను' అన్నాడు ఆ నోటును అలాగే ముందుకు తోస్తూ.

తెల్లబోయాడు దుకాణం యజమాని. 'నిన్ను ఐదు రూపాయలకు నమ్మటం ఇష్టం లేక అరిచి కేకలు పెట్టాను. వెయ్యిరూపాయలకు నన్ను నమ్మి వెళ్ళిపోతావా?' అని అడిగాడు అస్పష్టంగా.

హాస్పిటల్ దగ్గర్నించి పెద్దగా చప్పుట్లు వినబడడంతో అటుకేసి చూశాడు వెట్టి. శంకరయ్య నిలబడి ఉన్నాడు మెయిన్‌గేటు దగ్గర. పగటి సమయంలో గేటు దగ్గర ఉండే గార్డు పరుగులాంటి నడకతో దుకాణం దగ్గరికి వస్తున్నాడు.

'ఏమిటి హడావుడి? ఏమయింది?' అనుమానంగా అడిగాడు వెట్టి.

'నీ కోసమే అందరూ చూస్తున్నారు. డాక్టరుగారు కేకలు పెడుతున్నారు. నువ్వేమో ఇక్కడ కబుర్లతో కాలక్షేపం చేస్తున్నావు' అన్నాడు గార్డు.

'కాలక్షేపం కాదు. టీ డబ్బులు ఇవ్వాలి. చిల్లర లేక నిలబడిపోయాను అంటూ ఎక్సప్లనేషన్ ఇచ్చుకోబోయాడు వెట్టి. 'ఐదు రూపాయల టీకి వెయ్యి నోటు ఇస్తున్నాడు నువ్వే చూడు' కంప్లయింట్ చేశాడు దుకాణం యజమాని.

'ఓరినీ... ముష్టి ఐదుకోసం ఈ మనిషిని నిలబెట్టేశావా?' గట్టిగా మాట్లాడితే ఆ వెయ్యి నోటును నీ మొఖం మీదికి విసిరికొట్టి పోగలడు. ఎవరని అనుకుంటున్నావ్? శివారెడ్డి సారు మనిషి. ఇప్పుడు ఇతగాడు దగ్గర లేకపోతే హాస్పిటల్లో నుంచి బయటికి రానంటున్నట్టు ఆ పెద్దమనిషి. వదిలేయ్...తర్వాత చూసుకోవచ్చు..' అంటూ వెట్టి చెయ్యి పట్టుకుని, 'ముందు మీరు పదండి నాయనా' అన్నాడు గార్డు.

తెరుచుకున్న నోరు తెరుచుకున్నట్టే ఉండిపోయింది దుకాణం యజమానికి. 'నీ దగ్గర చిల్లర ఉంటే అతనికి ఇచ్చేయ్' గార్డు చేతిని వదిలించుకుంటూ చెప్పాడు వెట్టి.

గబగబా తన జేబులో నుంచి ఒక కాయిన్ తీసి దుకాణం యజమాని దగ్గిర పెట్టాడు గార్డు. తన దగ్గరే ఉన్న నోటును అతని జేబులోకి నెట్టాడు వెట్టి. 'చిల్లర మార్చి ఉంచు. నేను తర్వాత తీసుకుంటాను' అంటూ ముందుకు నడక మొదలు పెట్టాడు.

'ఎవరు తమ్ముడు అతను?' చిన్నకంఠంతో అక్కడే నిలబడిపోయిన గార్డుని అడిగాడు దుకాణం యజమాని. 'చెప్పానుగా... శివారెడ్డిసారు మనిషని' తన జేబులోకి నెట్టబడిన నోటును తడుముకుంటూ అన్నాడు గార్డు.

అది సరే. అసలు ఎవరు? ఎక్కడివాడు?' మళ్ళీ అడిగాడు యజమాని.

'అదేమిటో నాకు తెలియదుగాని, ఒక విషయం నేను స్వయంగా విన్నది చెపుతా. మళ్ళీ ఎవరితోనూ చెప్పకూడదు.' గొంతు తగ్గించి, చుట్టూ చూస్తూ అన్నాడు గార్డు.

కుతూహలం ఎక్కువైపోయింది దుకాణం యజమానికి. 'అమ్మతోడు... ఎవరికీ చెప్పను' చాక్లెట్లున్న సీసాల మీదినుంచి ముందుకు వంగుతూ ఒట్టు పెట్టుకున్నాడు.

'రాత్రి బాజిరెడ్డిసారు వచ్చి కేకలు పెడుతున్నప్పుడు ఈ అబ్బి ఆయన షర్టు పట్టుకుని గోడకేసి కొట్టాడు..' అన్నాడు గార్డు.

తెల్లబోయినంత పనిచేశాడు దుకాణం యజమాని. నోటిమీద చెయ్యి వేసుకున్నాడు తనకు తెలియకుండానే.

మనిషిని చూస్తే మహాబుద్ధిమంతుడి మాదిరిగా కనిపిస్తాడు. చేతలు మాత్రం సూపర్ లెవెల్లో ఉన్నాయి. ఈసారి టీ తాగటానికి ఇక్కడికి వస్తే గీసి గీసి బేరాలు ఆడబోకు..' అంటూ తను కూడా కదిలాడు గార్డు.

గొంతు తడారిపోయినట్టు చేత్తో తడుముకుంటూ తన చెక్కబల్ల మీద చతికిలబడిపోయాడు దుకాణం యజమాని.

•••

అప్పటికప్పుడు ఇంటికి వెళ్ళిపోవచ్చని చెప్పటం అయితే చెప్పాడు గాని, చెప్పిన అరగంట తర్వాత టెస్టులు చేయడం మొదలుపెట్టి, మధ్యాహ్నం

**బాజిరెడ్డి పూజచేయించి రావడానికి అహోబిలం వెళ్ళాడు. వెట్టిని చౌడేశ్వరి గుడికి పోయిరమ్మన్నాడు. తనను అంతమొందించడానికి ఏదో పెద్ద ప్లానే వేశాడనిపించింది వెట్టికి! వెళ్ళాలా వద్దా అని ఆలోచిస్తూ టీ తాగుదామని బయటకు వెళ్ళాడు. దుకాణం పక్కనే ఏదో కనిపించీ కనిపించకుండా కనిపించిందతనికి. వెంటనే అలర్టయ్యాడు. ఆ దుకాణం పక్కన వెట్టికి కనిపించిందేమిటి?**

పన్నెండు గంటల వరకూ ఎవరినీ ఎక్కడికీ కదలనీయలేదు డాక్టరుగారు.

'క్యాంటిన్ ఒకటి ఉంది కదా... శుభ్రంగా కాఫీలు, టీలు, టిఫిన్లు మీ దగ్గరికి తీసుకువచ్చి ఇచ్చే స్టాఫ్ ఉన్నారు కదా. ఎందుకు ఊరికే కంగారు పడటం?' వేళ మించిపోతోందని కంప్లయింట్ చేయబోయిన శంకరయ్య మీద విరుచుకు పడినంత పనిచేశాడు.

'ఇక్కడ ఇంత ఆలస్యం జరుగుతుందని తెలిసి కూడా పొద్దున నన్ను ఆ చిల్లరకొట్టు దగ్గర్నించి కొంపలు మునిగిపోతున్నట్టు పిలిపించటం దేనికి?' కూర్చుని కూర్చుని చిరాకు అధికమై తను కూడా శంకరయ్యని అరిచాడు వెట్టి.

డాక్టరుగారు అరిచినప్పుడు అమాయకంగా తల ఊపిన శంకరయ్య ఇప్పుడు మాత్రం అలా బేలగా చూడలేదు. 'తలనొప్పి నీకు ఒక్కడికే కాదు. నాకు కూడా వస్తోంది. నీకే  కాదు అందరికీ వస్తోంది. మమ్మల్ని ఈ నరకంలో వదిలిపెట్టి నువ్వు ఒక్కడివే హాయిగా బయట తిరగటం నాకు నచ్చలేదు. అందుకే పిలిపించాను' సీరియస్‌గా చెప్పాడు.

వెంటనే వచ్చేసింది వెట్టికి అనుమానం. 'ఇది నీకు వచ్చిన ఆలోచనేనా?' ఇంకెవరికైనా వచ్చినదా?' అని అడిగాడు.

'నువ్వు ఊరికే అనుమానపడి గింజుకోవాల్సిన అవసరం లేదు. ప్రణవమ్మ చెప్పింది నిన్ను ఒంటరిగా రోడ్డుమీద ఎక్కువసేపు నిలబడనీయవద్దని..' అంటూ అసలు విషయాన్ని సూటిగా బయటపెట్టేశాడు.

'నిన్న ఎప్పుడో చేసిన స్నానాలు... మార్చుకున్న డ్రస్సులు.. ఒళ్ళు చెడిపోయి మురికి వాసన కొడుతోంది. మనమంటే మడ్డిమనుషులం కాబట్టి, ఏమీ చెయ్యలేక ముక్కులు మూసుకుని దూరంగా వెళ్ళిపోతారు అందరూ. మరి ప్రణవమ్మా?' కుర్చీలో సర్దుకు కూర్చుంటూ అడిగాడు వెట్టి.

'నీకు ఒక్కడికే బుర్ర తిన్నగా ఉన్నట్టు మాట్లాడబోకు. అటు చూడు' అంటూ హాలు మొదటి భాగంలోకి చూపించాడు శంకరయ్య.

ఎప్పుడు, ఎక్కడ స్నానాలు చేశారో గాని, ఫ్రెష్‌గా తయారైపోయి కనిపిస్తున్నారు ఆడవాళ్ళు అందరూ. అతను చూస్తూ ఉండగానే అవతలికిపోయారు.

'నువ్వు టీ తాగటానికి వెళ్ళగానే ఇంటికి ఫోన్ చేయటం జరిగింది. కావాల్సిన సరంజామాతో సంపంగి వచ్చి చాలాసేపు అయింది. వస్తూవస్తూ పదిమందికి సరిపడా భోజనాల్ని క్యారేజీల్లో పెట్టుకుని తీసుకువచ్చింది. నేను లాగించేశాను. నువ్వే మిగిలిపోయావు' చెప్పాడు శంకరయ్య.

అతను ఆ మాటలు చెపుతూ ఉండగానే పెద్ద పెద్ద అడుగులు వేస్తూ వచ్చింది ప్రత్యూష. 'ప్రణవి



## కత్రినా కొత్త లవ్ కహానీ...



*రణబీర్‌తో బ్రేకప్ అయిన తరువాత బాలీవుడ్‌లో ఎవరితోనూ జత కట్టలేకపోయింది కత్రినా. బాలీవుడ్ ప్రేమలు పెళ్ళి దాకా వెళ్ళవనుకుందో ఏమో... అంబాని కొడుకుతో ప్రేమ వ్యవహారం మొదలెట్టిందట! అయితే ఈ వ్యవహారాన్ని రహస్యంగా ఉంచాలని కత్రినా ఎంత ప్రయత్నించినా అది కాస్తా బట్టబయలైపోయింది. ఇటీవల ఓ ఫంక్షన్‌కి ఇద్దరూ ఒకే కారులో రావడం అందరి కంటా పడింది. దాంతో కత్రినా ఏకంగా బిగ్‌షాట్‌నే పట్టిందన్న వార్తలు బాలీవుడ్‌లో తెగ హల్‌చల్ చేస్తున్నాయి. రెండు సార్లు ప్రేమలో విఫలమైన కత్రినా మూడోసారి బాగానే జాగ్రత్త పడుతోందని అంటున్నారు.*

నిన్ను గదిలోకి రమ్మని చెప్పింది' అంటూ తాము ఆక్రమించుకున్న గదికేసి చూపించి, తను అటు బయలుదేరింది.

'వెళ్ళు... త్వరగా తిని, త్వరగా వచ్చేయ్. నిన్ను చూపిస్తేగాని డాక్టరుగారు మా మాట వినేటట్టు కనిపించటం లేదు' అన్నాడు శంకరయ్య.

గది దగ్గరికి వెళ్ళిన వెట్టికి లోపల ప్రత్యేకంగా వేయించిన కుర్చీల్లో ఒకదాన్ని ఆక్రమించుకుని కనిపించింది ప్రణవి.

'రావాలి విఠల్‌బాబూ...నాకు ఆకలి దంచేస్తోంది. నీ కోసమే వెయిటింగ్' అంటూ పిలిచి, అతను దగ్గరికి రాగానే ముక్కులు మూసుకోలేదు గాని, నుదురు చిట్లించింది.

'నువ్వు వెయ్యికాదు లక్ష తిట్లు తిట్టుకో. ఇంటికి పోయే వరకూ నా అవతారం ఇంతే' మొండిగా చెప్పి ఇంకో కుర్చీలో కూర్చున్నాడు వెట్టి.

మంచం దగ్గర ఉన్న క్యారేజీల్లోని పదార్థాలన్నిటినీ రెండు ప్లేట్లలోకి ట్రాన్స్‌ఫర్ చేసి, ఇద్దరికీ అందించింది ప్రత్యూష.

'నువ్వు?' అడిగాడు వెట్టి.

'వడ్డించేందుకు సంపంగి వదినమ్మ దగ్గిర ఉంది. మీరు కానిచ్చిన తర్వాత తింటాను. మొదలు పెట్టండి' అంటూ బెడ్ మీద కూర్చుంది ఆమె.

'రోడ్డుమీదికి పోయి ఫ్రెష్ ఎయిర్‌తో తిరిగి వచ్చావు. ఏమైనా కొత్త ఆలోచనలు వచ్చాయా?' అడిగింది ప్రణవి.

'ముందు అతన్ని తిననీ ప్రణవీ. నువ్వు రెచ్చగొట్టకు. ప్లేటు కిందపెట్టి మళ్ళీ రోడ్డుమీదికి పోయి వస్తానంటాడు' హెచ్చరించింది ప్రత్యూష.

తెల్లటి పల్వరుస బయటికి కనిపించేలా అందంగా నవ్వింది ప్రణవి. 'నువ్వు నాకు కాపలా అయితే తను నీకు కాపలాగా మారిపోతోంది. జాగ్రత్తే..' అంటూ మరోసారి ప్రశ్నార్థకంగా చూసింది.

చుట్టలు చుట్టుకుని ఉన్న తన శరీరం మీద తలను ఆనించి, పరమ ప్రశాంతంగా కనిపించిన పాము వెట్టి కళ్ళముందు ప్రత్యక్షం అయింది. ఏదో మెసేజ్‌ని కన్వే చేయటానికి ప్రయత్నించింది అది. ఏమై ఉంటుంది ఆ మెసేజ్??

సంపంగి చేసి తీసుకువచ్చిన పదార్థాలతో ఎర్రగా, ఒళ్ళు జలదరించే లెవెల్లో కనిపిస్తున్న పండు మిరపకాయ పచ్చడిని చూపుడు వేలితో అద్ది, నాలుక మీద పెట్టుకున్న మరుక్షణం కపాలం పైభాగం వరకూ పాకింది కారం. గిర్రున తిరిగాయి కళ్ళవెంట నీళ్ళు.

'ఈ గడ్డమీది వాడినేనని చెప్పావు. ఈ మాత్రం కారాన్ని తట్టుకోలేవా?' అడిగింది ఆశ్చర్యంగా ప్రణవి.

'హాస్టళ్ళలో తింటూ, ఒంటరి బతుకు బతికిన వాడు కదా! ఇళ్ళల్లో వంటకాల రుచి మర్చిపోయి ఉంటాడు' అంటూ పెద్దగిన్నెలో పేరుకోవటానికి రెడీ అవుతున్న వెన్న కాచిన నెయ్యిని అతని ప్లేటులో కుమ్మరించినంత పని చేసింది ప్రత్యూష.

చెయ్యి అడ్డం పెట్టటానికి శక్తివంచన లేకుండా ప్రయత్నం చేశాడు అతను. చెయ్యి తడిసిపోయిందే తప్ప, ఉపయోగం అంటూ లేకపోయింది.

'హాస్టళ్ళలో తిండి రుచికరంగానే ఉండేది. అన్ని రుచులు అద్భుతంగానే ఉండేవి. గ్రానైట్ మైన్స్‌లోనే ప్రాబ్లం స్టార్ట్ అయింది. ఉప్పు పప్పు అస్సలు కంటికి కనిపించేవి కావు. ముక్కిపోయిన గింజలతో తయారుచేసిన జావ వంటి ద్రవపదార్థాలతోనే కడుపులు నింపుకోవాల్సి వచ్చేది. కారం అనే పదార్థం కలికానికి కూడా కనపడేది కాదు..' చేతికి దట్టంగా అంటుకున్న నేతిని ప్లేటు అంచులకేసి రాస్తూ చెప్పాడు అతను.

'అవును కదూ! మధ్యలోనే ఆగిపోయింది ఆ కథ. ఇప్పుడు మనం విరగబొడిచే వీరకార్యాలు ఏమీ లేవు కదా! నువ్వు చెప్పడం మొదలు పెట్టవచ్చు' ఉత్సాహంగా అన్నది ప్రణవి.

'కొంచెం నిదానించు ప్రణవీ. వదినమ్మ కూడా వినాలి కదా! మా డాడీ తను లేకుండా ఇతన్ని మాట్లాడిస్తే మొఖం ముడుచుకుంటాడు' ఇంటికి పోయిన తర్వాత చెప్పమనటం బెటరు. వెంటనే అబ్జెక్ట్ చేసింది ప్రత్యూష.

'అదే కరెక్టు ప్రణవమ్మా! వదినమ్మ లేకుండా ఇతను నోరు తెరవకూడదు' అంటూ వినవచ్చాయి మాటలు, గది బయటినుంచి.

ఆశ్చర్యంగా చూసిన ప్రణవికి కనిపించాడు శంకరయ్య. 'మీరందరూ ఇక్కడ కూర్చుంటే... నేను ఒక్కడినే అక్కడ దేనికని వచ్చేశాను' అంటూ లోపలికి వచ్చి ఇంకో కుర్చీలో కూర్చున్నాడు శంకరయ్య.

'బాబాయ్... నువ్వు ఇంటికేమైనా ఫోన్ చేశావా?' అడిగింది ఆమె.

'ఇందాక చేశాను. రమణయ్య పంతులుగారు క్షేమంగా చేరుకున్నాడు అక్కడికి. జయమ్మ తల్లికి నచ్చచెప్పటానికి నానాబాధలు పడుతున్నార్ట అందరూ' చెప్పాడు శంకరయ్య.

ఛట్‌మంటూ మరోసారి వెట్టి కనులముందు మెదిలింది, తలను కిందికి దించి ప్రశాంతంగా కనిపించిన పాము.

కారణం అడిగితే చెప్పటం కష్టమని అతనికి అర్థం అవుతూనే ఉన్నది. కాని అప్పటికప్పుడు అతని మనసులోకి ఎంటర్ అయింది ఒక కొత్త ఆలోచన. శంకరయ్య, ప్రణవిల మధ్య జరుగుతున్న సంభాషణలో పాలుపంచుకోలేదతను. తల వంచుకుని చేతిలో ఉన్న ప్లేటుమీద దృష్టిని కేంద్రీకరించి, రెండే రెండు నిమిషాల్లో తినటం ముగించాడు.

'వాష్‌బేసిన్లు ఏమీలేవు ఇక్కడ. చెయ్యి ప్లేటులోనే కడిగేయ్. సంపంగి వచ్చి క్లీన్ చేసుకుంటుంది' వెంటనే అన్నది ప్రణవి.

'పద అబ్బయ్యా. మనం పోయి డాక్టరుగారి దగ్గర నిలబడదాము' అంటూ వెట్టి వెనుకే, గది బయటికి వచ్చాడు శంకరయ్య.

ప్రణవీ... అతని మనస్సులోకి ఏదో పురుగు ప్రవేశించింది. మొఖం అదోలా మారిపోయింది. మనం కూడా వాళ్ళతో వెళ్ళటం మంచిది' ప్రణవికి చెప్పింది ప్రత్యూష.

'ఆర్ యూ ష్యూర్?' అడిగింది ఆమె.

తల ఊపింది ప్రత్యూష.

'అయితే ఆలస్యం వద్దు. నువ్వు కూడా తినేయ్..' తన ప్లేటును అవతలపెట్టి చేతిని శుభ్రం చేసుకుంటూ అన్నది ఆమె.

'నేను తర్వాత తింటాను. ముందు మనం వెళ్ళాలి' తెరిచిన క్యారేజీలన్నిటినీ మూతలు సరిచేయకుండా మంచం కిందికి నెడుతూ చెప్పింది ప్రత్యూష.

'బంధాలు బలపడటం మొదలుపెడితే ఆత్రుతలు కూడా అధికం అయిపోతాయని ఎక్కడో చదివాను. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాను' నవ్వుతూ అన్నది ప్రణవి.

'నీకు కూడా అనుభవంలోకి వచ్చేరోజు ఒకటి తప్పకుండా వస్తుంది. అప్పటివరకూ నేనూ వెయిట్ చేసి, ఆ తర్వాత చెప్తాను సమాధానం' తాను కూడా నవ్వుతూనే అన్నది ప్రత్యూష.

●●●

'కమాన్ యంగ్‌మాన్... చాలాసేపు అయింది నిన్ను చూసి..' అంటూ ఐసియు దగ్గిరే ఎదురై వెట్టిని పలకరించాడు డాక్టరుగారు.

'ఇంటికి వెళ్ళిపోవచ్చన్నారు. నర్సును పంపిస్తామన్నారు. అంబులెన్స్‌ని, అటెండెంట్స్‌ని సిద్ధం చేయమన్నారు. ఇప్పటివరకూ మాకు విమోచనం కలగలేదు' సన్నగా వెక్కిరించాడు వెట్టి.

'డోన్ట్‌వర్రీ యంగ్‌మాన్? మేమేమీ ఇక్కడ అచ్చంగాయలు ఆడుకోవటం లేదు. కంప్లీట్ బాడీ చెకప్ చేస్తున్నాము. యూనో వన్‌థింగ్?' గొంతు తగ్గించి చిన్నగా అన్నాడు డాక్టరుగారు.

కుతూహలంగా ముందుకు వంగాడు వెట్టి.

'పొద్దున నీకు చెప్పిన మాట సెంట్ పర్సెంట్ కరెక్ట్ అయింది. ఇంకో పదిరోజుల్లో శివారెడ్డి సార్

విల్‌బి క్వయిట్ ఆల్‌రైట్! ఎడమవైపు కిడ్నీ పూర్తిగా నార్మల్ అయిపోతుంది.' ఉత్సాహంగా చెప్పాడు డాక్టరు.

'మరి కుడివైపుది?' అడిగాడు వెట్టి.

'చలనం లేదు.... చూద్దాం... ట్రబుల్ క్రియేట్ చేసేటట్లయితే కోసి అవతల పారేద్దాం' చాలాతేలికగా చెప్పాడు డాక్టరుగారు.

'అయ్యబాబోయ్! కోసేస్తారా? అయితే ఎలా?' ఆత్రుతగా అన్నాడు వెట్టి.

'ఓరినీ... నువ్వెక్కడో పిచ్చివాడిలా ఉన్నావు. భగవంతుడు మనకి రెండు ఇచ్చింది, రెంటినీ ఉపయోగించుకోమని కాదు. ముఖ్యమైన అవయవం కాబట్టి ఒకదాన్ని స్పేర్‌లో స్టెప్నీలాగా దాచిపెట్టుకోమని... మనం బతకటానికి ఒకటివుంటే చాలు... శివారెడ్డి సారులాంటి వాళ్ళకి ఒకటిలో సగం ఉన్నా చాలు... హ్యాపీ' అన్నాడు డాక్టరు.

'థాంక్యూ డాక్టరుగారు..' అన్నాడు వెట్టి.

నవ్వుతూ అతని భుజం తట్టాడు డాక్టరు. 'మీ బాజిరెడ్డి నాకు మళ్ళీ కనపడలేదు. అహోబిలం వెళ్ళినట్టేనా?' అని అడిగాడు.

'బాజిరెడ్డి తీసుకువచ్చిన వాళ్ళ పరిస్థితి ఏమిటి?' అడిగాడు వెట్టి.

'మోకాలు పర్మినెంట్‌గా డామేజ్ అయింది ఒకనికి. పక్కటెముకలు విరిగాయి ఇంకొకడికి. ముక్కుదూలం విరిగిపోయింది మరొకరికి. లెక్క ప్రకారం బాజిరెడ్డి దగ్గర కనీసం ఏడెనిమిది లక్షలు వసూలు చెయ్యాలి' చెప్పాడు డాక్టరు.

'అడిగిచూడండి. కనీసం రెండు మూడైనా ఇవ్వకపోతాడా?' తన అభిప్రాయాన్ని వెల్లడించాడు వెట్టి. అంతలోనే అతనికి గుర్తుకు వచ్చింది ఒక మాట.

'బాజిరెడ్డిసారు నన్ను చౌడేశ్వరి గుడి దగ్గరికి పోయి రమ్మని చెప్పాడు. శివారెడ్డిసారు తండ్రి గారికి ఆ దేవత అంటే పరమభక్తి అట' అన్నాడు.

'నిజమే చెప్పాడు. ఈ మాటని నేను కూడా చాలాసార్లు విన్నాను. భగవంతుడిని ప్రార్థించటంలో తప్పేమీ లేదు. ఒకసారి వెళ్ళివస్తే ఒక పని అయిపోతుంది' అంటూ దూరం నుంచి ఇంకో డాక్టరు చేయి ఊపేసరికి, పెద్దపెద్ద అడుగులు వేస్తూ అటు పోయాడు డాక్టరుగారు.

తను కూడా ఆయనతో పాటుగా వెళ్ళి శివారెడ్డి తండ్రిగారికి సంబంధించిన విషయాలు అడిగి తెలుసుకోవాలనుకున్న వెట్టి కోరికకు ఆదిలోనే హంసపాదు ఎదురయింది.

'నువ్వు మోకాలు విరగ్గొట్టిన దున్నపోతు దగ్గరికే పోతున్నాడు డాక్టరుగారు. బాధను భరించలేక వాడు పెడుతున్న గావుకేకలు హాల్లోకి కూడా వినబడుతున్నాయి. ఇప్పుడు నువ్వు వెళ్ళి వాడిని చూడటం అవసరమా?' అని అడుగుతూ వచ్చింది ప్రణవి.

నోరు తెరిచి ఏదైనా సమాధానం చెపితే ఆమె ఇంకో హెచ్చరిక చేస్తుందన్న అనుమానంతో మౌనంగా ఉండిపోయాడు అతను.

'హల్లో ఎవ్రీబడీ... టెస్టులన్నీ పూర్తి అయిపోయాయి. ఇంక మీరు సారును ఇంటికి తీసుకుపోవచ్చును' అంటూ ఐసియూలో నుంచి ఒక డాక్టరు బయటికివచ్చి చెప్పటంతో..... గుంపుగా లోపలికి పోయారు అందరూ.

'ఇది ఐసీయూ అనుకున్నారా, మీ ఇంటి డ్రాయింగ్ రూమ్ అనుకున్నారా? ఏమిటి ఇలా వచ్చేస్తున్నారు?' కోపంగా అడిగింది అక్కడ ఉన్న నర్సు.

కోపం చేయకు తల్లీ. నెమ్మదిగా చెప్పు. బయటే ఉండమంటే సరిపోతుందికదా! మా ఆత్రం మాది' ఆమెకు సర్దిచెప్పబోయిన శంకరయ్యను దగ్గరికి పిలిచాడు శివారెడ్డి.

'అమ్మ దగ్గర్నించి మాట ఏదైనా వచ్చిందా?' అని అడిగాడు.

వివర్ణమై పోయింది శంకరయ్య మొఖం. సమాధానం ఏమని చెప్పాలో తెలియకపోవడం వల్ల, శివారెడ్డి భార్యవైపు చూశాడు.

'ఇంటికి వెళుతున్నాము కదా. అక్కడనుంచి ఫోనుచేసి మాట్లాడదాము. ఇప్పటికిప్పుడు తెలుసుకోవాల్సిన అవసరం లేదు గదా..' చిన్న కంఠంతో చెప్పింది ఆమె.

'లేదు రాజీ. ముందు ఆ విషయం తేలిపోవాలి. అది తేలిపోతేగాని నాకు మనశ్శాంతి ఉండదు' అన్నాడు శివారెడ్డి.

తామందరూ అక్కడ ఉండగానే, తమకు తెలియకుండా బాజిరెడ్డి ఐసియులోకి వచ్చి శివారెడ్డి చెవిలో నసపెట్టి వెళ్ళాడేమోనన్న అనుమానం వెంటనే కలిగింది వెట్టికి.

'ఇదిగో వెట్టీ..' ఉన్నట్లుండి అతన్ని పిలిచాడు శివారెడ్డి.

'అతని పేరు అది కాదు' అని కరెక్ట్ చేయబోయి, ఆఖరి క్షణంలో విల్‌పవర్‌నంతా కూడగట్టుకుని, ఆ మాటను మింగేసింది ప్రణవి.

'ఏంటి సారూ?' దగ్గరికి పోయి చిన్నగా అడిగాడు వెట్టి.

'బాజిరెడ్డి అహోబిలం వెళ్ళి పూజచేయించి వస్తానని చెప్పాడట. నిన్ను చౌడేశ్వరి దగ్గరికిపోయి రమ్మన్నాడట కదా..' అడిగాడు శివారెడ్డి.

చలనం లేని రాతిబొమ్మలా బిగుసుకుపోయాడు వెట్టి. ఎక్కడో హాస్పిటల్ ముందు భాగంలో జరిగిన సంభాషణ, ఐసియులో ఉన్న శివారెడ్డి దాకా ఎలా వచ్చింది?

తనకు తెలియకుండానే ప్రణవి వైపు చూశాడు అతను. అతని మాదిరిగానే నివ్వెరబోతున్నది ఆమె. శంకరయ్యను చాటు చేసుకుని, తనకేమీ తెలియదని పెదవులు విరిచింది.

ముసుగులో దెబ్బలాటలు అవసరం లేదని అనిపించి, 'మీకు ఎవరు చెప్పారు సారు?' అడిగాడు వెట్టి.

'సంపంగి చెప్పింది. దారిమధ్యలో కారు ఆపించి మరీ చెప్పమని అన్నాడట బాజిరెడ్డి' వెంటనే ఆయనకి సమాధానం ఇచ్చింది శివారెడ్డి భార్య.

'అవును సారూ, చౌడేశ్వరికి పూజ చేయించటం చాలా మంచిదని బాజిరెడ్డిసారు స్వయంగా చెప్పాడు' ఒప్పుకున్నాడు వెట్టి.

'అయితే ఆలస్యం చేయకు. వెంటనే ఆ పని చూడు. మనం ఇంటికి వెళ్ళిన తర్వాతనే సుమా..' అన్నాడు శివారెడ్డి తృప్తిగా.

అతని భార్య వెనుక నిలబడి ఉన్న సంపంగి వైపు ఓరగా చూశాడు వెట్టి. మొఖంలో ఎటువంటి భావాలు కనిపించటం లేదు. నిర్వికారంగా నిలబడి ఉన్నది ఆమె.

'రెడీనా? అంబులెన్స్ సిద్ధం..' అంటూ డాక్టరుగారు లోపలికి వచ్చేసరికి ఆగిపోయాయి సంభాషణలన్నీ.

బెడ్‌మీద ఉన్న శివారెడ్డిని అతి సున్నితంగా, సుకుమారంగా బయటికి తీసుకుపోయే కార్యక్రమం స్టార్ట్ అయింది.

●●●

'సంపంగి ఎవరు? ఎక్కడినించి వచ్చింది? ఎంత కాలం నుంచి మీ దగ్గర పని చేస్తోంది?' తమ కారు స్టీరింగ్ ముందు కూర్చుంటూ అడిగాడు వెట్టి.

తమకంటే యాభైగజాలు ముందుకు పోతున్న అంబులెన్స్ మీది నుంచి చూపుల్ని మరల్చుకుని, అతనికేసి చూస్తూ, ముక్కును గట్టిగా మూసుకున్నది ప్రణవి.

'ముందు నువ్వు స్నానంచేసి డ్రస్ ఛేంజ్ చేసుకున్న తర్వాతనే నీతో మాట్లాడతాను. అప్పటి వరకూ మాటలు బందు' అన్నది.

'మరీ ఓవర్ చేస్తున్నావు ప్రణవీ. అంత భయంకరంగా ఏమీలేదు. నార్మలే' అన్నది వెంటనే ప్రత్యూష.

'నీకు అలా అనిపించటం నార్మల్. ఇక్కడ మాకు మాత్రం ఊపిరి ఆగిపోతున్నది' సీరియస్‌గా చెప్పింది ప్రణవి.

'పోనీయ్యవయ్య... వీళ్ళతో పెట్టుకుంటే మనం ఇక్కడే ఉంటాము, శివారెడ్డి ఇంటి దాకా వెళ్ళిపోతాడు' ముందు సీట్లో ఉన్న శంకరయ్య హెచ్చరించాడు.

కారు స్టార్ట్ చేసి యాక్సిలేటర్‌ని అదిమాడు వెట్టి.

**(ఇంకా వుంది)**



## హెపటైటిస్ వైరస్‌ను అడ్డుకునే చికిత్స

**హెపటైటిస్ :** హెపటైటిస్ వైరస్ ప్రభావం ప్రధానంగా కాలేయంపై ఉంటుంది. ఈ వైరస్ మూలంగా అనేక మంది తీవ్రమైన కాలేయ వ్యాధి బారినపడి ప్రాణాలు కోల్పోతున్నారు. ఈ వైరస్ ముఖ్యంగా రక్తం ద్వారా వ్యాపిస్తుంది. వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం కారణంగా చెప్పుకోవచ్చు. తల్లి నుంచి శిశువుకు కూడా సంక్రమించే అవకాశం ఉంది. లైంగిక సంబంధాల ద్వారా కూడా వ్యాపిస్తుంది. ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. లో గ్రేడ్ ఫీవర్, పొట్ట పైభాగంలో నొప్పి, జాండిస్ వంటి లక్షణాలు కనిపిస్తాయి. అయితే హెపటైటిస్ బి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది. వాంతులు, కొన్నిసార్లు విరేచనాలు, కడుపు ఉబ్బరంగాఉండటం, పొట్టలో నొప్పి, రక్తనాళాలు వాచిపోవడం, కిడ్నీ సమస్యలు, ప్లేట్‌లె ట్స్ కౌంట్ పడిపోవడం జరుగు తుంది. అజీర్తి, పొట్ట ఉబ్బరంగా అనిపించడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. అడ్వాన్స్ స్టేజ్‌కు వెళ్లినట్లయితే బరువు కోల్పోవడం, వికారం, వాంతులు, ఏకాగ్రత లోపించడం, కుడివైపు పొట్టలో నొప్పి, కాలేయం వాపు వంటి లక్షణాలుంటాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ వైరస్‌ను అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. కాలేయంలో పేరుకుపోయిన కొవ్వు నిలువలను తిరిగి బయటకు పంపించడం హోమియోతో మాత్రమే సాధ్యమవుతుంది.

## హెచ్‌ఐవి, హెర్పిస్‌ల ఆట కట్టించొచ్చు

**హెచ్‌ఐవి :** హెచ్‌ఐవి సోకితే మరణం తప్పదా? అంటే కానే కాదు. చికిత్స లేని వ్యాధిగా హెచ్‌ఐవికి పేరుంది. అయితే హోమియోలో హెచ్‌ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్‌ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్‌ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, చిన్న చిన్న వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్ సింప్లెక్స్**

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స**

హెచ్‌ఐవి, హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్‌ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## పిల్లలు పుట్టకపోవడం శాపం కానేకాదు

**ఆధునిక చికిత్సలు** ఎన్ని అందుబాటులోకి వచ్చినా సంతానలేమితో బాధపడుతున్న దంపతులకు పరిష్కారాన్ని చూపలేకపోతున్నాయి. అయితే హోమియో మాత్రం ఇందుకు భిన్నంగా సత్ఫలితాలను అందిస్తోంది. ఏడాదిగా ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకపోయినప్పటికీ గర్భం రాకపోయినట్లయితే సంతానలేమి సమస్య ఉన్నట్లుగా భావించాలి.

**కారణాలు ఇవి కావచ్చు :** వీర్యకణాలు తక్కువగా ఉంటే సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. వేరికోసిల్, హైడ్రోసిల్, మూత్ర సంబంధ వ్యాధులు, సుఖ వ్యాధుల వల్ల కూడా వీర్యకణాలు నశించి సంతానలేమికి కారణమవుతూ ఉంటాయి. దీర్ఘకాలంగా షుగర్ వ్యాధి ఉండటం, అధిక బరువు, వృషణాలకు దెబ్బలు తగలడం, ప్రమాదాల్లో వెన్నుకు గాయాలవడం, హార్మోన్ల అసమతుల్యత, క్రోమోజోముల లోపాలు, విపరీతంగా స్మోకింగ్ చేయడం వంటివి కూడా పురుషుల్లో సంతానలేమికి కారణమవుతుంటాయి. బిగుతైన దుస్తులు ధరించడం, ప్రతిరోజు వేడి ఎక్కువగా ఉండే నీళ్లతో స్నానం చేసే అలవాటు ఉండటం వంటివి కూడా కారణమవుతాయి.

**హోమియో చికిత్సతో ఆనందం :** సంతానలేమికి కచ్చితమైన కారణం తెలుసుకుని చికిత్స అందిస్తే సంతానసాఫల్యం తప్పక కలుగుతుంది. వీర్యకణాల లోపం ఉంటే హోమియో మందులు తీసుకోవడం ద్వారా వీర్యపుష్టి కలుగుతుంది. వీర్యకణాల కదలికలు పెరుగుతాయి. హార్మోన్ల సమస్యలు సైతం హోమియో చికిత్సతో తొలగిపోతాయి. అంగస్తంభనలు లేకపోవడం వంటి సమస్య ఉంటే దూరమవుతుంది. మొత్తంగా సంతానలేమి కారణాలన్నీ దూరమయిపోయి సంతానం సిద్ధిస్తుంది.

## నరాల జబ్బులుంటే జీవితం నరకమేగా!

**చేతులు,** కాళ్లు, పాదాలు, ముఖం, నోరు...ఇలా శరీరంలోని అన్ని భాగాల నుంచి నరాలు వెన్నుపాముతోనూ, మెదడుతోనూ అనుసంధానించబడి ఉంటాయి. ఈ నరాల వ్యవస్థ ద్వారానే భౌతిక అనుభూతుల తాలూకు సంకేతాలను మెదడుకు అందుతాయి. అంటే కాలికి దెబ్బతగిలితే నొప్పి తెలియడం వెనక కారణం మెదడుకుసంకేతాలు చేరడమే. అయితే కొందరిలో కొన్ని కారణాల వల్ల ఈ నరాల వ్యవస్థ దెబ్బతింటుంది.

**కారణాలు :** కుటుంబంలో ఎవరెనా ఈ సమస్యతో బాధపడుతున్నట్లయితే వారి పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. డయాబెటిస్‌తో బాధపడే వారిలో ఎక్కువగా కనిపించే సమస్య ఇది. గాయాలు కావడం, దీర్ఘకాలంగా అనారోగ్యం ఉండటం, ఇన్‌ఫెక్షన్లు వంటివి కూడా కారణమవుతాయి. ఆల్కహాల్ అధికంగా సేవించడం, విషపూరితమైన కెమికల్స్‌కు ఎక్స్‌పోజ్ కావడం, కొన్ని రకాల వైరస్‌లు, బ్యాక్టీరియాలు నేరుగా నరాల టిష్యూపై దాడి చేయడం వల్ల కూడా ఈ సమస్య తలెత్తవచ్చు. హెచ్‌ఐవితో బాధపడే వారిలోనూ పెరిఫెరల్ న్యూరోపతి డెవలప్ అయ్యే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు**

చేతులు, పాదాల్లో పొడిచినట్లు అనిపించడం, తిమ్మిర్లు రావడం, చేతుల్లో నుంచి వస్తువులు జారిపడటం, పురుషుల్లో అంగస్తంభనలు తగ్గిపోవడం, మలబద్ధకం, జీర్ణసమస్యలు రావడం, డయేరియా, చెమటలు అధికంగా పట్టడం వంటి లక్షణాలుంటాయి.

**హోమియో చికిత్స**

నరాల సంబంధ సమస్యలకు హోమియో మందులు అద్భుతంగా పనిచేస్తాయి. తిమ్మిర్లు, చెమటలు అధికంగా పట్టడం వంటివి తగ్గిపోతాయి. అంగస్తంభన సమస్యలు దూరమవుతాయి. మొత్తంగా కాంప్లికేషన్స్ అన్నీ దూరమయి ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

# భార్యాభర్తల మధ్య

# వయసు ప్రభావం!

**మనిషి మనుగడకు డబ్బు ఎంత ముఖ్యమో.... వైవాహిక జీవితం సాఫీగా సాగడానికి వయస్సు కూడా అంతే ముఖ్యం అంటున్నారు నిపుణులు. అసలు పెళ్ళి ప్రస్తావన రాగానే ముందుగా గుర్తు కొచ్చేది అమ్మాయి, అబ్బాయి వయస్సు. దీని విషయంలో ఒక్కొక్కరికీ ఒక్కో అభి ప్రాయం ఉంటుంది. భార్యాభర్తల మధ్య వయస్సు అంతరం ఎక్కువగా ఉంటే ఆ కాపురం సవ్యంగా ఉంటుందని కొందరు వాదిస్తే, కాదు తక్కువ అంతరం ఉంటేనే సుఖంగా సాగుతుందని మరికొందరు అంటారు. అసలు వయస్సు అంతరం లేకుండా సమవయస్కులైతే వారి వైవాహిక జీవితం ఇంకా సాఫీగా సాగు తుందనేది మరికొందరి మాట. అసలు ఈ వయస్సు ఎక్కువ తక్కువల సమస్య ఎందుకు? దాని వలన కలిగే కష్ట నష్టాలు ఏమిటి? అన్న వివరాలు...**



### డబ్బు సమస్య

భార్యాభర్తల మధ్య ఇదొక పెద్ద సమస్యగా తయారైందని అంటున్నారు నిపుణులు. వయస్సు అంతరం ఉన్న దంపతుల కన్నా సమ వయస్కులైన దంపతుల మధ్యే డబ్బు, పొదుపు సమస్యలు ఎక్కువగా తలెత్తుతాయంటున్నారు. ఎలాగంటే... మగవారి కన్నా స్త్రీలలో చాలా త్వరగా మెచ్యూరిటీ వస్తుందని చెబుతున్నారు. ఈ కారణంగా భార్యాభర్తల మధ్య డబ్బు విష యంలోనే భేదాభిప్రాయాలు తలెత్తుతాయి. ఎలాగంటే.... భార్య రాబోయే రెండు మూడు సంవత్సరాల అవసరాల గురించి ఆలోచిస్తే.. భర్త అప్పటి అవసరాలకు మాత్రమే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తాం. ఇలా విరుద్ధమైన ఆలోచనల వలన ఇద్దరి మధ్యా విభేదాలు ఎక్కువ అయ్యే ప్రమాదం ఉంది అంటున్నారు. అదే భార్య వయస్సు తక్కువగా ఉంటే ఆమెలో అంత పరిపక్వత లేకపోవచ్చునీ, భర్త చెప్పే దానికి ఎదురు చెప్పకుండా ఆచరించే అవకాశాలు ఎక్కువ అంటున్నారు వాళ్ళు.

**ఇది తప్పు:** భార్యాభర్తలు సమ వయ స్కులైనా లేక వారిమధ్య వయస్సు అంతరం తక్కువగా ఉన్నా వారి ఆలోచనా విధానం కూడా ఒకే విధంగా ఉంటుంది. అలాం టప్పుడు ఇద్దరూ ఒకే మాట మీద నిలబడే అవకాశం ఉంది అంటు న్నారు పరిశోధకులు. భార్యాభ ర్తల మధ్య కనీసం రెండు మూడు సంవత్సరాల వయస్సు అంతరం ఉంటే సరిపోతుందనేది వారి వాదన.

### మనస్పర్థలు

అమ్మమ్మల కాలం నుంచీ భర్త మాట భార్య వినితీరాలి అని ఆడపిల్లలకు నూరిపో స్తుంటారు. కొందరు దీన్ని వ్యతిరే కించినా అంతర్లీనంగా వారి మనస్సులో ఈ మాటలు నాటుకునే ఉంటాయి. భార్య వయస్సు కన్నా భర్త వయస్సు ఎక్కువగా ఉంటే అను భవం ఎక్కువగా ఉంటుందనీ, ఏ పని చేసినా, ఏ నిర్ణయం తీసుకున్నా బాగా ఆలోచించి నిర్ణయం తీసుకుంటారన్నది కొందరి అభి ప్రాయం. భర్తకు నిర్ణయాధికారం ఉంటే ఆ కాపు రంలో కలతలు రావు అన్నది వారి ఉద్దేశం.

**ఇది తప్పు:** అని ఇప్పటికే చాలా పరిశోధ నల్లో రుజువైంది. భార్యాభర్తల మధ్య వయస్సు అంతరం ఎక్కువగా ఉంటే భార్య అభిప్రాయా లకు గౌరవం ఉండదు అని పరిశోధకులు అంటున్నారు. చాలా సమస్యలకు కారణం ఆలో చనా విధానమే అన్నది ప్రత్యేకంగా చెప్పనవ సరం లేదు. భార్యాభర్తల మధ్య ఒకటి నుంచి మూడు సంవత్సరాల వయస్సు తేడా ఉంటే వారి ఆలోచన కూడా ఒకేలా ఉంటుందనీ, చాలా విషయాల్లో ఏకాభిప్రాయం కుదిరి వారు ఆనందంగా జీవించగలుగుతారని వారు స్పష్టం చేస్తున్నారు.

### పిల్లలు

గతంలో భర్త వయస్సు ఎక్కువగానూ, భార్య వయస్సు చాలా తక్కువగా ఉండే విధంగా చూసి పెళ్ళి చేసేవారు. ఉదాహరణకు పురుషుడి వయస్సు 35 సంవత్సరాలు, స్త్రీ వయస్సు 18 లేదా 20 ఏళ్ళు ఉండేది. ఇంత గ్యాప్ ఉంటేనే ఆ దంపతుల జీవితం సవ్యంగా సాగుతుందనీ, పిల్లలు కూడా క్రమశిక్షణతో ఉంటారని గతంలో భావించేవారు.

**ఇది తప్పు:** ఒక పురుషుడు 38 సంవత్స

### ప్రేమాభిమానాలు

సమవయస్కులు, కొద్దిపాటి వయస్సు అంతరం ఉన్న భార్యాభర్తల మధ్య సఖ్యతతో పాటు ప్రేమానురాగాలు కూడా ఎక్కువగా ఉంటాయి. దీనికి కారణం వీరి ఆలోచనా విధానం ఒకే విధంగా ఉండడం, పెద్దగా అభిప్రాయభేదాలు లేపోవడాన్ని కారణాలుగా చెప్పుకోవచ్చు. అదే వయస్సు అంతరం ఎక్కువగా ఉన్నవారిలో పై అంశాలే సమస్యగా పరిణమిస్తాయి అంటు న్నారు పరిశోధకులు. వీరిలో శృంగారపరమైన అసంతృప్తులు ఎక్కువగా ఉంటాయి. ఇవి కొన్ని సార్లు భార్యాభర్తలు విడిపోవడానికి కారణం కావచ్చు అని పరిశోధకులు చెబుతున్నారు. ఈ విషయం ఇటీవల నిర్వహించిన పలుపరిశోధ నల్లో వెల్లడైంది కూడా.

రాల వయస్సులో వివాహం చేసుకుంటే పిల్లలు పుట్టే అవకాశాలు చాలా వరకూ తగ్గిపోతాయని వైద్యులు పదే పదే చెబుతున్నారు. ఆ వ్యక్తికి పిల్లలు పుట్టినా వారు యుక్త వయస్సుకు అంటే 20 లేదా 25 సంవత్సరాలు వచ్చేసరికి ఆ వ్యక్తి ముసలి వయస్సుకి వచ్చి పిల్లల భవిష్యత్తుకు మంచి బాటలు వేసే అవకాశం ఉండదు. అంత లేటుగా కాకుండా తొందరగా అంటే 28 లేదా 30 సంవత్సరాల మధ్య సమవయస్కురాలితో పెళ్ళి అయితే పిల్లలు పుట్టే అవకాశాలు ఎక్కువగా ఉండడమేకాకుండా పిల్లలకు మంచి భవిష్యత్తును ఇవ్వగలుగుతారు. భార్యాభర్తల మధ్య పెద్ద అంతరం లేకపోతే పిల్లల పెంపకం, వారి చదువు, వారి భవిష్యత్తు తదితర విషయాల్లో ఏకాభిప్రాయం కుదిరి పిల్లల భవిష్యత్తుకు బంగారు బాట వేయగలుగుతారు.

### ఆరోగ్యం

భర్త కన్నా భార్య వయస్సు తక్కువ ఉంటే ఆమెలో ఓర్పు ఎక్కువగా ఉంటుందనీ, భర్త అనారోగ్యం పాలైనా ఓపికగా సేవలు చేస్తుందనీ భావించేవారు. ఒక్క భర్తకే కాకుండా కుటుంబం మొత్తానికి కూడా ఆమె సేవలు చేస్తుందని అనేవారు.

**ఇది తప్పు:** ఇది తప్పు అంటున్నారు పరిశోధకులు. భర్త భార్యకన్నా చాలా పెద్దవాడైతే త్వరగా అనారోగ్యం పాలు కావచ్చని, ఈ కారణంగా భార్య అభద్రతాభావానికి గురయ్యే అవకాశం ఉందని వారు చెబుతున్నారు. దీని కారణంగా ఆమెలో కూడా పలు ఆరోగ్య సమస్యలు తలెత్తే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. భార్యాభర్తల మధ్య వయస్సు అంతరం ఎక్కువగా లేకపోతే వయస్సు రీత్యా ఆరోగ్య సమస్యలు వచ్చే అవకాశాలు చాలా తక్కువ అంటున్నారు వారు. ఇక ఒకరికొకరు సేవలు చేసుకోవడం అనేది భార్యాభర్తల మధ్య ఉండే అవగాహన మీద ఆధారపడి ఉంటుందే తప్ప వయస్సు అంతరం కాదని వారు స్పష్టం చేస్తున్నారు.

### ఇవి నిజాలు

భార్యాభర్తల మధ్య ఇరవై సంవత్సరాలు తేడా ఉంటే వారిద్దరూ విడిపోవడానికి 95 శాతం అవకాశం ఉన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది.

భార్యాభర్తల మధ్య పది సంవత్సరాల అంతరం ఉంటే వారు విడిపోవడానికి 40 శాతం అవకాశం ఉన్న విషయం వెల్లడైంది.

భార్యాభర్తల మధ్య ఐదు సంవత్సరాల అంతరం ఉంటే వారు విడిపోయే రిస్కు 15 శాతం కూడా ఉండదు. అంతేకాకుండా వీరి మధ్య అభిప్రాయ భేదాలుకూడా తక్కువగా వస్తాయి.

### వయస్సు సమస్య

భార్యాభర్తల మధ్య వయస్సు అంతరం ఎక్కువగా ఉంటే అది ఆర్థికంగా, మానసికంగా చాలా సమస్యలకు కారణం అవుతుందని నిపుణులు చెబుతున్నారు. భార్య వయస్సు కన్నా భర్త వయస్సు 20సంవత్సరాలు ఎక్కువగా ఉంటే మానసిక సమస్యలు ఎక్కువ అవుతాయి అని చెబుతున్నారు. భర్త కన్నా భార్య చిన్నగా కనిపించడం, కుటుంబ ఖర్చులు, అవసరాలకు అనుగుణంగా డబ్బు సంపాదించలేకపోవడం, పిల్లలు చిన్నతనంలోనే రిటైర్ కావడం ఇవన్నీ భర్త మానసిక పరిస్థితి మీద తీవ్ర ప్రభావాన్ని చూపుతాయని వారు అంటున్నారు. ఈ కారణాల వలన కుటుంబంలో కలహాలు మొదలై, కొన్నిసార్లు కుటుంబ విచ్ఛిన్నానికి కూడా దారితీసే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. భార్యాభర్తల మధ్య ఉండాల్సిన వయస్సు అంతరం గురించి చాలా మంది పట్టించుకోరనీ, కానీ దీన్నే ముఖ్యంగా పరిగణనలోకి తీసుకోవాలని వారు సూచిస్తున్నారు.

-దేవి

### బాలీవుడ్ జంటలు

దక్షిణాది సినీ పరిశ్రమలో కన్నా బాలీవుడ్‌లో జంటల మధ్య వయస్సు అంతరం ఎక్కువగా కనిపిస్తుంది. అలా ఎక్కువ ఏజ్ గ్యాప్ ఉన్న జంటలు...

బాలీవుడ్ డ్రీం గర్ల్ హేమమాలిని, భర్త ధర్మేంద్ర కన్నా 13 సంవత్సరాలు చిన్నది. ధర్మేంద్రలో వృద్ధుడి ఛాయలు స్పష్టంగా కనిపిస్తే హేమమాలినిలో మాత్రం ఆ ఛాయలు తక్కువే!

బాలీవుడ్‌లో ట్రాజెడీ కింగ్ ఎవరంటే టక్కున దిలీప్ కుమార్ పేరే చెప్పేస్తారు. ఆ ట్రాజెడీ కింగ్ తన 45వ ఏట తనకన్నా 23 సంవత్సరాల చిన్నదైన సైరాబానును పెళ్ళి చేసుకున్నాడు.

బాలీవుడ్‌లో ఒకప్పటి సూపర్‌స్టార్ అయిన రాజేష్‌ఖన్నా డింపుల్ కపాడియా ప్రేమించి పెళ్ళిచేసుకున్నారన్న సంగతి తెలిసిందే! వీరిద్దరి మధ్యా వయస్సు అంతరం చాలా ఎక్కువే అంటారు.

దక్షిణాది డ్రీమ్‌గర్ల్ శ్రీదేవి తనకన్నా తొమ్మిది సంవత్సరాలు పెద్దవాడైన బోనీకపూర్‌ని పెళ్ళిచేసుకుంది. వీరిద్దరికీ ఇద్దరు కూతుళ్ళు.

దశాబ్దం పైగా సహజీవనం చేసిన తరువాత కరీనా, సైఫ్ ఒకింటి వారయ్యారు. వీరిద్దరి మధ్యా వయస్సు అంతరం కొద్దిగా ఎక్కువే అంటారు.

టాలీవుడ్ హాసిని జెనీలియా తనకన్నా తొమ్మిది సంవత్సరాలు పెద్దవాడైన బాలీవుడ్ హీరో ను ప్రేమించి పెళ్ళిచేసుకుంది.

# పెళ్ళి

-వారణాసి ప్రసాదరావు

**హౌ డేర్ హిమ్ ఏవనుకుంటున్నాడు. రానీ.. నేనేంటో చెప్తా.**

**"ఏఁవయిందే...."**

**స్టుపిడ్..**

**ఎవరు.. నేనా....?**

**నువ్వు కాదు, వాడే! కొద్దిగా చనువుగా మాట్లాడితే చాలు, కలర్‌డ్రీమ్స్ కనెయ్యడమేనా.. రానీ చెప్తా!**

"సస్పెన్స్‌తో చంపక, వాడెవడో.. ఏవయిందో చెప్పి, అప్పుడు తిట్టు" అంది వనజ భోజనానికి సిద్ధమవుతూ.

ఇంకెవడు వాడే... సునీత కజిన్!

ఓ.. ఆ ఐబీఎమ్ రామా...!

యా...

ఏం చేశాడేంటీ? మంచివాడే కదా ఆ అబ్బాయ్...

ఏం మంచోడూ.. మంచోడయితే ఇలాంటి మెసేజ్‌లు పెడతాడా..?

ఐ లవ్యూ... పెట్టాడా....?

షటప్!

'మరేమని పెట్టాడో చెప్పు తల్లీ...' తినడం మధ్యలో ఆపి అంది.

"మీట్ మీ ఆన్ కమింగ్ సండే. వెయిటింగ్ ఫర్ యూ.." సెల్ మెసేజ్ చదివి వినిపించింది సంగీత! అక్కడే ఉన్న సంగీత ఫ్రెండ్స్ దేవపుత్రి, రాధికలు ఆశ్చర్యపోయారు. సంగీత స్నేహబృందంలోని ఐదో అమ్మాయి పేరు సునీత! క్యాంటీన్‌లోకి అప్పుడే అడుగు పెట్టింది... ఆమె వెనుకనే రామ్! అతన్ని చూస్తూనే తాడెత్తున లేవబోయిన సంగీత 'ఫ్రీజ్' అయినట్టుగా ఆగిపోయింది!

సారీ సంగీతగారూ... వెరీసారీ! మా సిస్టర్ సునీతకు ఇవ్వబోయిన మెసేజ్ మీకు పాస్ చేసేశాను, ఓవర్‌లుక్ వలన. ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ! ఏమనుకోకండి.." క్షమాపణ కోరాడు. విషయం అంతకు ముందే తెలిసి ఉన్న సునీత కూడా సారీ చెప్పింది.

అన్నయ్య రెండుసార్లు ఫోన్‌చేసి చెప్పాడు. వేరే ప్రోగ్రాం ఉండి ఓసారి, ప్రాజెక్ట్ వర్క్ పెండింగ్ ఉండి మరోసారి వెళ్లలేకపోయాను. ఈసారి చెప్పడమే కాదు మెసేజ్ కూడా పెట్టాడు, నాకు జ్ఞాపకం ఉండాలని! మన ఇద్దరి పేర్లు ఇంగ్లీషులో చూస్తే ఐ మీన్ ఓవర్‌లుక్‌లో చూస్తే ఒక్కలానే కనిపిస్తాయి. నాకివ్వాలనుకున్న మెసేజ్ నీకు పాస్ అయిపోయిందా ఓవర్‌లుక్‌లో... సారీ సంగీతా! ఏమనుకోకేం..

హు... తన ఎమోషన్ అంతా ఒక్కసారిగా గాలి తీసేసిన బెలూన్‌లా అయిపోవడంతో నిట్టూర్చింది సంగీత!

"ఏం తల్లీ... శాంతించినట్టేనా! రా... యిక... మీల్సు చల్లారిపోతోంది" వనజ భోజనం ముగించి అంది.

'ఏం ఫర్వాలేదు. 'మేడమ్ గారు వేడిగానే ఉన్నారుగా' దేవపుత్రి నవ్వకుండా అంది.

సంగీత స్నేహ బృందం గురించి తెల్సినవారు 'ఫ్రెండ్స్ ఫైర్' అని పేరు పెట్టేశారు. వాళ్లని 'పంచ భూతాలు' అని వర్ణించినవారూ ఉన్నారు. అందులో సంగీత 'ఫైర్'గా ముద్రపడిపోయింది. సునీతను మాత్రం 'భూదేవి'గా ఫిక్స్ చేసేశారు!

•••

కూకట్‌పల్లిలో ఓ అపార్ట్‌మెంట్‌కు చేరుకుంది సునీత.

బి. కస్తూరి రామారావు, బి.టెక్. ఫ్లాట్‌లో డోర్ పక్కన నేమ్‌బోర్డు ఉంది. దాని పక్కనున్న కాలింగ్‌బెల్ ప్రెస్ చేయడంతో డోర్ తెరిచాడు రామ్. చెల్లెల్ని ఆప్యాయంగా ఆహ్వానించాడు.

సారీ అన్నయ్యా! ఆ సంగీ ఏదేదో అందంట... టేకిట్ ఈజీ... నొచ్చుకోలుగా అంది. తప్పు నాదేలే సునీ.. ఇక నుండి చాలా జాగ్రత్తగా ఉంటా. అమ్మో చాలా సెన్సిటివ్, ఆ అమ్మాయి..

అవునన్నట్టుగా తలూపింది సునీత. 'ఆమె ఓ అన్‌సాల్వ్‌డ్ పజిల్‌లా అన్పిస్తుంది' అంది కాసేపయ్యాక.

"సరేలే... ముందు టిఫిన్ తిందాం.." అంటూ రెండు ప్లేట్లలో సేమ్యా ఇడ్లీలు తెచ్చిపెట్టాడు. టిఫిన్ తింటూ, ఇద్దరూ ఒక ముఖ్యవిషయం గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు. సునీత ఎంతో కన్విన్స్ అయినట్లుగా నవ్వుముఖం పెట్టింది. హాయిగా నిట్టూర్చాడు రామ్. తర్వాత విషయం మళ్ళీ సంగీత వైపు మళ్లింది.

సునీ... కేవలం నీకు తోడుగా ఉండటం కోసమే కదా బెంగళూరు నుండి ఇక్కడికొచ్చి ఐబీఎమ్‌లో చేరింది... నేనెలాంటివాడినో మీ ఫ్రెండ్స్‌ఫైవ్‌కి వివరించి చెప్పు. వాళ్లకు నా మీద ఏదన్నా నెగెటివ్ ఒపీనియనుంటే డిలీట్ చేసుకుంటారు.

అన్నయ్యా... మాలో ఎవరికీ ఏ నెగెటివ్ ఒపీనియనూ లేదు. నిజం చెప్పాలంటే సంగీతక్కూడా! కాకపోతే ఆమె ఎంచేతనో అందర్నీ ఆటపట్టిస్తూ ఉంటుంది. మగాళ్లనయితే మరీనూ! అందులోనూ నీలాంటి సాఫ్ట్ బీయింగ్సయితే ఇంకానూ! వాళ్లనలా టీజ్ చేయడంలో ఓ రకమయిన శాటిస్‌ఫాక్షన్ పొందుతూ ఉంటుంది.

మరి వాళ్ల పేరెంట్స్‌తో ఎలా ఉంటుందో??!

వాళ్ల గురించి ఓసారి అడిగాం. చెప్పలేదు. రెండోసారి అడగబోతే తప్పించుకుంది. మౌనం వహించాడు



రామ్.

●●●

సీతారామపురం...

జాతీయ రహదారికి సమీపంలో ఉన్న గ్రామం... ఆ గ్రామంలో పుట్టిన పిల్లలకు - ఆడపిల్లలయితే సీత లేదా జానకి, మగపిల్లలయితే రఘు లేదా రామ అన్నపదం అసలు పేరుకు బంధంగానో, అనుబంధంగానో పెట్టుకుంటారు. ఆ ఊళ్లో పురాతనమైన రామాలయం ఉంది. ఆ ఊరికి వెంకట రాఘవయ్య పెద్దదిక్కు! ఆ ఊరిని ఆదర్శ గ్రామంగా తీర్చిదిద్దిన ఘనత ఆయనదే! ఆయన చేసేది వ్యవసాయం కాదు 'జనసాయం' అని అందరూ చెప్పుకుంటారు. ఆయనకొక్కడే కొడుకు.



ఒక్కడే తమ్ముడు! అన్నదమ్ములిద్దరికీ ఒక నెల తేడాలో పెళ్ళిళ్ళయ్యాయి! ఇద్దర్నీ రామలక్ష్మణులని చెప్పుకునేవారు ఊరి జనం!

తమ్ముడికి వరుసగా ముగ్గురూ కుమార్తెలే! పెద్దమ్మాయి డాక్టరు. రెండో అమ్మాయి కాలేజీ లెక్చరరు. మూడో అమ్మాయి సాఫ్ట్‌వేర్ ఇంజనీర్! పాపం కూతుళ్ల యోగ్యత.. ప్రయోజకతలను చూసే భాగ్యానికి నోచుకోని లక్ష్మణస్వామి, ఆఖరమ్మాయి పుట్టిన ఆరేళ్లకే గతించాడు! ఆడపిల్లలు ముగ్గురికీ నాన్నలేని లోటు రానివ్వలేదు పెదనాన్న!

రాఘవయ్యకు పెళ్లయి పదేళ్లయినా సంతానం కలగలేదు. వైద్యపరీక్షలకూ.. తీర్థయాత్రలకూ చాలా ఖర్చయిపోయింది! నిరాశతో కుంగిపోకుండా ఆ ఊరి యువతనే తన బిడ్డలనుకున్నాడు. వారి బాగునే తన ధ్యేయంగా మలచుకున్నాడు.

ఆ సంవత్సరం కూడా ఎప్పటిలా సీతారాముల కల్యాణం వేడుకగా జరిపించాలనుకున్నాడు రాఘవయ్య! కడియం వెళ్లి మరువం, దవనం, కస్తూరితో పాటు రకరకాల పూలమొక్కలను భారీగా తెప్పించి ఆలయంలో నాటించాడు. ఆ సుగంధ పత్రాలు, పుష్పాలతో ఆలయాన్నీ, పెళ్ళిపందిరినీ అలంకరించాడు. రెండురోజుల పాటు ఆ దివ్య పరిమళం అక్కడి పరిసరాలనే కాదు, భక్తుల హృదయాలను ఆవహించేసింది! ఆ కల్యాణం జరిగిన ఏడాది లోపున "కస్తూరి రామారావు" కడుపున పడ్డాడు. ఆ మరుసటి ఏడాది "సీతాసునీత" పుట్టింది! ఆ ఊరి యువతీయువకులు "ఏ దేశమేగినా.. ఎందుకాలిడినా.." జన్మనిచ్చిన ఊరినీ, భవితనిచ్చిన రాఘవయ్యనూ మర్చిపోరు! అంతకన్నా ముఖ్యంగా ఆ ఊరి రామాలయంలో వివాహం చేసుకోవడం మర్చిపోరు! అక్కడ పెళ్ళి చేసుకున్న జంట ఆదర్శ దాంపత్యం సాగిస్తారు. సత్సంతానవంతులవుతారు" ఇది నూరుశాతం నిజం - అని తెలిసినవాళ్లు చెప్తుంటారు.

సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ సీతాసునీతకూ, పిల్లల డాక్టర్ రమేశ్‌కూ వివాహం నిశ్చయమైంది. ఆ సంబంధం తెచ్చింది పెద్దక్క రమ (జానకీరమ). ఆమె విజయవాడలో ప్రాక్టీస్ చేస్తోంది. ఆమె భర్తా డాక్టరే! ఆ ఇద్దరూ మరికొందరు డాక్టర్లూ కలసి పన్నెండు వైద్యవిభాగాల్లో సేవలందించే ఆస్పత్రిని స్థాపించారు. ఆ డాక్టర్ల బృందంలో ఒకడుగా చేరిన రమేశ్ తన చెల్లెలికి తగినవాడని ఎంచి, సంబంధం కుదిర్చింది రమ.

'బి.టెక్‌తోపాటు ఎంబీఏ కూడా చేశావు. సాఫ్ట్‌వేర్ ఉద్యోగం వదిలెయ్. మన ఆస్పత్రి బృందంలో చేరు. అనుభవం సంపాదించు. రెండేళ్ల లోపునే అడ్మినిస్ట్రేటివ్ చీఫ్ అయిపోతావ్! అందరం ఒక్కచోటే ఉండే అవకాశం ఉంటుంది' అని అక్కయ్యలు, అన్నయ్య విశ్లేషించి చెప్పడంతో సమ్మతించింది సునీత.

తన పెళ్ళికి తన హాస్టల్‌మేట్స్‌లో కొందరినీ, సహోద్యోగుల్లో కొందరినీ ఆహ్వానించింది. వాళ్లందర్నీ ఒప్పించి తీసుకువచ్చే బాధ్యత 'ఫ్రెండ్స్ ఫైవ్'కు అప్పజెప్పింది.

పెళ్ళి శనివారం రాత్రి ఎనిమిదింటికి!

శనివారం ఎలాగూ సెలవు... మర్నాడుకూడా సెలవే కదా అని మూడు సుమోల్లో పదిహేను మంది బయలుదేరారు.

మధ్యాహ్నం కావస్తుండగా సునీత స్నేహ బృందం సీతారామపురం చేరుకుంది. అందర్నీ ఆప్యాయంగా రిసీవ్ చేసుకున్నాడు పెళ్ళి 'పెద్దాయన' రాఘవయ్య. కొడుకు అందర్నీ పరిచయం చేశాడు తండ్రికి.

భోజనాలు సిద్ధంగా ఉన్నాయ్...! అసలయిన తెలుగింటి వంటకాలు! వడ్డనకు ముందే కళ్ళకూ, ముక్కుకూ విందు చేసేస్తున్నాయ్! ఈ రోజుల్లో అతిసాధారణంగా పెడుతున్న 'బఫే' లేదక్కడ!

'అందరూ సీతారాముల గర్భాలయం ముందున్న విశాలమయిన మండపంలో కూర్చుని అరిటాకుల్లో భోజనాలు చేయాల్సిందే! భోజనాలకు ముందు సీతారాముల వారికి దండంపెట్టి ఆశీస్సులందుకోవలసిందే! ఇది మన సంప్రదాయం. మన వివాహ సంస్కృతిలో భాగం. కాదనకూడదు' నచ్చచెప్తోంది సంగీత ఫ్రెండ్ వనజ. సంగీ ససేమిరా అంటోంది.

ఈ జీన్స్ తీసేయవే తల్లీ.. పెళ్లికూతురు నీకు స్పెషల్‌గా ఇచ్చిందిగా, ఈ కలర్‌ఫుల్ చీర...! దీన్ని కట్టుకునిరా, అందరం కలిసి భోజనాలు చేద్దాం. భోజనాలయ్యాక నీ జీన్స్‌లో మళ్లీ దూరిపో.

సారీ..?

ఇదిగో..

నేనంటున్నది శారీ కాదు సారీ...!

రామ్ వాళ్ల నాన్నగారికి తెలిస్తే బాధపడతారు. అయినా ఏంటో ఈ సంగీ... పరిస్థితులను బట్టి తనను మలచుకోదు. పరిస్థితులే తనకు అనుకూలంగా మారాలి... అంటుంది!

'ఈ ఊరి ప్రవేశమార్గంలో రోడ్డుపక్కనే నెలకొని ఉన్న గ్రామదేవత జయదుర్గాంబను దర్శించుకోకుండా ఎవరూ ఊరిలోనికి ప్రవేశించరు.. ఊరివాళ్లు బయటకుపోరు! మీరు ఊళ్లోకి ప్రవేశించే ముందు మీ వాహనాలాపి, అమ్మవారిని దర్శించుకుని రండి' ముందుగానే చెప్పి ఉన్నాడు రామ్. సునీత ఫ్రెండ్సందరూ చెప్పినట్టే చేశారు, సంగీ తప్ప.

నీవు రాలేదేం? అని అడిగితే ఆమె 'నాన్సెన్స్' అనడంతో వాళ్లు 'అవాక్కు' అయిపోయారు! తన ఫ్రెండ్స్ చెప్పింది విన్న రామ్ మనసులోనే బాధపడ్డాడు.

ఇప్పుడూ అదే ధోరణి..!

ఆలయ ప్రాంగణంలోనే ఒకచోట వృద్ధులకూ, గర్భిణీ స్త్రీలకూ, స్థూలకాయులకూ కేటాయించిన 'కుర్చీ-బల్ల' విభాగంలో ఫ్రెండ్సందరికీ భోజనాలు ఏర్పాటుచేశాడు? ఆ ఫ్రెండ్స్ 'నో' అన్నారు. రాముల వారెదురుగా అరిటాకుల్లోనే భోజనం చేస్తామని కోరస్‌గా చెప్పడంతో కళ్లు, ముక్కు ఎగరేసి 'సంగీ' ఒక్కతే వెళ్లింది! హమ్మయ్య అనుకున్నాడు రాము.

సంగీ, ఆ ఊళ్లో అడుగు పెడుతూనే ఆశ్చర్యపోయింది! డర్టీ విలేజెస్.. డర్టీపీపుల్... అనుకునేది విలేజెస్ ప్రసక్తి వచ్చినప్పుడల్లా! కానీ, అలా ఏమీ లేదీ ఊళ్లో! పరిశుభ్రమైన వాతావరణం... మనుషులు.. వాళ్ల మర్యాదలు... పలకరింపులు వగైరా. 'ఎవరో ప్రత్యేకంగా తీర్చిదిద్దినట్టుంది' తనలో తానే అనుకుంది.

నుదుట కల్యాణ తిలకం.... కళ్లకు కాటుక... పింకీ టెంపిల్స్... పాపిటబిళ్ళ... జడ దండలు.. దండవంకీలు.. బంగారు గాజులు, పెళ్లికూతురు గాజులు.. కంఠహారాలు... వడ్డాణం... అరచేతులా... ఎర్రని అరవిందాలా అన్నట్టుగా దిద్దిన గోరింట విన్యాసాలు.. గోళ్లకు రంగులు.. కాళ్లకు పారాణి.. పట్టుచీర పట్టు రవికల ధగధగలు...! సునీతను నఖశిఖ పర్యంతం చూసిన దేవపుత్రి వావ్.... అని ఎగిరి గంతేసి సునీతను హత్తుకుంది!

అదిరింది సునీ... నీ బ్రైడల్‌మేకప్! రాధిక కాంప్లిమెంట్ ఇచ్చేసింది. "ఛ... నన్ననవసరంగా ఆడదానిగా పుట్టించాడా దేవుడు... లేకుంటే నీ మొగుడయ్యే అదృష్టం కలిగేది...! వనజ నవ్వుతూ వాటేసుకుంది. అసలీమెలో ఇంతందం దాగి ఉందా? ఈమె

ఓ ఎమ్మెన్సీ సాఫ్ట్‌వేర్ ఇంజనీరా లేక మగధ సామ్రాజ్యం మహారాణీయా?! ఆశ్చర్యపోయింది సంగీత!

అంతకన్నా ఆశ్చర్యపోయింది... ఆ జంటను పరిచయం చేయగానే! నిండుగా పట్టుచీర.. స్వర్ణాభరణాలు... మెడకు చందనం.. ముఖాన పసుపు.. నుదుటబొట్టూ... చిరునవ్వే తన చిరునామా అని చెప్తున్నట్టున్న ఆమె... లాప్రోస్కోపిక్ సర్జన్ స్పెషలిస్ట్ అనీ, అలాగే పట్టు పంచ.. అంగీలో భుజాన ఉత్తరీయంతో మెరిసిపోతున్న అతను కార్డియాక్ సర్జన్ అనీ, ఇద్దరూ లండన్‌లోని కింగ్స్ హాస్పిటల్‌లో ప్రత్యేక శిక్షణ పొంది వచ్చినవారనీ తెల్సి....! వాళ్లిద్దరూ సునీత అక్కాబావలని తెల్సి....!! పరిచయమయ్యాక... వాళ్లు వేసిన తొలి ప్రశ్న - 'బాగున్నారా అమ్మా....'

'యా...' సంగీత జవాబు!

మధ్యాహ్నం మూడు గంటలకు సుమోల్లో ఆ ఊరికి దగ్గరలోనే గల 'డ్యామ్' చూడటానికి బయలుదేరింది సునీత స్నేహబృందం! వాళ్లకు తోడుగా తన ఊరిలోని ఇద్దరు కుర్రాళ్లనిచ్చి పంపించాడు రామ్.

ఏం.. నువ్వు రావా...?ప్రశ్నించింది సంగీ.

నేనిక్కడ ఏర్పాట్లవీ చూడాలి సంగీతగారూ.

ఏంటవీ...?

పెళ్ళి కదా... చాలా ఉంటాయి.

అవే... ఏంటీ అని...

ఆ 'అడగడం'లో సంగీత ఆంతర్యం అర్థమయిన వాడిలా ఓ క్షణం మౌనం వహించాడు రామ్.

"వన్‌థింగ్... ఇప్పుడు నీవిక్కడ లేకపోతే, ఏవన్నా అయిపోతుందా! కమాన్ గై లెటజ్ ఎంజాయ్ దేర్..." అంది.

ఆ 'గై'కు తెల్సు....! తను చాలా వినయంగా మాట్లాడతాడు. కానీ ఆమె తన 'వినయాన్ని' కాదు తనలో ఒక బకరాని ఊహించుకుంటోంది. దాన్ని ఆట పట్టిస్తోంది. ఆనందిస్తోంది. అందుకే రమ్మంటోంది. రామ్ అనుకున్నట్లుగానే సుమోలోని సాఫ్ట్‌వేర్లందరూ అనుకున్నారు.

సారీ సంగీతగారూ... ఇంపార్టెంట్..

ఏంటా ఇంపార్టెంట్.. మేం ఇంపార్టెంట్ కాదా..?

'ష్... డోంట్ ఆర్గ్యూ! పెళ్ళంటే ఎన్ని పనులుంటాయి... అయినా నీకేం తెల్సులే...' కోప్పడింది ఓ సాఫ్ట్‌వేర్.

టేకిట్ ఈజీ రాధికగారూ... అక్కావాళ్ల హాస్పిటల్ డాక్టర్స్, స్టాఫ్... చిన్నక్క కొలీగ్స్.. సిటీలోని ఫ్రెండ్స్... అందరూ సాయంత్రానికే వచ్చేస్తారు. అందర్నీ రిసీవ్ చేసుకోవాలి. ఫార్మాలిటీస్ చూడాలి.

రామ్‌గారూ... మాకు తెల్సు. మీకు చాలాచాలా పన్లుంటాయి. మేం కూడా వాటిలో ఇన్‌వాల్వ్ అవుతామంటే వద్దంటున్నారు. అందుకే బోర్ కొట్టకుండా ఓ రెండుగంటలు అలా టైం పాస్ చేసొస్తాం. మీరు వెళ్ళండి. ఇదిగో డ్రైవర్... బండి పోనీయ్.." అని వెరీ 'సాఫ్ట్'వేరింజనీరొకాయన అనడంతో ఆ సుమో, దాని వెనుక మిగిలినవి పరుగు తీశాయ్!

•••

అందర్నీ ఆటపట్టించే సంగీతను ఫ్రెండ్స్, కొలీగ్స్ అందరూ ఆట పట్టించాలని అనుకున్నారు. కానీ చాలా విషయాల్లో మూడీగానూ, సెన్సిటివ్‌గానూ ఉండే సంగీతను ఏమీ అనవద్దనీ, ఆమె "ఇగో"ను ఏక్సెప్ట్ చేస్తూ ఉండమనీ ముందే వాళ్లందర్నీ ప్రాధేయపడి ఉన్నాడు రామ్.

వాళ్లంతా 'రామ్' మాట మర్చిపోలేకపోయారు!

సాయంత్రం ఆరు దాటాక తిరిగి వచ్చారు ఫ్రెండ్సందరూ! అప్పటికే ఊరంతా విద్యుత్ దీపాలంకరణలతో ధగధగా మెరిసిపోతోంది! సంగీత నీరావలించింది!

'ఓ మైగాడ్! ఎన్నెన్ని బ్యూటిఫుల్ కార్స్... వెహికల్స్... వావ్..' కళ్లు విప్పారించి చూసింది. అవన్నీ హైస్కూల్ గ్రౌండ్‌లో పద్ధతిగా పార్క్ చేయబడుతూ ఉన్నాయ్!

ఒక పల్లెటూరమ్మాయి సునీతా వాళ్లకి ఇంత ఫాలోయింగ్ ఉందా....? గాడ్....

ఉక్కిరిబిక్కిరయిపోయింది! ఎప్పుడూ 'నంగి'లా కనిపించే 'రామ్'లో ఇంత మేనేజ్‌మెంట్ స్కిల్ దాగుందా....? వండర్! అనుకుంది.

వివాహ కార్యక్రమాలన్నిటినీ వీడియో తీస్తున్నారు.

పెళ్ళికుమారుడికీ. అతని బృందానికీ ఎదుర్కోలు ఆహ్వానం... పెళ్ళికుమార్తె ప్రదానం... తర్వాత ఇద్దరి అభ్యంగనం.. అలంకరణలు... గౌరీ పూజ.. సీతారాముల అర్చన... ఆశీర్వచనం... పెళ్ళి మండపంలో ఆశీనులు కావడం... పెళ్ళికొడుకు కాళ్ళు కడిగి సాలంకృత కన్యాదానం.. వేదమంత్రాలు... మంగళవాయిద్యాల నడుమ జీలకర్ర బెల్లం తాపడం... మాంగల్యధారణ... తలంబ్రాలు.. అగ్ని ప్రదక్షిణ... సప్తపది... వెండిపాల బిందెలో ఉంగరాలు చేజిక్కించుకోవడం.. పూబంతులాట... చిలిపి కలహాలు.. అరుంధతీ దర్శనం.. అప్పగింతలు వరుసగా అన్నీ చిత్రీకరించారు.




**అందరికీ ఆమె ఓ అన్‌సాల్వ్‌డ్ పజిల్! సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పనిచేస్తోంది. ఎప్పుడూ అందరినీ ఆటపట్టిస్తూ ఉంటుంది. సాఫ్ట్‌గా కనిపించే మగాళ్ళనైతే మరీనూ! వాళ్ళనలా టీజ్ చేయడంలోనే ఆనందాన్ని వెతుక్కుంటుంది. ఇంతలో అనుకోని దుర్ఘటన ఆమె జీవితాన్ని మలుపు తిప్పింది. ఎవరామె? ఏమా దుర్ఘటన? అందరినీ ఆమె ఎందుకలా టీజ్ చేస్తోంది?**

అన్నిటినీ ఆసక్తితో, వింతగా గమనిస్తోంది సంగీత.

పెళ్ళంటే ఇంత హెవీటాస్క్‌గా ఉంటుందా? ఇన్ని రకాల ఎపిసోడ్స్ రన్‌చేయాలా..? తనలో తనే ప్రశ్నించుకుంది.

వధూవరులను అందరూ ఆశీర్వదిస్తూ అక్షతలు వేస్తున్నారు. వధూవరులు పెద్దవారికి నమస్కరిస్తూ.. మరీ పెద్దవారికి వంగి పాదనమస్కారాలు చేస్తున్నారు. సమ వయస్కులతో కరచాలనం చేస్తున్నారు.

సంగీత నవ్వుతూ సునీతకు షేక్ హ్యాండిచ్చింది!

సునీత హ్యాండ్‌తోపాటు మనసూ షేక్ అయిపోయింది, సీతారాములను నిలిపి ఉంచిన ఆ కల్యాణవేదిక పైకి సంగీత చెప్పులతోనే రావడం గమనించి!

వివాహానంతర విందు మాత్రం హైస్కూల్‌కు మరోవైపున ఉన్న విశాలమైన మైదానంలో ఏర్పాటు చేశారు. షామియానాలు, చక్కని కుర్చీలు బల్లలు వేసి!

సమన్వయంతో కూడిన సత్వర వడ్డన సాగుతోంది.

సంగీ... నీకిక్కడ ఏం ప్రాబ్లం లేదు. మొహమాట పడకుండా శుభ్రంగా అన్నీ లాగించేయ్. మధ్యాహ్నం సరిగ్గా ఏమీ తినలేదని తెల్సిందిలే.. దేవపుత్రి కొంటెగా చూస్తూ అంది.

ఇదిగో... సంగీ.. అలా చూస్తూ ఉండిపోక. ఇక్కడున్న హేండ్సమ్ గైస్‌ని బకరాలనుకునేవ్, జాగ్రత్త.." జాగ్రత్తలు చెప్పింది వనజ.

వాళ్లను మాత్రం పడగొట్టాలని చూడకు. నీవే పడిపోతావ్! వార్నింగ్ ఇచ్చింది రాధిక. అందరికీ ఏ రిటార్ట్ ఇచ్చేదో మరి... రామ్‌రాకతో ఉసూరుమంది!

భోజనాల కార్యక్రమంలో రామ్ తన ఫ్రెండ్స్ వద్దనే ఉండి, ఏ లోటూ రాకుండా చూసుకున్నాడు.

"వాటే టేస్టీ ఐటెమ్స్... స్వీటీ హార్ట్స్..." అభినందించింది స్నేహబృందం.

మీ అందరికీ విజయవాడలోనే ఈ రాత్రి వసతి ఏర్పాట్లు చేశాం. సిటీ ఇక్కడికి ఇరవై కిలోమీటర్ల లోపునే ఉంది. అక్కడ రెస్ట్ తీసుకోండి. తెల్లవారి ఎనిమిదింటికి మన ఇంట్లోనే సత్యనారాయణ వ్రతం జరుగుతుంది. వ్రతమయ్యాక భోజనాలు చేసి, కాసేపు రెస్ట్ తీసుకుని రెండింటికి బయలుదేరితే రాత్రి తొమ్మిదిలోపు మన 'హైటెక్స్'కు చేరిపోవచ్చు.. కార్యక్రమం చెప్పడంతో అందరూ సమ్మతించారు.

'సారీ... నేను ప్రిపేర్డ్‌గా రాలేదు. ఐ మే నాట్

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## గాయిటర్ సమస్యకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



నేటితరంలో పెరుగుతున్న ఆధునికతతోపాటుగా మారుతున్న ఆహారపు అలవాట్లు, జీవన విధానం, వ్యాయామ లోపం మరియు అధిక మానసిక ఒత్తిడి వలన ఎంతోమంది దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు గురికావడం జరుగుతోంది. అలాంటి వారిలో థైరాయిడ్ సమస్యల బారిన పడుతున్న వారి సంఖ్య అధికం. అందునా 'గాయిటర్' వ్యాధికి గురి అయ్యే వారే ఎక్కువగా ఉంటారు. కేవలం మన దేశవ్యాప్త గణాంకాల మేరకు, ప్రతి ఏడాది – ఒక మిలియన్ మందికి పైగా ఈ 'గాయిటర్' బారిన పడుతున్నారంటే, ఈ సమస్య తీవ్రత ఎంత ఎక్కువగా ఉందో మనం ఊహించవచ్చు. ఇతర వైద్యవిధానాలలో ఈ వ్యాధికి పూర్తి చికిత్స అందుబాటులో లేదు. కానీ సరైన హోమియో చికిత్స అందించడం వలన, ఎలాంటి శస్త్రచికిత్స అవసరం లేకుండానే 'గాయిటర్' వ్యాధి పూర్తిగా నయం చేయబడే అవకాశం ఉంది.




మన శరీరంలోని గ్రంథులన్నిటిలో థైరాయిడ్ గ్రంథి పోషించే పాత్ర అత్యంత కీలకమైనది. ఇది మెడ ప్రాంతంలో – కంఠానికి దగ్గరగా, సీతాకోకచిలుక ఆకారంలో, శ్వాసనాళానికి ఇరువైపులా ఉంటుంది. ఇది పిట్యుటరీ గ్రంథి నియంత్రణలో ఉంటుంది. శరీరంలో తగినంత స్థాయిలో థైరాయిడ్ హార్మోన్‌లు లేనప్పుడు, పిట్యుటరీ గ్రంథి ఆ అవసరాన్ని గ్రహించి TSH (థైరాయిడ్ స్టిమ్యులేటింగ్ హార్మోన్) ను విడుదల చేస్తుంది. ఈ TSH సంకేతాన్ని అందుకున్న థైరాయిడ్ గ్రంథి ఉత్తేజితమైT3, T4 అనే థైరాయిడ్ హార్మోన్‌లను విడుదల చేస్తుంది. ఈ T3,T4 హార్మోన్‌లు రక్తప్రవాహంలో సమ్మిళితమై, ప్రధాన జీవక్రియలైన మానసిక పరిపక్వత, శారీరక ఎదుగుదల, నాడీమండలం పనితీరు, జీర్ణక్రియ మరియు సంతానోత్పత్తి వ్యవస్థ మొ॥ అన్ని విధాలైన జీవక్రియల సమతుల్యతకు తోడ్పాటును అందించటం జరుగుతుంది.

**గాయిటర్ అవగా:** థైరాయిడ్ గ్రంథి అసాధారణంగా పెరగడాన్ని గాయిటర్ అంటారు. ఇది 2 రకాలు. **1. డిఫ్యూస్ గాయిటర్:** థైరాయిడ్ గ్రంథి సాధారణ పరిమాణాన్ని మించి, పూర్తి పరిమాణం (అసాధారణ వాపు కారణంగా) మేరకు సమానంగా పెరగడాన్ని డిఫ్యూస్ గాయిటర్ అని అంటారు. **2. నాడ్యులార్ గాయిటర్:** థైరాయిడ్ గ్రంథిలోని ఒక భాగంలో ఒక్కటిగా గానీ లేదా అధిక సంఖ్యలో గడ్డలు ఏర్పడటాన్ని నాడ్యులార్ గాయిటర్ అని అంటారు.

**గాయిటర్ మరియు థైరాయిడ్ హార్మోన్‌లు:** 'గాయిటర్' సమస్య తలెత్తిన కారణంగా – కొంతమందిలో థైరాయిడ్ హార్మోన్‌ల ఉత్పత్తి పరంగా ఎలాంటి మార్పులూ కనిపించవు. కానీ కొందరిలో మాత్రం – ఆయా సందర్భాన్ని బట్టి, ఈ హార్మోన్‌ల ఉత్పాదన ఎక్కువ లేదా తక్కువ మోతాదులో జరగడం కారణంగా హైపర్‌థైరాయిడ్ లేదా హైపోథైరాయిడిజమ్ సమస్యలు ఏర్పడటం జరుగుతుంది.

**కారణాలు:** శరీరంలో అయోడిన్ లోపం 'గాయిటర్' తలెత్తటానికి ముఖ్య కారణం • హైపోథైరాయిడిజం లేదా హైపర్‌థైరాయిడిజం కారణంగా థైరాయిడ్ గ్రంథి ఎక్కువగా ఉత్తేజపడటం • అధిక ధూమపానం • థైరాయిడ్ గ్రంథి శోథమునకు గురి కావడం • రేడియేషన్ (క్యాన్సర్ నివారణ పద్ధతి) వలన మరియు థైరాయిడ్ క్యాన్సర్ కలిగి ఉండటం వంటి అంశాలన్నింటి వలన 'గాయిటర్' ఏర్పడవచ్చు.

**లక్షణాలు:** గొంతు భాగంలో వాపు • ఈ వాపు ఎక్కువగా ఉండటంతో శ్వాస లేదా ఆహారనాళాల పైన ఒత్తిడి ఏర్పడటం వలన శ్వాస తీసుకోవడంలో మరియు ఆహారం మ్రింగటంలో ఇబ్బందులు ఏర్పడటం • హైపర్‌థైరాయిడిజం (బరువు తగ్గడం, గుండెదడ, విరేచనాలు, కండరాల బలహీనత మొదలైనవి) మరియు హైపోథైరాయిడిజం (బరువు పెరగడం, నీరసం, డిప్రెషన్, మలబద్ధకం మొదలైనవి) లక్షణాలు కనిపిస్తాయి.
• కొంతమందిలో మాత్రం ఎక్సాప్‌తాల్మిక్ గాయిటర్, మిక్సెడిమా వంటి లక్షణాలను కూడా గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** 'గొంతు'ను పరీక్షించడం, థైరాయిడ్ ప్రొఫైల్ (T3, T4, TSH), యాంటీ థైరాయిడ్ యాంటీబాడీస్, అల్ట్రాసౌండ్ థైరాయిడ్, థైరాయిడ్ గ్రంథిని సి.టి. స్కాన్ చేయించడం వంటి పరీక్షల ద్వారా 'గాయిటర్' వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే లభించే జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్సా విధానం మేరకు, రోగి యొక్క మానసిక మరియు శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకుని, రోగి తత్వాన్ని బట్టి సరైన చికిత్సను అందించడం ద్వారా హైపోథలామస్–పిట్యూటరీ–థైరాయిడ్ వ్యవస్థను పూర్తి స్థాయిలో సరి చేయడం జరుగుతుంది. తద్వారా గాయిటర్ వ్యాధిని పూర్తిగా నయం చేయటమే కాకుండా ఎటువంటి దుష్ఫలితాలు లేకుండా వ్యాధిని (థైరాయిడ్ గ్రంథి వాపును) పూర్తిగా నివారించవచ్చు

టోల్ ఫ్రీ 1800 108 1212 | కన్సల్టేషన్ ఉచితం 955 000 1199 | www.homeocare.in

బీ కంఫర్టబుల్! ఈ రాత్రికే వెళ్లిపోతా..' సంగీత చెప్పేసింది. మిగిలిన వారందరూ ఆమెతో 'ఎస్' చెప్పించేందుకు విఫలయత్నం చేశారు! కానీ సంగీత 'స్వరం' మార్చలేదు!

ఫ్రెండ్స్ అందర్నీ విజయవాడ తీసుకువెళ్ళి హోటల్ 'కాంధారి'లో బస ఏర్పాటుచేయించాడు రామ్. అబ్బాయిలకు రెండు గదులు, అమ్మాయిలకు రెండు గదులు కేటాయించారు.

సంగీత కోసం ఓ ప్రైవేట్ ట్రావెల్స్‌కు చెందిన వోల్వోలో టికెట్ బుక్‌చేశాడు రామ్. 'విశాఖ నుండి ఆ బస్సు విజయవాడకు పన్నెండున్నరకు వస్తుంది. ఇంకా రెండుగంటల సమయముంది' చెప్పాడు రామ్.

రామ్... ఇప్పటికే చాలా శ్రమపడి ఉన్నావ్. ఇక నువ్వెళ్ళి రెస్ట్ తీస్కో. సంగీని మేం బెంజిసర్కిల్ దగ్గర బస్సెక్కించేస్తాం... అన్నాడు రామ్ ఫ్రెండ్.

పర్వాలేదు. రెండు గంటలే కదా, ఉంటా.. అన్నాడు రామ్. ఫ్రెండ్స్ ఎంతగా కన్విన్స్ చేసినా మృదువుగా వారించాడు. తమపట్ల అతని 'కన్సర్న్'కి కరిగిపోయారు ఫ్రెండ్సందరూ!! తొలిసారిగా 'సంగీ' మనసు కరగసాగింది! అయినా దాన్ని మరింత కరగనివ్వకుండా కంట్రోల్ చేసుకుంది!

సునీత... రమేశ్‌ల వివాహ ఘట్టాలన్నిటినీ 'పెన్‌డ్రైవ్'లో ఫీడ్‌చేసిన ఫ్రెండ్స్ మళ్ళీ దాన్ని చూసేందుకు అందరూ ఒక గదిలో చేరారు. ఆ గదిలోని టీవీలో రీప్లే చేసి చూస్తూ ఆనందించసాగారు. సంగీత తను తెచ్చుకున్న ఇంగ్లీష్ హారర్ నవలపై దృష్టి పెట్టింది. ఉండుండి టీవీ చూస్తోంది!

బస్ మరో అరగంటలోగా వస్తున్నట్టు కాల్ రిసీవ్ చేసుకున్న రామ్, సంగీతను బస్ స్టే ప్లేస్‌కు తీసుకు వెళ్లాడు. బస్సెక్కించాడు! జాగ్రత్తలు చెప్పారు ఫ్రెండ్స్!

•••

హైదరాబాద్...

ఓ కార్పొరేట్ ఆస్పత్రిలో...

సంగీతను చూస్తున్న ఫ్రెండ్స్ 'గుండె'లన్నీ నీరయి పోయాయి. ఆ నీరంతా కళ్ల నుండి ఉబికి వస్తూ ఉంది! అది ఆగడం లేదు.

సంగీత మాత్రం వాళ్లనెవర్నీ చూడటం లేదు. చూసే జ్ఞానం ఆమెకు ఆ సమయంలో లేదు! చూస్తున్న వాళ్లకూ... సంగీతకూ మధ్య ఐసీయూ గది అద్దాల అడ్డుతెరలు..!

"ఇంటెన్సివ్ బర్న్స్.. సెవెంటీ పర్సెంట్... నో హోప్..." డాక్టర్లు కన్‌ఫర్మ్ చేసేశారు. కానీ మా ప్రయత్నం మేం చేస్తాం... అన్నారు.

రామ్ ఎంతగానో తల్లడిల్లిపోయాడు. అంతకు మించి సునీత... రమేశ్‌లు!

మరో గంటన్నరలో గమ్యం చేరనుండగా రోడ్ డివైడర్‌ను ఢీకొట్టింది వోల్వో...! పగిలిన డీజిల్ ట్యాంక్‌లోని డీజిల్ అంటుకుంది! తెల్లవారకముందే ఇరవైమంది జీవితాలు శాశ్వతంగా చీకట్లో కలిసిపోయాయి!

రెండు రోజుల తర్వాత స్పృహ వచ్చింది సంగీతకు! రామ్‌కు కబురు పంపించారు ఆస్పత్రి సిబ్బంది. కబురందిన గంటలోపునే ఆస్పత్రికి చేరుకున్నాడు రామ్..! అతనికి స్టెరిలైజ్‌డ్ ఏప్రాన్స్... మాస్క్... గ్లవుస్ ఇచ్చారు. వేసుకుని ఐసీయూలోనికి వెళ్లాడు! ఎంతగా కంట్రోల్ చేసుకుందామనుకున్నా సాధ్యం కావడం లేదు. మనసు బయటనే రోదిస్తోంది.

## అన్నిటికీ రెడీ!



పెద్ద బ్యాక్‌గ్రౌండ్, పేరున్న నటులతో సినిమాలు...ఇవేవీ సాయేషా సైగల్‌కు అదృష్టాన్ని తీసుకురాలేకపోయాయి. తెలుగులో అఖిల్‌తో చేసిన సినిమా దారుణంగా ఫ్లాపైతే, బాలీవుడ్‌లో అజయ్‌దేవగన్‌తో చేసిన సినిమా కూడా అదే ఫలితాన్ని ఇచ్చింది. దాంతో సినిమాల్లో లిప్‌లాక్‌లకూ, బికినీలకూ దేన్నికైనా రెడీ అని చెబుతోంది. ఈ విషయాన్ని దక్షిణాది నిర్మాతల చెవిన కూడా వేసింది. సాయేషా ప్రస్తుతం కోలీవుడ్‌లో ఓ సినిమాలో నటిస్తోంది. సాయేషా మాటల్లో నిజం ఎంతో ఈ సినిమా చూస్తే తెలిసిపోతుంది కదా...ఆ తరువాత అవకాశాలు ఇవ్వొచ్చు అన్న ఆలోచనలో కొందరు దర్శకనిర్మాతలు ఉన్నారట!

డోంట్ వీప్ మై రామ్.. ఐ యామ్ హ్యాపీ... "నవ్వడానికి ప్రయత్నిస్తూ అంది సంగీత. మీ పేరెంట్స్‌కు ఇన్‌ఫార్మ్ చేస్తాను. వాళ్ల అడ్రస్ చెప్పు సంగీతా.... ప్లీజ్....

పేరెంట్స్....

ప్లీజ్ సంగీతా...

సారీ రామ్... వాళ్లు లేరు.

అర్థం కాక మౌనం వహించాడు రామ్.

అర్థం చేసుకో అన్నట్టుగా చెప్పింది.

మమ్మీ అంటే అమ్మ... మా అమ్మ తెలుగమ్మాయే నట. పెళ్ళి చేసుకోలేదు. దట్స్‌నాట్ కరెక్ట్.. పెళ్ళి కాలేదు. బొంబాయిలో పుట్టాను. ఐదేళ్లక్కడ ఉన్నాను. తర్వాత హైదరాబాద్ వచ్చేశాను. కాల్ గర్ల్‌గా ఉండిపోయింది నా కోసం... నా చదువుల కోసం ప్చ్... రెండేళ్ల కిందట ఛీ...ఛీ.. డైడాఫ్ ఎయిడ్స్! తనలో తను గొణుక్కుంటున్నట్టుగా ఉండి హఠాత్తుగా గొంతు పెంచేసింది!

అందుకే ఐ హేట్ మేల్‌క్రీచర్స్! బట్ బట్ "చెప్పబోతున్న ఆమెను సూటిగా చూడలేక తలదించుకున్నాడు రామ్.

ఐ లవ్ యూ!

తలెత్తి దిగ్గున చూశాడు.

ఎస్... ఐ లవ్ యూ రామ్!

ఈసారి నవ్వకుండా ఉండలేకపోయాడు!

నువ్వు నవ్వితే చాలా హేండ్సమ్‌గా కనిపిస్తావ్.

రామ్... నవ్వును ఉగ్గబట్టుకున్నాడు. రామ్‌ను గమనిస్తూ రెండు నిమిషాలు ఉండిపోయింది.

రామ్... నన్ను పెళ్ళి చేసుకోవా...

"........ ............"

నాకు మన పెళ్ళి చూడాలని ఉంది. ఇది నా చివరి కోరిక.

"...... ............"

ఏంటీ.. ఇలా మాట్లాడుతున్నానని చూస్తున్నావా? కాన్షియస్‌లోనే ఉండి మాట్లాడుతున్నా! మనం పెళ్ళి చేసుకుందాం... ట్రెడిషనల్ గానే...! ఫ్రెండ్స్... రెలెటివ్స్ అందరి సమక్షంలో చేస్కుందాం. అందరి బ్లెస్సింగ్స్ తీసుకుందాం. అచ్చం.. మన సునీ చేసుకున్నట్లుగానే ....

"....... ........"

ఓహ్... ఇంకా కన్‌ఫ్యూజన్లోనే ఉన్నావా? దగ్గరకు రా... ఇంకా నా దగ్గరకు రా... ఊ ఇంకా.. నా కళ్ళలోకే చూస్తూ దగ్గరగా.. గుడ్.. నీ కళ్లలో నేను కనిపిస్తున్నాను.

రామ్ 'రోబో' అయ్యాడా క్షణం!

సంగీత ఎమోషనల్‌గా చెప్తోంది! ఉద్వేగంగా వింటున్నాడు రామ్...!

పూర్తిగా విన్న రామ్ షాక్‌తిన్నవాడిలా ఉలిక్కిపడ్డాడు! ఆశ్చర్యపోయాడు! తర్వాత.. అర్థం చేసుకున్నాడు.

ఆ రాత్రి...

మంగళవాయిద్యాలు, వేదమంత్రాల మధ్య, సంప్రదాయబద్ధంగా సంగీత - రామ్‌ల వివాహ కార్యక్రమం జరుగుతూ ఉంది!

మనసునిండా సంతోషంతో... కళ్లారా చూస్తోంది సంగీత. తన బెడ్‌పక్కనే పెట్టిన "ల్యాప్ టాప్"లో అంతా 'కన్నుల పండుగ'లా కనిపిస్తోంది!

సాఫ్ట్‌వేర్ టెక్నాలజీ సాధించిన అద్భుతం ఆమె 'కడసారి కోర్కె' తీర్చింది!

ఆ వివాహ వేడుక వీడియోలో సునీత.. రమేశ్‌ల ముఖాలకు బదులు సంగీత...రామ్‌ల ముఖాలు మార్ఫింగ్ చేయబడ్డాయి.

సెల్:99638 09339

## స్మార్ట్‌ఫోన్‌తో నిద్రలేమి?

**స్మా**ర్ట్ ఫోన్ చేతిలో లేకుండా క్షణం కూడా ఉండలేని వారు ఎందరో ఉన్నారు. నిత్యం చేతిలో ఉండే ఈ స్మార్ట్‌ఫోన్‌తో నిద్రలేమి తప్పదు అంటున్నారు కాలిఫోర్నియా యూనివర్సిటీ పరిశోధకులు. సుమారు 653మంది మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరు ఫోన్ మాట్లాడే సమయాన్ని, నిద్రపోయే సమయాన్ని నెలరోజుల పాటు రికార్డు చేశారు. వీరిలో దాదాపు అందరూ ఇంచుమించు గంటకు 3.7 నిమిషాల చొప్పున నెలలో 38.4 గంటల పాటు మాట్లాడారు. వీరందరిలోనూ నిద్రలేమిని గుర్తించారు. ముఖ్యంగా రాత్రి సమయంలో స్మార్ట్‌ఫోన్‌లో మాట్లాడేవారిలో ఈ సమస్య ఎక్కువగా కనిపించిందని పరిశోధకులు చెబుతున్నారు. స్మార్ట్ ఫోన్‌లో ఎక్కువసేపు మాట్లాడడం కచ్చితంగా నిద్రలేమి గురిచేస్తుందని వీరు స్పష్టం చేస్తున్నారు.



## మద్యం మానేసినా సమస్యలు



**కొం**దరు మద్యం వలన ఎదురయ్యే ఆరోగ్య సమస్యలను అర్థం చేసుకుని కొంత కాలానికి మానేస్తారు. అలా మానేయడం వలన ఆరోగ్యం భేషుగ్గా ఉంటుందని కూడా భావిస్తారు. కానీ ఈ అభిప్రాయం తప్పు అంటున్నారు పరిశోధకులు. కొంత కాలం బాగా మద్యం పుచ్చుకుని ఆ తరువాత మానేసినా ఆరోగ్య సమస్యలు తప్పవన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. నలభై సంవత్సరాలు పైబడిన సుమారు 600 మంది మీద వీరు దీర్ఘకాలం పరిశోధనలు నిర్వహించారు.

వీరిలో కొందరికి మద్యం అలవాటు అసలే లేదు. మరికొందరు మద్యం అలవాటును మధ్యలో మానివేశారు. కొన్ని సంవత్సరాల అనంతరం వీరి ఆరోగ్య స్థితిని పరిశీలించగా మద్యం అలవాటు లేని వారిలో ఒకటి రెండు ఆరోగ్య సమస్యలు కనిపించగా, మద్యం అలవాటును మానివేసిన వారిలో మూడు కన్నా ఎక్కువ ఆరోగ్య సమస్యలను గమనించారు. వీరిలో ఎక్కువ శాతం మంది కుంగుబాటుకు గురవుతున్న విషయం వీరి దృష్టికి వచ్చింది.. మధ్యలో తాగుడు అలవాటును మానేసిన వారు ఆరోగ్యం మీద మరింత దృష్టి పెట్టాలని వీరు సూచిస్తున్నారు.



## ఊబకాయానికి దారితీసే టీవీ

**పి**ల్లలు టీవీ చూస్తూ ఆహారం తీసుకోవడం వలన ఊబకాయానికి గురవుతారు అన్న విషయం గతంలో పలు పరిశోధనల్లో వెల్లడైంది. అయితే ఇప్పుడు టీవీ చూస్తూ ఆహారం తీసుకునే కుటుంబ సభ్యులు అందరూ ఊబకాయంతో పాటు పలు ఆరోగ్య సమస్యలకు గురయ్యే ప్రమాదం ఉందన్న విషయం అమెరికా యూనివర్సిటీ పరిశోధకులు నిర్వహించిన అధ్యయనంలో వెల్లడైంది.

సుమారు 120 కుటుంబాల జీవనశైలి, ఆహారపు అలవాట్ల మీద వారు అధ్యయనం నిర్వహించారు. ఈ కుటుంబాలలో దాదాపు అందరు సభ్యులూ భోజనం సమయంలో టీవీ చూసేవారే! కొన్ని సంవత్సరాల అనంతరం వీరిని పరిశీలించగా, కుటుంబ సభ్యుల మధ్య గతంలో ఉన్న అనుబంధాలు సన్నగిల్లగా, దాదాపు అందరూ ఊబకాయం బారిన పడడాన్ని గుర్తించారు. దీనికి కారణం టీవీ అనీ, దీన్ని చూస్తూ తీసుకునే క్యాలరీల మీద అదుపు లేకపోవడం, ఎక్కువగా బయట ఆహారానికి ప్రాముఖ్యత ఇవ్వడం లాంటివి కారణమని అంటున్నారు.




## బీట్‌రూట్ జ్యూస్‌తో పరుగో పరుగు



**బీట్‌**రూట్ జ్యూస్ తాగితే మామూలుకన్నా వేగంగా ఎక్కువ దూరం పరుగెట్టవచ్చు అంటున్నారు పరిశోధకులు. అంతేకాకుండా వృద్ధులు గతంలో కన్నా వేగంగా మెట్లు ఎక్కగలుగుతారని వారు చెబుతున్నారు. దీనికి కారణం బీట్‌రూట్‌లోని నైట్రేట్ అనే పోషకం కారణమన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. ఈ నైట్రేట్ కండరాలను చురుకుగా చేస్తుందని చెబుతున్నారు. కొంతమంది వృద్ధులు, క్రీడాకారుల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపుకు నైట్రేట్ ఉన్న బీట్‌రూట్ జ్యూస్ ఇచ్చారు. మరొక గ్రూపునకు నైట్రేట్ లేని బీట్‌రూట్ జ్యూస్ ఇచ్చారు. కొన్ని రోజుల అనంతరం రెండు గ్రూపుల వారిని పరిశీలించగా, నైట్రేట్ ఉన్న జ్యూస్ తాగిన క్రీడాకారులు మరింత వేగంగా పరిగెట్టగా, ఆ గ్రూపులోని వృద్ధులు కూడా తేలికగా మెట్లను ఎక్కగలిగారు. మరొక గ్రూపు వారిలో ఎలాంటి మార్పులేకుండా అంతకుముందు లాగానే ఉన్నారు. ఇదంతా బీట్‌రూట్‌లోని నైట్రేట్ గొప్పతనమే అని వారు అంటున్నారు.

## పిల్లల్లో రక్తపోటు?

**పి**ల్లలకి రక్తపోటు ఏమిటి? అన్న అనుమానం కలగవచ్చు. ఇది నిజం అంటున్నారు పరిశోధకులు. పెద్దల కన్నా పిల్లలు ఉప్పు పదార్థాలను ఎక్కువగా ఇష్టపడడమే దీనికి కారణమని వారు చెబుతున్నారు. 14 నుంచి 16 సంవత్సరాల వయస్సులోపు ఉన్న సుమారు రెండు వేల మంది ఆహారపు అలవాట్లను వీరు పరిశీలించారు. వీరిలో చాలా మంది మామూలు కన్నా ఎక్కువ ఉప్పును తీసుకోవడం వీరు గమనించారు. ఈ కారణంగా వీరిలో అధికరక్తపోటును వీరు గుర్తించారు. ఇలా చిన్నతనంలోనే రక్తపోటు బారిన పడితే ఈ సమస్య జీవితాంతం వెంటాడే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. చిన్నపిల్లలు తీసుకునే ఆహారం మీద తప్పనిసరిగా ఓ కన్నేసి ఉంచాలని వీరు సూచిస్తున్నారు. పిల్లలు ఫాస్ట్‌ఫుడ్, వేపుళ్ళు వంటి పదార్థాల జోలికి పోకుండా వారికి తాజా పండ్లు తీసుకునే అలవాటు చేయాలని, అప్పుడే కొంత వరకూ రక్తపోటు సమస్య నుంచి వారిని కాపాడవచ్చని వారు సూచిస్తున్నారు.



**-అవినాష్**

# మహానంది 8



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**కామరూప ఆస్థాన లేఖకుడు నందకుడు తన భవనం ముందు గుర్రం దిగాడు. ద్వారబంధానికి పూలదండ తోరణంలా వేలాడుతోంది. కుసుమ తోరణం కనిపించి మూడువారాలు దాటింది. గుమ్మానికి కుసుమ తోరణం తన గృహలక్ష్మి ఉనికికి సంకేతం! మూడు వారాల క్రితం పుట్టింటికి వెళ్ళిన లవంగి తిరిగి వచ్చిందన్నమాట! నందకుడు నూతనోత్సాహంతో గుమ్మం దాటాడు.**

లవంగి బొండుమల్లెల మాలికను తలలో దోపుకుంటూ, అద్దం ముందు నిలుచుంది. మూడువారాల పుట్టినింటి వాసం ఆమె అందాన్ని హెచ్చువేత వేసింది. అద్దంలో భర్త ప్రతిబింబాన్ని చూసి లవంగి వెనక్కి తిరిగి చిరునవ్వుతో చూసింది. నందకుడు ఆమె భుజాలమీద చేతులు వేశాడు.

"వర్తమానం లేకుండా వచ్చేశావు. ఒంటరితనంతో ఎలా అయిపోయానో చూడు!" నందకుడు నవ్వాడు.

"ఏం చేయను? అమ్మానాన్నా రమ్మన్నారు!" లవంగి అతని చేతులు పట్టుకుంటూ అంది.

"పుట్టినింటి నుండీ ఏం కట్టుకొచ్చావు? ఏం పెట్టుకొచ్చావు?" నందకుడు ఆశగా అడిగాడు.

"అమ్మ ఇచ్చిన చీర కట్టుకున్నాను. పెట్టుకున్న నగ నాన్నకు ఇచ్చాను. ఏదో కష్టం వచ్చి పడింది పాపం.." లవంగి అంది. "ఉన్న ఒక్క రత్నహారం పోయింది. నాన్న ఎప్పుడిస్తాడో ఏమో.."

"బాధపడకు లవంగీ! అక్కడ చేజారితే, ఇక్కడ చేజిక్కుతుంది!" నందకుడు గర్వంగా అన్నాడు.

"అంటే..." లవంగి ప్రశ్నార్థకంగా చూస్తూ అంది.

"నగల పెట్టె దగ్గరకు వెళ్దాం" అంటూ నందకుడు భుజం మీద చేతిని వేసి లవంగిని నడిపించుకు వెళ్ళాడు. నగల పెట్టె తెరిచి, ఒక వజ్రాలహారాన్నీ, ఒక రత్నహారాన్నీ, ఒక ముత్యాలహారాన్నీ తీశాడు.

లవంగి గుడ్లు పెళ్ళగించుకుంటూ చూసింది. నోరు వెళ్ళబెట్టి భర్తను చూసింది. "కొన్నారా?"

"చేకొన్నాను!" నందకుడు గర్వంగా అన్నాడు. 'వజ్రాల హారం సర్వసైన్యాధ్యక్షుడి ఇంటి నుండీ వచ్చింది. రత్నహారం మహారాజుగారు తన మెడలోంచీ స్వహస్తాలతో తీసి బహూకరించారు."

"నా భర్త తలరాత అద్భుతం!" లవంగి హారాలను తీసుకుని కళ్ళకి అద్దుకుంటూ అంది.

"అద్భుతం నీ పతిదేవుడి తలరాత కాదు; చేతిరాత" నందకుడు సగర్వంగా అన్నాడు. "ఈ చేతిరాత కొందరి తలరాతల్ని మార్చివేసింది..."

లవంగి ప్రశ్నార్థకంగా చూసింది. తన ముందుకు భర్త చాపిన చేతిని ఉద్రేకంగా పెదవులతో స్పృశించింది. "ఏం జరి




### జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడు. మహారాజు న్యాయ విచారణ జరిపి అతణ్ణి రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు. అతడి కుటుంబాన్ని కూడా రాజద్రోహ పరివారంగా ప్రకటించాడు. కుమార్తె దీపాంకురకు అంతఃపుర శౌచాలయాలు శుభ్రంచేసే శిక్ష, కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు రాజు. పొరుగు రాజ్య శ్రామికుడి ఇంట ఆశ్రయం పొంది కర్తవ్యాన్వేషణలో ముందుకు సాగుతూ, దుష్టుడైన వడ్డీ వ్యాపారి భరతంపట్టి ఒక సత్రం నిర్వాహకురాలు సహా, పేదలకు మేలుచేస్తాడు. సత్రం నిర్వాహకురాలి ఆశ్రయం పొందుతాడు. తన తండ్రిని చెరసాల పాలు చేసిన లేఖిని నందకుడిని, అతణ్ణి ఆయుధంగా వాడుకున్న అదృశ్య వ్యక్తినీ కలుగులోంచి బైటకు రప్పించాలని సంకల్పించుకుంటాడు నంది. ఆ తర్వాత......



గింది? ఎవరి తలరాతలు మారాయి?"

"సర్వసైన్యాధ్యక్షుడు చెరసాలలో యావజ్జీవ కారాగారవాస శిక్ష అనుభవిస్తున్నాడు. అతని కొడుకు దేశబహిష్కరణ శిక్షతో దేశ భ్రష్టుడయ్యాడు. కూతురు రాణివాసంలో శౌచాలయాలు శుభ్రం చేస్తూ ఊడిగం శిక్ష అనుభవిస్తోంది. ఒక్క కదలికతో నీ పతిదేవుడి చెయ్యి బ్రహ్మదేవుడు రాసిన రాతను తిరగరాసింది!"

లవంగి కాటుక కళ్ళు గిన్నెల్లా అయ్యాయి. "ఏం జరిగిందో నాకు చెప్పాల్సిందే! ఇంత కాలం నా భర్త కొలువులో చెప్పింది రాసే సేవకుడనుకున్నాను. ఇంత చేవా, చేతివాటమూ ఉన్న మేధావి అని తెలుసుకోలేకపోయాను! ఆ చేత్తో చేసిన అద్భుతాన్ని ఈ చెవిలో వేయండీ!"

నందకుడు లవంగిని రెండు చేతుల్తో దగ్గరగా లాక్కున్నాడు. "మనిషి తాను చేసిన సాహసం గురించి చెప్పుకోవాలని ఉబలాటపడతాడు. పుట్టింటికి వెళ్ళిపోయిన నీ కోసం ఆ ఉబలాటంతో ఎదురుచూస్తూ తహతహలాడిపోతున్నాను. చెవిలో వేయకుండా ఎలా ఉండగలను? అర్ధాంగికి మాత్రమే చెప్పదగిన అద్భుతం అది! చెవిలో చెప్తాను. ఆలకించు! ఆనందించు!" అంటూ నందకుడు భార్య చెవి దగ్గరగా తన పెదవుల్ని తీసుకెళ్ళాడు.

"సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడు బర్బరదేశ సైన్యాధ్యక్షుడికి తన కుమార్తె వివాహ విషయంలో లేఖ లిఖించమన్నాడు. అతను చెప్పింది చెప్పినట్టు అక్షరం ముక్క పొల్లు పోకుండా రాశాను. జాగ్రత్తగా చదివి, చేవ్రాలు చేశాడు. రాజుగారి కొలువులో ఉన్న మరొక వ్యక్తి కోసం- సర్వసైన్యాధ్యక్షుడు బర్బరదేశ సైన్యాధ్యక్షుడికి రాసినట్టుగా, కామరూప రాజ్య సైన్య రహస్యాలతో మరో లేఖ రాశాను..?"

"కల్పిత లేఖా?!" లవంగి ఆశ్చర్యంగా ఉంది.

"పూర్తిగా శ్రీ నుండీ శుభం దాకా కల్పితమే! ఆ లేఖ..."

"సర్వసైన్యాధ్యక్షుడి సంతకం.." లవంగి మళ్ళీ అడ్డు తగిలింది.

నందకుడు గర్వంగా నవ్వాడు. "అది నీ పతిదేవుడి హస్త లాఘవమే! ఎవరి చేవ్రాలునైనా, యథాతథంగా అలా అలా అలవోకగా గీకి పారేయగలిగిన చాకచక్యాన్ని ఆ అక్షర దేవత ఈ అద్భుత హస్తానికి అందించింది..."

"నమ్మలేకుండా ఉన్నాను..." లవంగి నోరు వెళ్ళబెట్టింది.

"అది తన చేవ్రాలేనని నమ్మాల్సిన వ్యక్తి సంకోచించకుండా నమ్మాడు. ప్రమాణ పూర్వకంగా అది తన చేవ్రాలే అంటూ నిండు సభలో మహారాజుగారి ముందు అంగీకరించాడు!" నందకుడు సగర్వంగా నవ్వుతూ లవంగి బుగ్గ మీదికి పెదవుల్ని జరిపాడు.

"అయితే సర్వసైన్యాధ్యక్షుడికి చెందిన ఈ వజ్రాలహారం? ఎవరిచ్చారు? మీరే కాజేశారా?"

"నందకుడు కాజేయడు. కానుకగా స్వీకరిస్తాడు. నా చేత కృత్రిమ లేఖ వ్రాయించిన వ్యక్తి మరెవరి చేతనో సైన్యాధ్యక్షుడి ఇంట్లో వజ్రాలహారాన్ని కాజేయించి ఉంటాడు! వార్తాహరుడికి రుద్రాక్షుడు ఇచ్చిన నిజమైన లేఖ స్థానంలో, కల్పిత లేఖ ఉండేలా ఆయనే ఏర్పాటు చేసుకున్నాడు. వార్తాహరుడు నగర రక్షక వేగులకు దొరికిపోయే

ఏర్పాటూ ఆయనే చేసుకున్నాడు. ఇదిగో...ఈ తొమ్మిది పేరుల ముత్యాలహారం ఆయనిచ్చిన కానుకే! కొసరు కింద వెయ్యి బంగారు నాణేలు లాగేశాను!"

"ఇంతకీ...ఆ వ్యక్తి ఎవరు?" లవంగి ముత్యాల హారాన్ని రెండు చేతుల్తో అందుకుంటూ అంది.

"తల్లిదండ్రుల మీదా, మన వంశ మూల పురుషుల మీదా, కామరూపాంబికా దేవత మీదా, అన్నింటికన్నా ముఖ్యంగా నా ఆరోప్రాణమైన లవంగి మీదా ప్రమాణం చేసి ఎవ్వరికీ చెప్పనని ఆయనకు వాగ్దానం చేశాను..."

లవంగి చిన్నగా నవ్వింది. "వస్తువులూ, ధనమూ దానం చేస్తే తిరిగి తీసుకోలేం. దానంగా తీసుకున్న వాళ్ళు ఇవ్వరు. ఇచ్చి, తిరిగి తీసుకోగలి గింది వాగ్దానం ఒక్కటే. ఆ పని నా పతిదేవుడు ఇప్పటికే చేసి ఉన్నాడు!"

"నేను వాగ్దానభంగం చేశానా?!" నందకుడు ఆశ్చర్యంతో అన్నాడు.

"పెళ్ళిలో అగ్నిదేవుడి సమక్షంలో ఏమన్నారు? ధర్మేచ నాతిచరామి, అర్థేచ నాతిచరామి, కామేచ నాతిచరామి అన్నారు. ధర్మ, అర్థాల విషయం నాకు తెలీదు గానీ కామ విషయం తెలుసు. 'సంపంగి'ని మరిచిపోయారా? ఆ సంపంగి 'వాస నను' దూరం చేయడానికి నేను పడిన యాతన మరిచిపోయారా?"

"ఆ 'నాతిచరామి' అనే మంత్రం మహాజటిల మైన సంస్కృతం. నాకు అర్థం కాలేదు. అయి ఉంటే..." నందకుడు తెలివిగా అంటున్నాడు.

"మీరు నన్ను ఏమార్చలేరు! చెప్పకపోతే నా మీద ఒట్టే!"

నందకుడు నిట్టూర్చాడు. "నీ మీద ఒట్టేసి నిజం చెబుతాను. నా చేత ఆ సాహసం చేయిం చింది ఒక సామాన్య భటుడు. తనకోసం చేయిం చింది కాదని నాకు తెలుసు. ఎవరికోసం, ఎవరి పథకం ప్రకారం చేయించాడో నీ సాక్షిగా తెలీదు. బైటికి పొక్కితే తల ఎగిరిపోతుందన్నాడు. నన్ను నమ్ము. నీ కడుపున పుట్టబోయే బిడ్డ మీద ప్రమాణం చేసి చెప్తున్నాను. అతి ప్రమాదకర మైన రహస్యం వెనుక ఎవరున్నారో తెలీదు..."

"నా కడుపున కాయ కాచే అవకాశం ఇంకా రాలేదుగా?"

"రాకుండా ఉండదుగా?" నందకుడు నవ్వుతూ అన్నాడు. "ఆభరణాలు ఒళ్ళో వాలాయి. అలంకరించుకో. ఆనందించుకో!"

"భయం లేదుగా?"

"ఎందుకు భయం? రత్నహారం నిండు సభలో రాజుగారు స్వయంగా బహూకరించారు. వజ్రాలహారం తనదే అని రుద్రాక్షుడు అంగీకరిం చాడు. అయితే నాకు తాను ఇవ్వనేలేదన్నాడు. హారం తనదే అన్న మాటను మహారాజుగారు నమ్మారు. తాను ఇవ్వలేదన్న మాటను నమ్మ లేదు! దానిని నన్నే తీసుకోమన్నారు; రాజద్రోహి అని నిరూపించినందుకు! ఇంక ముత్యాలహారం మూడో వ్యక్తిది. భటుడి ద్వారా నా చేతికి వచ్చింది. ఎందుకైనా మంచిది, దాన్ని బహిరం గంగా ధరించవద్దు!" నందకుడు వివరించాడు.

**నందకుడు రత్నాలహారం, వజ్రాలహారం, ముత్యాలహారాలను ఆమె ముందుంచాడు. ఆశ్చర్యపోయిందామె! ఇవన్నీ ఎక్కడివి? అడిగింది. తన చేతివాటం గురించి వివరించాడు నందకుడు. అంతేకాదు త్వరలోనే తాను ఐదుగురి సమక్షంలో యువరాణివారి స్వయంవర ఆహ్వానపత్రిక రాయబోతున్నట్లు చెప్పాడు. దానికి ఆమె ఎలా స్పందించింది? అసలెవరామె?**

లవంగి మూడు హారాలను నగల పెట్టెలో పెట్టి, మూత మూసి, భర్త వైపు తిరిగింది. "సర్వ సైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడుగారు నేరం చేయకుం డానే శిక్ష అనుభవిస్తున్నాడు. తల్లిలేని ఆయన పిల్లలు కూడా..."

నందకుడు చిన్నగా నవ్వాడు. "పిచ్చిదానా, ఈ జన్మలో ఈ ఉద్యోగంలో చేరి నేరం చేసి ఉండక పోయి ఉండొచ్చు. గతజన్మలో తప్పకుండా చేసి ఉంటారు! కర్మ కట్టి కుడుపుతుంది. నీ సంగతే తీసుకో! ఈ నగలు కావాలని నువ్వు అనుకోలేదు; అడగలేదు. వచ్చి ఒళ్ళో వాలాయి. ఎందుకు? గత జన్మ పుణ్య కర్మ! అప్పుడు ఇచ్చావు; ఇప్పుడు పుచ్చుకున్నావు! అర్థమైందా?"

"కర్మ అర్థంకాలేదు గానీ, నా మొగుడి తెలివి అర్థమైంది!" లవంగి చిరునవ్వుతో అంది. "నన్ను చేపట్టిన చెయ్యి బంగారు చెయ్యి!"

నందకుడు సగర్వంగా నవ్వాడు. "రేపు ఉదయం శుభముహూర్తాన నీ పతిదేవుడి బంగారు చెయ్యి కదలబోతోంది. రాకుమారి లాలసా దేవి భవిష్యత్తుని లిఖిస్తుంది!"

"యువరాణి భవిష్యత్తునా!" లవంగి ఆశ్చ ర్యంతో అంది. "జాతకమా? అది యువరాణి పుట్టి నప్పుడే ఆస్థాన జ్యోతిష్కుడు..."

"జాతకం కాదు ప్రేయసీ; స్వయంవర పత్రిక!" నందకుడు అడ్డొస్తూ అన్నాడు. "ఆస్థాన జ్యోతిష్కుడు స్వయంవర ముహూర్తం నిర్ణయిం చాడు. ఆస్థాన కవిగారు స్వయంవర ఆహ్వాన పత్రిక లిఖించారు. ఆ రెండింటినీ సమన్వయం చేసి, అయిదుగురి సమక్షంలో నీ పెనిమిటి పత్రికా లేఖనం చేయాలి..."

"అయిదుగురా? ఎవరు?"

"మహారాజుగారు, మహారాణిగారు, మహా మంత్రిగారు, ఆస్థానకవిగారు, ఆస్థాన జ్యోతిష్కు డుగారు. మనం లిఖించే మాదిరి పత్రాన్ని అయి దుగురూ ఆమోదించాకా-యాభైకి పైగా ప్రతులు లిఖించాలి. 'నందకా, నీ హస్తవాసి మంచిది. అన్ని ప్రతులూ నువ్వే లిఖించు!' అన్నారు మహా రాజుగారు. నా చేతికి కంకణమో, నీ కంఠానికి హారమో కానుకగా వాలడం తథ్యం!" నందకుడు లవంగిని శయనాగారం వైపు నడిపిస్తూ సగ ర్వంగా అన్నాడు.

•••

రాకుమారి లాలస నిలువుటద్దం ముందు




## ఆయుధం

అక్షరం అందుబాటులో వున్నా
సాలెగూట్లో ఇరుక్కుపోతున్న బాలల దేశం ఇది
చట్టం ఘోషిస్తున్నా
బాలలను పనిముట్లుగా మారుస్తున్న
యాజమాన్యం ఇది
బాలకార్మిక వ్యవస్థను
నిర్మూలించలేని పక్షవాతాన్ని నేను
గృహహింస చట్టం వచ్చింది గాలిలో దీపమైంది
కారణం... భర్తల మీద భార్యల ప్రేమభావం
లేదా భయం దెయ్యం

ఇంకా గృహహింస ఆర్తనాదాలు వింటూ
ఏమీ చేయలేకున్న అవిటితనాన్ని నేను
పేరుకు పవిత్ర భారతదేశం జరిగేవి
అత్యాచారాలు
పతివ్రతల పురాణాలతో గణతకెక్కిన భూమిలో
విడాకులు విచ్చలవిడి తనమయ్యింది
కేవలం ఆధిపత్యం... అహంకారం...
అభిప్రాయభేదం...
మీలో ఎవర్నీ ఖండించలేని గళాన్ని నేను

ప్రాణవాయువును ఫ్రీగా ఇస్తున్న చెట్లను ఖండించి,
పర్యావరణానికి హానికారకులైన వ్యక్తుల్ని
చూస్తూ కూడా...
ఎదిరించలేని అధైర్యాన్ని నేను
వృద్ధాప్యపు ముంగిట్లో
లయతప్పిన బ్రతుకుల్ని చూస్తూ.. నిట్టూరుస్తూ
ఏమీ చేయలేని జాలితనాన్ని నేను



నేను
అన్యాయానికి కత్తి ఎత్తలేను
అధర్మానికి తలవంచలేను
అందుకే
అక్షరమే నాకు ఆయుధం
చదివినా... రాసినా

*-డా. పెళ్ళకూరు జయప్రద సోమిరెడ్డి*

*సెల్: 94402 79594*

నించుంది. ప్రతిబింబం ఆమెవైపు చిరునవ్వు చిందిస్తోంది. లాలస చూపులు ప్రతిబింబాన్ని నఖశిఖ పర్యంతం పరిశీలనగా కొలత వేస్తూ ఉండిపోయాయి. పసుపుపచ్చ రంగు చీనాంబరంలో ఆమె శరీరం దాగుంది. ఉన్నట్టుండి, వాతాయనం లోంచీ గాలి దూసుకొచ్చింది. లాలస మీదున్న మేలి ముసుగును తొలగించి, కిందపడేసింది.

రాకుమారి సమీపంలో ఉన్న చెలికత్తెలు చపల, చంచల ఫక్కున నవ్వారు.

"ఎందుకే ఆ పకపకలు?" లాలస కసిరింది.

"మేలి ముసుగు గాలి తాకిడికి పడిపోయాక, మిమ్మల్ని చూస్తోంటే మన ఆస్థాన కవి నిరంకుశ భట్టుగారి ప్రబంధం 'ప్రమదసుధార్ణవం'లోని పద్య భావం గుర్తొచ్చి నవ్వొచ్చింది, అమ్మాయిగారూ.." చపల అంది.

"నీక్కూడా గుర్తొచ్చిందేమే?" రాకుమారి చంచలను అడిగింది.

"గుర్తు రాలేదుగానీ, నవ్వొచ్చింది...అమ్మాయిగారూ!" చంచల అంది.

"ఏయ్ చపలా, ఏమిటా పద్యభాగం? నన్ను చూసి, నవ్వించిందా అది?"

"ఆ ప్రబంధంలో నాయిక ప్రమదిని హంస తూలికాతల్పం మీద అలవోకగా పవళించి ఉంటుందమ్మా! వాలుజడ, ఆమె ముందు భాగంలో ఉంటుంది. 'అది జంట పుట్టల మధ్య పడుకున్న నల్లత్రాచులా ఉంది' అన్నారమ్మా కవిగారు వర్ణిస్తూ..."

"అయితే..."

"ఇప్పుడు...తమ వాలుజడ కూడా ముందే ఉందమ్మా, ఆ ప్రబంధనాయిక జడలాగే. కాకపోతే ఆమె పవళించి ఉంటుంది, మీరు నిలుచున్నారు. అంతే తేడా! వాలుజడ ఎక్కడుందో మీరే చూసుకోండి!"

"చాలు! అర్థమైంది! ఆపేయ్!" రాకుమారి లాలస చిరుకోపం నటిస్తూ, తన ముందు నల్లత్రాచులా వేళ్ళాడుతున్న జడను వెనక్కు విసురుకుంది.

"మహారాణిగారికి చెప్పి ఇద్దరికీ పెళ్ళి చేయిస్తాను...ముందు వడ్డాణం పెట్టండి!"

రాకుమారి లాలస ముందు ఏడు బంగారు పళ్ళేల్లో రకరకాల నగలున్నాయి. ఒక పళ్ళెం నిండుగా వడ్డాణాలు.

"వడ్డాణాలన్నీ పెద్దవిగా ఉన్నాయమ్మాయిగారూ.." చపల అంది.

"అన్నీ చూసేశాం. మీకు నడుముంటేగా!" చంచల చమత్కరించింది.

"ఏయ్!"

"కలదు కలదు జానెడు నడుము కలదో లేదో!" అన్న మన కవిగారి వర్ణనను గుర్తుచేస్తోందమ్మా మీ కందిరీగ నడుము!" చపల అంది.

"శృంగార కవిత్వాలు బాగా గుర్తుండేలా ఉన్నాయే నీకు, చపలా!" లాలస నవ్వింది.

"మన ఆస్థాన కవిగారు యువరాణిగారి సౌందర్యాన్నే పద్యాలలో బంధించారనిపిస్తోంది, అమ్మాయిగారూ!"

# అవికా పనైపోయిందా?

*అవికాగోర్ హీరోయిన్‌గా చేసిన సినిమాలన్నీ హిట్లే! హీరోయిన్‌గా అవికా పెద్దస్థాయికి వెడుతుందని అందరూ అనుకున్నారు. కానీ అవికా తీసుకున్న కొన్ని నిర్ణయాలు ఆమెను హీరోయిన్ రేస్ నుంచి తప్పించేశాయి. మొన్నటిదాకా డైరెక్షన్ విభాగంలో ఏదో కోర్సు చేస్తున్నానని చెప్పిన అవికా ఇప్పుడు ఓ సినిమాలో అతిథి పాత్రలో కనిపించబోతోందట! ఏమాత్రం సక్సెస్ రేట్ లేని హెబ్బా పటేల్ హీరోయిన్‌గా చేస్తున్న 'ఎక్కడికి పోతావు చిన్నవాడా' సినిమాలో అవికా అతిథిగా కనిపించబోతోందట! దీంతో హీరోయిన్‌గా అవికా పనైపోయిందన్న వార్తలు ఇప్పుడు బాగా వినిపిస్తున్నాయి. కొందరు హీరోయిన్లు అవకాశాలు లేక తెరమరుగైపోతుంటే అవికా అవకాశాలు ఉన్నా తెరమరుగైపోతోందని ఆమె సన్నిహితులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారట!*



"నోరు మూసుకుని ఆభరణాల పని ముగించండి! వడ్డాణం సంగతి ఆలోచిద్దాం..." లాలస తన సన్నటి నడుము మీద చేతులు ఆన్చుకుని అంది.

"అవునే చపలా! త్వరగా కానీ... స్వయంవర ముహూర్తం ముంచుకొస్తోంది!" చంచల గుర్తు చేసింది.

"యువరాణీ వారూ...ఒక సందేహం..." లాలస కంఠంలో చంద్రహారం అలంకరిస్తూ అంది చపల. "స్వయంవరానికి యాభై అయిదుగురు రాకుమారులు విచ్చేశారు. వాళ్ళల్లో ఎవ్వరూ కంటికి ఆనకపోతే ఏం చేస్తారు?"

"ఏం చేస్తాను? స్వయంవర మాలికను నా కంఠంలో వేసుకుని, ఠీవీగా తిరిగొచ్చేస్తాను!"

"మహారాజుగారూ, మహారాణిగారూ కోప్పడితే?" చంచల అడిగింది, రాకుమారి జడలో పువ్వులు తురుముతూ.

"నేను కోప్పడతాను!" లాలస నిర్లక్ష్యంగా అంది. కోపానికి విరుగుడు కోపమే! ఊ...త్వరగా కానివ్వండే! ఆలయానికి వెళ్ళి దేవి దర్శనం చేసుకు రావాలిగా!"

•••

లాలస అలంకరణ పూర్తయింది. కానీ వడ్డాణం లేని లోటు స్పష్టంగా కనిపిస్తోంది.

"మహారాణిగారు కొత్త వడ్డాణం చేయించేదాకా, ఆభరణం లేకుండా, మీ సింహ నడుం చిన్నబోవాల్సిందే!" చపల నవ్వుతూ అంది.

లాలస మాట్లాడకుండా నిలువుటద్దంలోకి చూస్తూ ఉండిపోయింది. బంగారు కాంతుల్ని విరజిమ్ముతున్న వస్త్రాలు, నీలాకాశవర్ణంలో ఉన్న మేలిముసుగు, కాటుక రేఖలతో మరింత వైశాల్యాన్ని అందిపుచ్చుకున్న పెద్దపెద్ద కళ్ళూ, ధనురాకారంలో ఆ విశాల నేత్రాలకు రక్షణగా ఉన్నట్టు కనిపిస్తున్న కనుబొమలు...కనుబొమల మధ్య ఉదయిస్తున్న సూర్యబింబంలా గుండ్రంగా ఎర్రగా మెరుస్తున్న తిలకం. చెలికత్తె చంచల జాగ్రత్తగా అతికించిన కెంపు అది. స్వచ్ఛ జలంతో మెరుస్తున్న సరసుల్లా ఉన్న విశాల నేత్రాల మధ్య సరిహద్దులా నాసిక! లాలస తన అందాల ముక్కును చూస్తూ ఉండిపోయింది. "లాలసా! నీ ముక్కు సంపెంగ పువ్వే!"తన బాల్యంలో తనతో తరచుగా అనే పితామహి మాట గుర్తొచ్చింది లాలసకు. తన అందం నానమ్మ అందం అంటారందరూ. నాన్నమ్మను పోలిన తనకు నాన్నమ్మ పేరే పెట్టారు.

లాలస చూపులు ప్రతిబింబం నుంచి కంఠం మీదికి జారాయి. రకరకాల రంగుల కంఠాభరణాలు, ఆరితేరిన చిత్రకారుడు చిత్రించిన నగల్లా-తన కంఠాన్ని కౌగిలించుకుని ఉన్నాయి. రంగుల కలయిక సమతుల్యంగా ఉండేలా నవరత్నాల హారాల్ని అలంకరించారు చెలులు. ఒక కంఠాభరణం కన్నా మరొకటి పొడవుగా...స్వర్ణాభరణాల రంగుని తన శరీర వర్ణం తక్కువ చేసి చూపుతోంది. రత్నాలు లేకపోతే వాటిని తన శరీర వర్ణం నుండీ వేరు చేసి చూడ్డం అసాధ్యం! లాలస చూపులు మరికొంచెం కిందకి వాలాయి.

పొడుగాటి హారాలూ, వాటి మధ్య మెరుస్తున్న పతకాలూ, తన ఉచ్ఛ్వాస నిశ్వాసాలను కొలతవేసి చూపుతున్నట్టు కదులుతున్నాయి.

సుడిగుండం ఆకారంలో ఉన్న నాభిలో ఇరుక్కున్న గోమేధికం తళుక్కుమంది.

"చపలా! వడ్డాణం ఎలాగే! వెలితిగా లేదూ?" లాలస తన నడుమును గర్వంగా చూస్తూ అంది.

"నవరత్నాలు దట్టించిన 'దట్టీ'ని అందంగా చుట్టేస్తాను అమ్మాయిగారూ! చుట్టేయనా?" చపల పళ్ళెంలోంచీ దట్టీని తీసుకుంటూ అంది.

"కానీ! తప్పుతుందా?" లాలస అంది.

"దట్టీని చుట్టుకుంటే, నడుం కింది భాగం కొండంత అందాన్ని కొని తెచ్చుకుంటుందమ్మా!" చంచల అంది.

"మహారాణిగారు చూస్తారు; అందంగా లేక పోతే మీకు శాస్తి చేస్తారు! కానివ్వండి!" లాలస అంది.

తలుపుకి ఉన్న బంగారు గంటలు సన్నగా మోగాయి. తలుపుల్ని తోసిన పరిచారిక విన యంగా పక్కకు తప్పుకుంది. మహారాణి మహిమా దేవి లోపలికి వచ్చింది.

"మా అలంకరణ అంతగా లేకపోయినా, మా యువరాణీగారు అందంగానే ఉంటారు! ఎవరు




చూసినా మాకేం భయం లేదు!" చంచల తగ్గు స్వరంతో అంది.

"ఏమిటే చపలా, చంచలా! ఇంకా పూర్తికా లేదా మీ అలంకరణ. మహారాజుగారొస్తున్నారు!" మహారాణి మహిమాదేవి అంది దగ్గరగా వస్తూ. "అదేమిటే, నడుం చుట్టూ ఏమిటో చుట్టేస్తు న్నారు?"

"యువరాణీవారి నడుము పూట పూటకీ చిక్కిపోతోంది మహారాణీ..." చపల అంది.

"ఎంతలా చిక్కిపోతోందంటే, వంద వడ్డా ణాల్లో ఒక్కదానికీ చిక్కడం లేదు మహారాణీ, ఆ కందిరీగ నడుము!" చంచల అందుకుంటూ అంది.

"అమ్మాయిది నా పోలికే! ఏం చేద్దాం..." మహారాణి సగర్వంగా అంది.

గంభీరంగా వినవస్తున్న అడుగుల చప్పుడు మహారాజు కుబేరవర్మ రాకను తెలియజేస్తోంది. కుబేరవర్మ మహారాణి దగ్గర నిలుచున్నాడు. చిరు నవ్వుతో ఆమె వైపు చూశాడు.

"మా పుత్రిక అమ్మగారి పోలిక కాదనీ, నాయ నమ్మగారి పోలిక అనీ పుట్టిననాడే నిర్ధారించాం కదా!"

"అవునవును! అమ్మాయి అందమంతా ప్రభు వుల అమ్మగారిదే! కన్నబిడ్డకు కన్నతల్లి అందం రాదు కదా?" మహిమాదేవి వెటకారంగా అంది.

"మాకు తెలుసు కద! తల్లి అందం తల్లిది; పిల్ల అందం పిల్లది!" కుబేరవర్మ నవ్వుతూ అన్నాడు. "అలంకరణ పూర్తయినట్టేనా? అవతల యాభైమంది రాకుమారుల కళ్ళు కాయలు కాచి పోతున్నాయి.."

"యాభై మందేనా?" మహారాణి ఆశ్చర్యంగా అంది. "మహా సామ్రాజ్యాలు యాభై ఆరుకదా?"

"ఔను! యాభై ఆరు మహాసామ్రాజ్యాలలో మన కామరూప సామ్రాజ్యమూ ఉందిగా! మిగి లిన మహాసామ్రాజ్యాలు యాభై అయిదు. యాభై మంది అవివాహిత యువరాజులు వచ్చారు. మిగిలిన ఐదుగురూ స్వయంవరానికి రాలేమంటూ వర్తమానం వచ్చింది."

"అయ్యో పాపం..లాలసను చూసే అదృష్టం లేదు వాళ్ళకి!" మహారాణి అంది. "అయినా పెళ్ళిళ్ళ యిన వాళ్ళు రాకపోవడమే మంచిది. లాలసకు సవతిపోరు ఉండదు!"

"అంచేత మీ గారాల కుమార్తె గారిచేత వరించ బడే అదృష్టాన్ని పరీక్షించుకోవడానికి యాభై మంది యువకులు మహాసామ్రాజ్యాల యువ రాజులే వేంచేశారు!" కుబేరవర్మ సగర్వంగా వివ రించాడు.

లాలస అద్దం ముందు నుంచీ తల్లిదండ్రుల ముందుకు నడిచింది. ఆమె అందెలు వీనుల విందుగా సవ్వడి చేస్తున్నాయి. ఆమె నడుమును చుట్టిన దట్టీకి ఉన్న చిరుగజ్జెలు అందెల రవళికి లయ తప్పకుండా తాళం వేస్తున్నాయి.

"నాన్నగారూ, అమ్మా ఆలయానికి వెళ్ళి దేవి దర్శనం చేసుకు వస్తాను..." అంది లాలస.

"అలాగే తల్లీ! నువ్వు ఆ కామరూపాదేవి ప్రసాదానివి! ఆ తల్లి దర్శనం చేసుకోకుండా స్వయంవరం ఎలా జరుగుతుంది? వెళ్ళి రామ్మా!" కుబేరవర్మ ప్రేమగా అన్నాడు.

మహారాణి చెలికత్తెల వైపు తిరిగింది. "ఒసే చపలా, ఏడుగురు ముత్తైదువులు..."

"సిద్ధంగా ఉన్నారు మహారాణీ!" చపల అంది.

"శుభశకునంగా వాళ్ళని పల్లకీకి ఎదురు రమ్మను. ఆలయం నుండీ తిరిగి వచ్చాక ఆ సప్త సువాసినుల చేత అమ్మాయిగారికి దిష్టి తీయిం చండి!"

"చిత్తం మహారాణీ!"

లాలస తల్లిదండ్రులకు పాదాభివందనం చేయడానికి ముందుకు వంగింది.

"మాకు పాదాభివందనాలు స్వయంవరానికి వెళ్ళే ముందు తల్లీ!" మహారాణి వారిస్తూ అంది.

లాలస చిరునవ్వు నవ్వింది. చిగురాకు పెద వుల మధ్య ముత్యాల్లా మెరిశాయి. "ముందు మాతృదేవోభవ...పితృదేవోభవ...అమ్మా!"

"అదీ!" కుబేరవర్మ సగర్వంగా అన్నాడు. "అదీ విజ్ఞతతో కూడిన వినయం అంటే! అలాంటి విష యాల్లో అమ్మాయిది తండ్రిపోలిక!"

"మా అంతఃపుర సౌభాగ్యం ఎవరిని వరి స్తుందో!" మహారాణి మహిమాదేవి అంది.

"ఈ కామరూప రాజ్య ప్రభువు పుత్రికను చేపట్టడానికి పూర్వజన్మ సుకృతం ఎంతో అవ సరం! చూద్దాం! ఆ అదృష్టవంతుడు ఎవరో!" మహారాజు నవ్వుతూ అన్నాడు.

లాలస తల్లిదండ్రుల పాదాలను స్పృశించి, కళ్ళకు అద్దుకుంది. ఇద్దరూ ఆమె శిరస్సు మీద చేతులు ఉంచి, దీవించారు.

"చంచలా జాగ్రత్తగా వెళ్ళి.. జాగ్రత్తగా, తొంద రగా తిరిగి రండి!" మహారాణి ఆజ్ఞాపించింది.

"చిత్తం, మహారాణీ" చంచల వినయంగా అంది.

లాలస ద్వారం వైపు నడుస్తోంది. ఆమెకు ఇరువైపులా కొంచెం వెనుకగా చెలికత్తెలు వెళ్త న్నారు. రెప్పపాటు మరిచిపోయి తన గారాల కూతుర్ని చూస్తూ ఉండిపోయాడు కుబేరవర్మ.

"ఇప్పుడు చెప్పండి! అమ్మాయి నడక ఎవ రిదీ? మీదా మాదా?" మహారాణి చిరునవ్వుతో అడిగింది.

"పిచ్చి మహారాణీ! ఆడపిల్ల నడక ఆడవాళ్ళ నడకనే పోలి ఉంటుంది! నడకా, నడవడికా రెండూ తమవే!" కుబేరవర్మ మెప్పుగా అన్నాడు.

"ఇప్పటికైనా ఒప్పుకున్నారు!" మహిమాదేవి నవ్వుతూ అంది.

"ఒప్పుకోక చేసేదేముంది? హంసనడకలూ, మదగజగమనాలూ అన్నీ మీకే ఇచ్చాడు ఆ సృష్టి కర్త."

"పదండి...పూజాగృహంలో అర్చకుడు వేచి చూస్తున్నాడు. అర్చన ముగించాలి అమ్మాయి వచ్చేలోగా!"

**(ఇంకావుంది)**

# అలర్జీ - హోమియో చికిత్స

అలర్జీ అనే పదం మనము సర్వసాధారణంగా ప్రతీ రోజు వింటూ వుంటాము. అలర్జీ అనేది రోగనిరోధక వ్యవస్థకు సంబంధించిన ఒక రుగ్మత. వర్షాకాలం మెరిసే వేడి వేసవి నుండి ఉపశమనం ఇస్తుంది. అలాగే అది పలురకాల వ్యాధులతో ప్రాణాలు తోడేయనూ వచ్చు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా వర్షాకాలంలో ఒక అలర్జీ సమస్య వేధిస్తుంది. తుమ్ములూ, దగ్గులే కాదు ఒక్కోసారి శ్వాసతీసుకోవడము కష్టమవుతుంది. ఈ జలుబు మరియు దగ్గు సహజంగా వైరల్ జ్వరాలకు దారితీస్తుంది. ఈ వర్షాకాలంలో ఆస్తమా, అలర్జీ, బ్రాంకైటీస్, ఫ్లూ వంటి వ్యాదులు ఎక్కువ చూస్తాము. మన అధునిక జీవనం, పారిశ్రామిక ప్రాంతాలలో మరియు పెద్ద పట్టణాలలో వాతావరణ కాలుష్యం ఈ అలర్జీ ఒక పెద్ద కారణం.

అలర్జీతో ఇబ్బందులు పడేవారి బాధ వర్ణనాతీతం. వయసుతో నిమిత్తం లేకుండా చిన్నా పెద్దా అందరు శ్వాన కోశ అలర్జీలను కలిగించే వాటిలో ప్రధానమైనవి. అలర్జీతో బాధ పడేవారిలో ఏదో ఒక ప్రత్యేకమైన పదార్ధానికి దగ్గరగా వచ్చినప్పుడు శరీరంలోని రక్తంలో ఉండే ఇమ్యూనోగ్లోబిన్-ఇ అనే యాంటీబాడీస్ తో అలర్జీన్ కలవడం వల్ల హిస్టమిన్ విడుదల వుతుంది. దీని వలనే వ్యాధి లక్షణాలు ప్రారంభ మవుతాయి. మనిషి శారీరకతత్వము, వాతావరణం, వంశపారంపర్య చరిత్ర, గాలి, నీరు, ఆహారం వీటిలో కలిగే మార్పులు, కలుషితం వలన రక్తంలో జరిగే మార్పుల వలన ఈ అలర్జీ కొందరికి కొన్ని పదార్థములు, కొన్ని వస్తువులు అలర్జీ కారణం అవుతాయి.




**కారణాలు:** 1.దుమ్ము, పుప్పొడి రేణువులు. 2. పెంపుడు జంతువుల వెంట్రుకలు 3. ఘాటు వాసనలు, చల్లటిగాలి. 4. శీతలపానియాలు, ఐస్‌క్రీమ్‌లు. 5.వంశపారం పర్యం. 6.మస్కిటో రిపెల్లెంట్స్. 7.వాతావరణ మార్పులు.

**లక్షణాలు:** తుమ్ములు, ఆయాసం, శ్వాసలో ఇబ్బందులు, వాంతులు, ఉబ్బసం, ముక్కు కారడం, ఎర్రని దద్దుర్లు, కళ్లు దురద, కంటిపోర గుచ్చు కోవడం.

డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి



**వ్యాధి నిర్ధారణ:** సి.బి.పి, ఈఎస్ఆర్, ఇస్నోఫిల్ కౌంట్ (ఏఈసీ), ఐజీ.ఈ.యాంటీబాడీస్, ఎక్స్‌రే, ఫల్మనరీ ఫంక్షన్‌టెస్ట్, సిటీస్కాన్, అలర్జిక్‌ప్రొఫైల్.

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అలర్జీ నుంచి పూర్తిగా ఉపశమనంకలిగించే మందులు ఉన్నాయి. హోమియోచికిత్సతో అన్ని రకాల అలర్జిక్ సమస్యలు దూరమవుతాయి. హోమియోపతిలో అలర్జీకి మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. రోగ నిరోధక శక్తిని పెంచి వ్యాధి నివారణ త్వరితంగా అయ్యేలా చేయుడం జరుగుతుంది. అలర్జీ ఏ కారణం వలన వస్తుంది. ఎంత తీవ్రంగా వుంది, తీవ్రతను బట్టి మందులు ఇవ్వబడుతాయి. దీనికి హోమియోలో ఆర్సనిక్ ఆల్బ్, రస్టాక్స్, బెల్లడోన, ఆర్టికముటిన్స్, ఆరమ్‌డైఫిలమ్,ఇప్రెసియా, ఆలెయుంసెప మొదలగు మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణలో వాడితే అలర్జీ సమూలంగా తగ్గిపోతుంది.



# నడుంనొప్పికి ఆయుర్వేద చికిత్స

**ప్రస్తుత పరిస్థితుల్లో మానవుని జీవనం ప్రకృతి సహజ విధానాలకు విరుద్ధంగా ఉంటోంది. పెరిగి పోతున్న పని ఒత్తిడి, పోషకాహారం సరిగా తీసుకోక పోవడం వల్ల ఈ రోజుల్లో 40 ఏళ్లకే నడుంనడప్పి వస్తోంది. శారీరకంగా, మానసికంగా సమస్యలు కలిగించే నడుంనొప్పిని దూరం చేయాలంటే ఆయుర్వేద చికిత్సే ఉత్తమమైన మార్గం అంటున్నారు ప్రముఖ ఆయుర్వేద వైద్యులు డాక్టర్ మనోహర్.**

నేటి జీవనవిధానంలో ఆహారలోపాలు, అస్తవ్యస్తమైన దిన చర్యలు, స్వప్న విపర్యం అంటే రాత్రివేళ నిద్రపోక పోవడం, పగటిపూటనిద్రపోవడం వంటి అలవాట్లు శరీర వ్యవస్థను బాగా దెబ్బ తీస్తున్నాయి. ఆందోళన, మానసిక ఒత్తిడి కూడా అనేక అనారోగ్యలకు కారణ మవుతున్నాయి. వీటిలో అతిముఖ్యమైనది నడుంనొప్పి. ఆయుర్వేదశాస్త్రం నడుం నొప్పికి 'గృధ్రసీవాతం' గా నామకరణం చేసింది. తొంభైశాతం మంది తమ జీవిత కాలంలో ఎప్పుడో ఒక్క సారి నడుంనొప్పి బారినపడతారని కొన్నిఅధ్యయనాల్లో స్పష్టమయింది. **కారణాలు:** ఎక్కువసమయం ఒకే భంగిమలో కూర్చోవటం, స్థూలకాయం, ఎక్కువగంటలు వీపరితంగా శ్రమించడం, అతిగా బరువులు మోయడం, ద్విచక్రవాహనం మీద ఎక్కువ దూర ప్రయాణం చేయడం, రోడ్డు ప్రమాదాలు,దీర్ఘకాలికరుగ్మతలు, వంశ పారంపర్య వ్యాధులు ఇవన్నీ నడుంనొప్పికి కారణాలు. ఈ కారణాల వల్ల వాత ప్రకోపం జరుగుతుంది. ఫలితంగా ముందుగా పిరుదుల పైభాగాన స్తబ్ధతను, నొప్పిని కలిగించి ఆ తరువాత నడుం భాగం, ప్రత్యేకించి ఎల్-4, ఎల్-5 వెన్నుపూసల మధ్య ఉండే సయాటికా నరం మీద ఒత్తిడి పడటంవల్ల నడుంనొప్పి వస్తుంది. డిస్కులో వచ్చే మార్పులు. వెన్నుపూసల మధ్య ఉండే డిస్కుల్లో కొన్ని మార్పులు జరిగినప్పుడు డిస్కుల మీద ఒత్తిడి పెరుగు తుంది. వాపు రావడం, డిస్కుకి రక్త ప్రసరణ సరిగా లేక పోవడం, డిస్కు అరిగి పోవడం వంటి సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్కులలో వాపువస్తే అందులోనుంచి ద్రవం బయటకు వచ్చి మేరుదండం నుంచి వచ్చే నరాల పైన ఒత్తిడి పెరుగు తుంది. దీనివల్ల వెన్ను నొప్పి వస్తుంది. **లక్షణాలు:**నడుంనొప్పి వాపు, కాస్త శ్రమించినా సూదుల తో గుచ్చినట్లుగా నొప్పి తీవ్రంకావడం, కాళ్ళలో తిమ్మిర్లు, మంటలు ఉంటాయి. సకాలంలో చికిత్స అందకపోతే స్పర్శజ్ఞానం కోల్పోతారు.సమస్య తీవ్రమైతే మలమూత్రాల మీద నియంత్రణ కోల్పోయే ప్రమాదం ఉంది. పెయిన్ కిల్లర్స్ వాడకూడదు. పెయిన్‌కిల్లర్స్‌తో మలబద్ధకం, జీర్ణా శయ సమస్యలు వస్తాయి. వెన్నుసంబంధిత సమస్యలను వెంటనే గుర్తించి చికిత్స తీసుకుంటే ఈ వ్యాధిరాకుండా ఉంటుంది.

**ఆయుర్వేదచికిత్స:** నడుంనొప్పిసమస్యకు ఆయుర్వేద శాస్త్రం సూచించిన సమగ్రమైన చికిత్సా పద్ధతుల్లో నిదాన పరి వర్జనము, శమన చికిత్స, శోధనచికిత్స అని మూడు ప్రధానమైనవి ఉన్నాయి. **నిదానపరివర్జనము:** వ్యాధికి కారణమయిన విషయాలను పాటించక పోవడం. ఉదా॥ విరుద్ధ ఆహార, విహార సేవన (రాత్రి మేల్కొవటం, పగలు నిద్రపోవటం).**శమనచికిత్సలు:** వ్యాధితాలూకు దోషాలను శమింప చేయుటానికి తెచ్చే ఔషదాలు. ఇందులో రోగ బలాన్నిబట్టి, రోగిబలాన్నిబట్టి చూర్ణాలు, గటికలు, కషాయాలు, లేహ్యాలు, తైలాలు వంటి ఔషదాలు రోగికి ఇవ్వడం జరుగుతుంది. కానీఈ శమన చికిత్సవల్ల ఒక్కో సారి ప్రకోపించిన దోషాలుమళ్ళీ తిరగబడవచ్చు. అందుకే వ్యాధితీవ్రతను బట్టి శమన చికిత్సలతో పాటు కొందరికి పంచకర్మ (శోధన చికిత్స) కూడా అవసరం. ప్రకోపించిన దోషాలను(వాత, పిత్త, కఫ) దీని ద్వారా సమంగా చేసి శరీర శుద్ధిని, అగ్ని బలాన్ని పొందవచ్చు. ఆయుర్వేదంలోని స్వేద కర్మ ద్వారా వెన్నుపూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొదించి కీళ్లకదలికలను సులభతరం చేయువచ్చు. బిగుసుకుపోయిన కీళ్లను స్వేదకర్మ ద్వారా వదులుగా, మృదువుగా మార్చవచ్చు. **కటివస్తి:** ఇది ఆయుర్వేదంలోని ఒక విశిష్టప్రక్రియ. అరిగిపోయిన మృదలాస్థి (కార్టిలేజ్)కి రక్తప్రసరణ పెంచినొప్పి తీవ్రతను తగ్గించడంలో ఈ ప్రక్రియఎంతగానో ఉపయోగపడు తుంది. ఇదే క్రమంలో సర్వాంగధార చికిత్స కూడా వీరికి బాగా ఉపయోగపడుతుంది. వస్తికర్మ, ఆయుర్వేద శాస్త్రం లో వస్తికర్మచికిత్స అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించు కుంది. ఈ వస్తికర్మచిన్నపేగులు, పెద్దపేగులలోని ఎంటరిక్ నర్వస్ సిస్టమ్‌పై ప్రభావం చూపుతుంది. తద్వారా నాడీ కణాలలో ఏర్పడిన లోపాలను సరిచేసి బలం చేకూర్చ వచ్చు. అలాగే పక్వాశయ వాతస్థానంకాబట్టి ప్రకోపించిన వాతాన్నికూడా సహజస్థితికి తీసుకురావచ్చు.

**జాగ్రత్తలు:** అవసరమైన పోషకాహారం తీసుకుంటూ వైద్యులు సూచించిన విధానా లను అనుసరించడం చాలా ముఖ్యం. ఔషదచికిత్సల తరువాత క్రమం తప్పకుండా వ్యాయామం కూడా చేస్తే నడుం నొప్పి సమస్యనుంచి శాశ్వతంగా విముక్తి కలుగుతుంది.

డా. మనోహర్. M. D (Ayurveda)
స్టార్ ఆయుర్వేద

# లవ్ ఎట్ ఫస్ట్ సైట్

-పి.వి.డి.ఎస్.ప్రకాష్

**అర్ధరాత్రి వేళ... హఠాత్తుగా మెలకువొచ్చింది సూర్యానికి. ఆ తర్వాత నిద్ర పట్టలేదు. గదంతా పరుచుకున్న పల్చటి వెలుతుర్ని ఆస్వాదిస్తూ, మసగ్గా కనిపిస్తున్న ప్రతి వస్తువునీ అప్పుడే కొత్తగా చూస్తున్నట్లు చూస్తూ, సీలింగ్‌కి వేలాడుతూ గిర్రున తిరుగుతున్న ఫ్యాన్ రెక్కల్ని చూపుల్తోనే తడిమే ప్రయత్నం చేస్తూ, చేతివేళ్ళ సందులోంచి పాదరసంలా మౌనంగా జారిపోతున్న క్షణాల్ని లెక్క పెడుతూ...**

అయినా, ఆమెని మరచిపోలేకపోతున్నాడతను.

కనురెప్పల తలుపులు తెరచుకునేదాకా టపటపా బాదేయడం... కళ్ళ వాకిట్లోకి 'కల'వోకగా విచ్చేసి రంగుల కళ్ళాపి జల్లేయడం... లోపలికి 'రారమ్మని' ఎవరో తననే పిలుస్తున్నట్టు ఏ మొహమాటం లేకుండా దర్జాగా దూసుకొచ్చేయడం... అరే! గాలి పీల్చుకోవడానికి చోటు లేనంతగా గుండెల్లో మల్లెపూల మంచం వేసుకుని మరీ పడకేయడం...

'ఎవరు నువ్వు? నాతో నీకేం పని? అసలు ఇక్కడికెందుకొచ్చావు? అని ప్రశ్నించబోతే పెదవుల ప్రమిదలపై చిరునవ్వుల దీపాల్ని వెలిగిస్తూ, చూపుల్తో సూదులు గుచ్చేయడం... హాయిగానే ఉందతడికి.

ఆమె చూపుల్లో చూపులు కలుపుతున్న కొద్దీ ఒళ్ళంతా చలి గిలిపెడుతున్నట్లు... వయసుని వేసవి కమ్మేసినట్లు... గుండెల్లో కుండలకొద్దీ వెన్నెల వర్షిస్తున్నట్టు... పలకరింపులూ.. అన్ని రుతువులూ ఆమనిరాగాలతో 'హాయ్...' అని విష్ చేస్తున్నట్టు ఒకటే పలవరింతలూ.. అనిర్వచనీయానంద లోకాల్లో మునిగితేలుతున్నాడు సూర్యం.

ఆమె జ్ఞాపకాలతో అతడికి ప్రపంచమంతా ఉత్సవకళ! కేలండర్లోని పండుగలన్నీ కూడబలుక్కుని మూకుమ్మడిగా దాడి చేసినట్లు ఉక్కిరిబిక్కిరి! బోగి రోజున తెల్లవారుజామున చలిమంట వేసుకున్నప్పటి వెచ్చనైన అనుభూతి! వాకిట్లో పెట్టిన సంక్రాంతి ముగ్గు సొగసుని గుండె గుప్పెట్లోకి స్వాగతిస్తున్నంత ఆనందగీతి.

ఆమెని మళ్ళీమళ్ళీ చూడాలనే తపనే తపస్సు కాగా, రాత్రిని మెలకువ ఖాతాలోకి జమ చేస్తుంటే... కళ్ళు తెరిచినా, మూసినా ఆమె సమ్మోహన రూపమే!

అనూహ్యంగా ఎదురుపడి ఎదలో తిష్టవేసిన ఆ అందాల రాక్షసి ఒళ్లోకొచ్చి కనికరించేదెప్పుడు? అసలు ఆమె మళ్ళీ కనిపిస్తుందా? కనిపిస్తే ఎక్కడ... ఎలా?

తూర్పుదిశన ఆకాశం అరుణిమ పులుముకునే దాకా అతడి మదిని తొలిచేస్తూ ఇవే ప్రశ్నలు.

•••

నిజానికి నిన్నటివరకూ సూర్యం సూర్యమే! లోకంలో ఉన్నాడు కాబట్టి ఏదో ఊపిరి పీలుస్తున్నాడు. బతకాలి కాబట్టి తింటున్నాడు, తిరుగుతున్నాడు. ఉద్యోగం ఉంది కాబట్టి చేస్తున్నాడు. ఒంటిమీదికి పాతికేళ్ళు వచ్చాయి. కాబట్టి అమ్మానాన్నలు అరేంజ్‌చేసిన పెళ్ళిచూపులకెళ్తున్నాడు, వస్తున్నాడు.

అంతకుమించిన ఏ ఇంద్రజాలం అతడిని ఉక్కిరిబిక్కిరి చేయలేదు. అయితే... వీలైతే ఇప్పటికిప్పుడు పీకల్లోతు ప్రేమ తుఫానులో మునిగి పంచప్రాణాల్నీ కోల్పోవాలనీ, మృతసంజీవని లాంటి ప్రేమలో తడిసి, ఆరోప్రాణంతో ఊపిరి



పోసుకుని, బతికి బట్టకట్టాలని ఎంతగానో అనిపిస్తోందతడికి.

అలంకృత థియేటర్లలో సిల్వర్‌స్క్రీన్ సాక్షిగా పరుచుకున్న ఆకుపచ్చని ప్రకృతి మధ్య హీరోహీరోయిన్లు స్టెప్పులేస్తూ డ్యూయెట్లు పాడుతుంటే...




'ప్రేమమైకం' అతడిని గతంలో చాలాసార్లు కాటేసేది. మినీస్, మిడ్డీస్, షార్ట్స్‌లో దట్టించిన వయసు వసంతాల్తో వెండితెర అందాలు కవ్విస్తే... తమ కాల గమకాలతో మొదట్లో కదిలిపోయినా, తర్వాత్తర్వాత తనని తాను నియంత్రించుకునేవాడతడు. కారణం... తెర భామ 'ప్రేక్షకులందరికీ ప్రేయసే' అన్న మెచ్యూరిటీ థాట్ అతడిని వ్యామోహావేశంలో పడిపోకుండా కాపాడిందనే చెప్పాలి. అడపాదడపా పార్కులు, థియేటర్లలో చేతిలో చెయ్యేసుకుని యమదర్జాగా ఊరేగే జంటల్ని చూసినప్పుడు వారి వైఖరికి కించిత్ ఆశ్చర్యానికి లోనయ్యేవాడు. ఒకే కూల్‌డ్రింక్‌ని చెరొక స్ట్రాతో ప్రేమమధువుని జుర్రేసినంత సులువుగా జుర్రేస్తూ ప్రతిక్షణాన్నీ రొమాంటిక్‌గా మార్చేసుకుంటున్న రోమియో జూలియట్లలాంటి ప్రేమికులు ఎదురుపడ్డప్పుడల్లా అతడిలో అసూయ జ్వలించేది. తానూ అచ్చం వాళ్ళలాగే మారిపోవాలని ఎంతగానో తపించేవాడు. 'ప్రేమ మహిమ ఎన్న తరమా... ప్రేమే జీవన మధురిమా!' అంటూ కవిత్వాన్ని వెళ్ళగక్కేవాడు.

రెండక్షరాల ప్రేమ... వరించి వస్తే రెండు జీవితాలు, రెండు హృదయాలు ఒకటై సంగమించే దివ్యానుభూతి! అలాంటి అపురూపమైన ప్రేమ అరుదెంచే అరుదైన క్షణాల కోసం, ఆశనే శ్వాసగా కళ్ళింతలు చేసుకుని మరీ నిరీక్షించేవాడు. మొదట్లో చూపులు, తర్వాత మాటలు.. తర్వాత్తర్వాత ఓ ఏకాంత సంకేత స్థలంలో వీలు చూసుకుని 'నువ్వంటే ఇష్టమ'ంటూ చిన్నిగుండెని ఆమె పాదాల ముందు నైవేద్యంగా సమర్పించడం...

ఓహ్! ప్రేమంటే మనసంతా ఓ కవ్వింత... ఓ థ్రిల్లింత...

అంతేనా! 'ప్యార్ కర్‌నా హైతో డర్‌నా నహీ..' అప్పుడెప్పుడో విన్నపాట గుండెగొంతులో మాటిమాటికీ పల్లవిస్తుంటే, ఏదో ఒకనాడు తనూ ధైర్యం చేసి ఒంటరితనంతో వేగిపోతున్న సాయంత్రాల్ని చలిమంత్రాల్తో వెలివేయాలని ప్రతినబూనేవాడు. ఎవర్నో ఒకర్ని ఎంచుకుని, ప్రేమించి, జీవిత భాగస్వామిగా ఆహ్వానించి నూరేళ్ళ తోడు తెచ్చుకోవాలని అస్తమానం కలలు కనేవాడు.

అయితే, ఎవర్ని ప్రేమించాలి? ఎలా ప్రేమించాలి? అన్న దగ్గరే అతడికి సంశయం... ఎడతెగని సందిగ్ధత.

ఆఫీస్ ప్రిమిసెస్‌లో, కాలేజీ క్యాంపస్‌లో, థియేటర్ ప్రాంగణాల్లో కళ్ళుచెదిరే అందాలతో అమ్మాయిలెంతోమంది కనిపిస్తూ కవ్విస్తున్నా...

ఆ కవ్వింపులన్నీ కళ్లవాకిళ్లదాకే తప్ప గుండె లోతుల్ని స్పృశించకపోవడం.... అతడికి తరచూ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

'మనసును గెలిచే యువరాణి ఎక్కడ దాక్కుందో?" అహర్నిశలూ అన్వేషిస్తుండగా... ఆమె కనిపించింది నిన్న!

●●●

నిన్న ఆఫీసైపోయిన తర్వాత ఏం తోచక, రూం దగ్గర్లోనే ఉన్న ఆలయానికి వెళ్ళాడు సూర్యం. రాత్రి ఏడుగంటల సమయంలో ఒక్కసారిగా కరెంట్ పోయింది. గర్భగుడిలో అమ్మవారి విగ్రహం ముందు ప్రమిదల్లో దీపాలకాంతితో పాటు పూజారి చేతిలో పళ్ళెంలోని హారతి వెలుగు తప్పిస్తే... చుట్టూ అంధకారం. విద్యుత్ రాకకోసం ఎదురుచూస్తూ అందరిలాగే అతడూ... ఇంతలో ధ్వజస్తంభానికి కొద్దిదూరంలో చీకట్లను వెలిగిస్తూ ఓ చిరుదివ్వె! కళ్ళింతలు చేసుకుని అటువైపు చూశాడు ఆసక్తిగా సూర్యం. అయిదడుగుల ఎత్తులో ఉన్న దీపస్తంభం అది. ఆ స్తంభం చుట్టూ వరుసగా కొన్ని ఇత్తడి ప్రమిదలు... ఆ ప్రమిదలు వెలిగిస్తూ కొంతమంది ప్రమదలు. అయితే, అక్కడ అనూహ్యంగా ఆ దేవత ప్రత్యక్షమైంది. ఒక్కో ప్రమిద వెలిగిస్తూ దీపసుందరిలా ఆమె.

**మొదటి ముద్దు, మొదటి ఎంగిలి, మొదటి కౌగిలి... వందేళ్ళ జీవితాన్ని నడిపించే ఇంధనాన్ని ఇవాళే సమకూర్చుకోవాలంటూ ఆమె ఎర్రెర్రని పెదాల్ని ఆకలిగా అందిపుచ్చుకున్నాడతడు. ఒక్కసారిగా ఆమెను బెడ్‌పై ఎత్తికుదేశాడు. ఆమెపై దూకి, ఆత్రంగా అల్లుకుపోయాడు.**

మొదటి ప్రమిదను వెలిగించే సమయంలో కాస్త వంగి ఉన్న భంగిమ, వయసు వసంతాల్ని చుట్టుకున్న పచ్చటి పట్టు పరికిణీ, ఎర్రటి ఓణీ... రెండో ప్రమిద వెలిగిస్తున్నప్పుడు రసవత్తర ప్రబంధకావ్యం మధ్యలో నలిగిన పేజీలా... నడుంపై సన్నటి ఓ మెలిక. ఇంకో ప్రమిద వెలిగిస్తున్నప్పుడు మన్మథుడి జెండాలా రెపరెపలాడే పైట చటుక్కున జారిపోవడంతో... పొగరుగా ముందుకు పొడుచుకొచ్చిన పాలపుంతల దర్శనం. అలా ఆమె ఒక్కో ప్రమిదా వెలిగిస్తుంటే.. ఒక్కో అందం వెలికొస్తుంటే.. అనంతానంతమై ఆనందశిఖరాల్ని తాకుతూ సమ్మోహనాల వల వేస్తుంటే.. విస్మయ నేత్రాలతో వీక్షిస్తూ అతడు...

శంఖాకారపు మెడ, ఆ మెడలో సన్నని గొలుసు, ఆపై చిన్ని వంపున్న గడ్డం, ఆకాశంలోని సంధ్యారుణిమను ఇంత తీసుకుని పెదాలకు అద్దుకున్న వైనం, ఎర్రెర్రని ఆ పెదాలనుంచి ధవళ కాంతుల్తో జలజలా జాలువారుతున్న జాజిమల్లెల సోయగాల చిరునవ్వులు, ఆ హాసవిలాసాలకే సొట్టపడుతూ చెక్కిలి, ఆ పక్కనే సంపెంగ నాసిక, కన్రెప్పలు చిత్రంగా టపటపలాడిస్తుంటే.. నక్షత్రాల్లా వెలుగుతూ కళ్ళు, తీర్చిదిద్దినట్లున్న కనుబొమ్మలు, మధ్యలో దోసగింజంత ఎర్రనిబొట్టు, ఎక్కణ్ణుంచో తెరలు తెరలుగా వీస్తున్న గాలికి నుదుటిపై పడుతూ అల్లరల్లరి చేస్తున్న ముంగురులు... అంతేనా? ముందర ఉన్న అందాలు చాలవన్నట్లు, వెనుక సిగలోంచి దోబూచులాడుతూ పలకరిస్తున్న పరిమళాల మల్లెలు, మంత్రగంధం చల్లే మరువాలు...

కరెంట్ వచ్చింది. అతడి కళ్ళవాకిళ్ళల్లో సొగసు సోయ'గాలా'ల హరివిల్లులా ఆమె ముగ్ధ స్నిగ్ధ రూపం సంపూర్ణంగా ఆవిష్కృతమైంది.

"హాట్సాఫ్ బ్రహ్మదేవుడా! నీలోనూ అద్భుతమైన ఆర్టిస్ట్ ఉన్నాడు. మనసుదోచే మహత్తర శిల్పాన్ని మలచావు' అభినందించకుండా ఉండలేకపోయాడు సూర్యం. ఆమె నెమ్మదిగా కదిలి కడలిలా అలా అలా అతడి ముందునుంచే వెళ్తుంటే... వెర్రిగాలి తాకిడికి ఆమె పల్చటి పయ్యెద విసురుగా వచ్చి అతడి ముఖాన్ని కమ్మేసింది. ఆమె ఒంటిపరిమళం అతడిని ఉక్కిరిబిక్కిరి చేసింది. 'ఏమి హాయిలే హలా' అనుకోకుండా ఉండలేకపోయాడు సూర్యం. తేరుకుని కళ్ళుతెరిచేలోపలే ఆమె గర్భగుడి దగ్గరకు వెళ్ళడం.. దేవతామూర్తికి నమస్కరించడం... అర్చకుడు ఆమె శిరసున శఠగోపం ఉంచి ఆశీస్సులందించడం... ఆ వెంటనే అక్కణ్ణుంచి ఆమె అదృశ్యమవడం.. క్షణాల్లోనే జరిగిపోయాయి. 'ఉసూరు'మంది సూర్యం హృదయం.

ఆమె వెళ్ళిపోకుండా నిలువరించలేని తన నిస్సహాయత మీద అతడికి అంతులేని కోపం. ఆమెని తను కళ్లారా చూశాడు. కానీ, ఆమె తనని చూసిందో... లేదో? సందేహం. ఆమె నిల్చున్న నేలపైనే తానూ నిల్చున్నానని... ఆమె పీల్చి వదిలిన గాలినే తానూ పీల్చి ఆ కాసేపు బతికానని చెప్పలేక పోయినందుకు పిచ్చిపిచ్చిగా ఉందతడికి. ఆ తర్వాతనుంచీ ఆమె మాటిమాటికీ గుర్తు రావడం... ఆమె ఆలోచనల్తోనే అనుక్షణం కాలం గడవడం.. అప్పుడప్పుడూ నవ్వుకోవడం... 'ఎల్.ఒ.వి.ఇ' అంటే ఇదేనా? 'ఓరచూపుకే లొంగిపోవడం... దోరనవ్వుకే పొంగిపోవడం... ఆమెనే తలచుకుంటూ రాత్రంతా మేలుకోవడం... అదేనా ప్రేమంటే? ఒంటిని తాకిన ఈ ప్రేమజ్వరం మహామత్తుగా, గమ్మ

## అటూ ఇటూ అయినా సరే...

హన్సిక కోలీవుడ్‌ని వదిలేసి టాలీవుడ్ వైపు దృష్టి మళ్ళించింది. అసలు ఏం జరిగిందో తెలియదు కానీ, గత కొన్ని నెలలుగా హన్సిక కోలీవుడ్‌లో సినిమాలు చేయడం లేదు. ప్రస్తుతం తెలుగులో ఓ సినిమా మాత్రమే చేస్తోంది. కోలీవుడ్‌లో మొన్నటి వరకు కోటి రూపాయల దాకా తీసుకున్న హన్సిక, రెమ్యునరేషన్ కొద్దిగా అటూ ఇటూ అయినా సరే తెలుగుసినిమాలే చేయాలన్న నిర్ణయంలో ఉందట! కాకపోతే కోలీవుడ్‌లో బొద్దుతనం ముద్దుగాబట్టి సరిపోయింది. అదే బొద్దుతనం టాలీవుడ్‌కి సరిపోదు కనుక బరువు తగ్గే పనిలో బిజీ అయిందట!

త్తుగా ఉందంటే, తను ప్రథమ వీక్షణంలోనే పీకల్లోతు ప్రేమలోపడిపోయాడా? తలచుకుంటేనే చిన్ని గుండె పట్టనంత సంతోషం.

వారంలోని ఏడు రోజుల్లో ప్రతి ఉదయం, ప్రతి సాయంత్రం.... మొత్తం పద్నాలుగు సార్లు ఆ గుడిచుట్టూ ప్రదక్షిణాలు చేసి ఉంటాడు సూర్యం. ఆమె కనిపించలేదు. నిరాశ, నిస్పృహలు వెల్లువెత్తుతుంటే.. ఉన్నచోట ఉండలేకపోతున్నాడు. ఏ పనీ చేయలేకపోతున్నాడు. ఇంతలో "లక్షణమైన సంబంధం! అమ్మాయి దీపకళికలా చూడచక్కగా ఉంది. నువ్వూ చూసి ఓకే అనుకుంటే ఈ వేసవిలోనే నీ పెళ్ళి" ఓ మధ్యాహ్నం వేళ తండ్రి వెంకట్రావు ఫోన్ చేసి సమాచారం. అప్పుడు కూడా అతడికి ఆమే గుర్తొచ్చింది. ఆమెకాకుండా వేరొకర్ని తన జీవితంలోకి ఆహ్వానించగలడా? ఆరునూరైనా ఆమెతోనే తన పెళ్ళి" తనకు తాను ఎంత చెప్పుకుంటున్నా, ఎంత వెదికినా కనిపించని ఆమెని కనిపెట్టడమెలా? ఆమె కనిపించే మార్గం దొరికేదెలా? రెండ్రోజులకోసారి తండ్రి ఫోన్ చేస్తూ పెళ్ళిచూపులకి రారమ్మని ఒత్తిడి చేస్తుంటే అన్యమనస్కంగా తిరస్కరించడం కూడా రొటీనైపోయింది.

'సూర్యం! నీ మనసెక్కడో ఉన్నట్లుంది. ఆ విషయం నీ పర్ఫార్మెన్సే చెప్తోంది" క్యాబిన్‌లోకి పిలిచి మరీ బాస్ కళ్లింతలు చేసి కోప్పడుతున్నా కనీస మాత్రంగా స్పందించ లేకపోతున్నాడు.

"ఏమైందిరా నీకు?" కొలీగ్స్ యక్ష ప్రశ్నలు.

"ప్రేమైంది!" పైకి చెప్పలేకపోయాడు.

"హఠాత్తుగా కనిపించిన ఆమె బాగానే డిస్టర్బ్ చేసింది. ఈ డిస్టర్బెన్స్‌ని అధిగమించడమెలా?" ఆలోచిస్తున్నాడు సూర్యం.

పెళ్ళివేడుక! పురోహితుల వేదమంత్రాల సాక్షిగా, ఆత్మీయుల ఆశీర్వచనాలతో రెండు జీవితాలు ఒకటవుతున్న శుభ ఘడియ! ఫ్రెండ్స్‌తో కలిసి అతిథిగా వెళ్ళిన సూర్యం కల్యాణ మండపంలో పెళ్ళికూతురిని చూడగానే స్థాణువే అయ్యాడు. ఆశ్చర్యంగా ఆమె... ఇప్పుడు మరొకరితో తాళి కట్టించుకోవడం కోసం మధుపర్కాలతో తలొంచి మరీ సిద్ధంగా ఉంది. ఒక్కక్షణం కూడా ఆ దృశ్యం చూడలేక పోయాడు సూర్యం. అంతే, ఎదురుగా కనిపించినవారికి చేతిలోని గిఫ్ట్ అందించి, వడివడిగా అక్కణ్ణుంచి జారుకున్నాడు.

"సూర్యం... సూర్యం" వెనుకనుంచి ఫ్రెండ్స్ పిలుస్తున్నా ఆగలేదు. పరుగులాంటి నడకతో బయటికి వచ్చేశాడు. ఒళ్ళంతా చెమటలు... ఊపిరి పీల్చుకోలేనంతగా ఆయాసం...

"ఎంతమోసం చేసింది?" గుండె గొంతుకలో కొట్టుమిట్టాడుతుండగా ఒక్కసారిగా మెలకువ వచ్చింది సూర్యానికి.

"అర్ధరాత్రి వచ్చిన కల నిజంగానే భయపెట్టింది" మంచినీళ్ళు తాగి మళ్ళీ పడుకున్నాడు. ఆపై మళ్ళీ నిద్రరాలేదు. అదే కల గుర్తొస్తుంటే మాటిమాటికీ ఉలికిపాటు.

"ఆ కలే ఎందుకు నిజం కాకూడదు? తనూ పెళ్ళీడు ఆడపిల్లే! ఎవర్నో పెళ్ళి చేసుకోకూడదని తనెంతలా అనుకున్నా ఒక్కోసారి వాస్తవాలు కఠినంగానే ఉంటాయి. ఒకవేళ ఆమెకి పెళ్ళయినా, ఆ సమాచారం తనకు అందే అవకాశం కూడా లేదు. ఒక్కసారి మెరుపులా తళుక్కుమని మెరిసి మాయమైన ఆమె గురించి నిరీక్షించడం తెలివైన వాళ్ళ లక్షణం కాదేమో?

"ఈ వాతావరణం అనుక్షణం ఆమెనే గుర్తు చేస్తుంటే... ఒక్కసారి ఇంటికెళ్ళివస్తే బాగుంటుందేమో?" అనుకున్నదే తడవు, ఆఫీస్‌కి ఫోన్‌చేసి టుడేస్ లీవ్ చెప్పేశాడు. ఆ తర్వాత హుటాహుటిన తన ఊరెళ్ళే బస్ ఎక్కేశాడు. పదేపదే పిలిచినా ఏ మాత్రం స్పందించని కొడుకు ఎటువంటి ముందస్తు సమాచారం ఇవ్వకుండానే గడప తొక్కేసరికి, సూర్యం తల్లిదండ్రుల ఆనందం అంతా ఇంతా కాదు.

"నువ్వు ఇంటికి వస్తే గోదారికి పుష్కరాలొచ్చినంత ఆనందంగా ఉందిరా..." అంటూ తండ్రి వెంకట్రావు గుండెలకు హత్తుకుని లోనికి తీసుకెళ్ళాడు. తల్లి కళ్ళల్లో ఆనందతాండవం. కని, పెంచి, ఇంతవాడిని చేసి... ఇంకా ఓ ఇంటివాడిని చేసేందుకు తెగ తాపత్రయపడుతున్న వారి ప్రేమ ముందు తన ప్రేమ ఏ మాత్రం గొప్పది? కొడవలిలాంటి ప్రశ్న అంతరంగాన్ని తొలిచేస్తుంటే విలవిలలాడాడు. రెండు ప్రేమల్ని ఇలా తాసులో తూచినట్లు తూచడం అన్యాయం, అక్రమం! ఏ ప్రేమకి ఆ ప్రేమే అపురూపం, అన్విరచనీయం! తల్లిదండ్రుల ప్రేమ గొప్పదే! అంతమాత్రాన వయసు ముంగిట్లో చివురించే వలపుని చిన్నచూపు చూడడం కూడా భావ్యం కాదు. ఆ తరహా ఆలోచన ఒంటిమీద కొచ్చిన వయసునీ, అద్భుతమైన అందానికి స్పందించే మనసునీ అవమానపరచడమే... అనుకున్నాక సూర్యం మనసుకి ఊరట కలిగింది.

"ఎక్కడో దూరంగా సిటీలో ఒంటరిగా ఉంటూ నువ్వు ఇబ్బందిపడేకన్నా, ఓ ఇంటివాడవైతే మాకెంతో సంతోషం" అన్నాడు వెంకట్రావు. "అమ్మాయి పేరు శిరీష. వయసు ఇరవై మూడు. ఎత్తు అయిదడుగుల అయిదంగుళాలు. చూడ చక్కని అందం. ఓసారి నువ్వూచూస్తే 'మేడ్ ఫర్ ఈచ్ అదర్ అనుకుంటావు" అన్నాడు.

అంతేకాదు "రేపు ఉదయాన్నే ఆడపెళ్ళివారింటికి మనం వెళ్తున్నాం" హుకుం జారీచేశాడు. తల్లి సుశీల కూడా అదే మాట చెప్పింది. మజ్నూ కళ్ళకు లైలాయే అందగత్తె. వారి మాటల్ని నమ్మాలనిపించలేదు సూర్యానికి. అలాగే సూర్యం కళ్ళకి ఆమె ఒక్కర్తే అందగత్తె!

ఆ మర్నాడు తల్లిదండ్రులతో కలిసి అన్యమనస్కంగానే పెళ్ళిచూపులకు హాజరయ్యాడు.




టీనేజ్ యువతీ యువకులలో వయస్సు పెరిగే కొద్దీ, వారిలో కామవాంఛలు కూడా ఎక్కువగానే పెరుగుతుంటాయట! తమలో ఏర్పడే సెక్స్ కోరికలను నిగ్రహించుకోలేని టీనేజర్లు పక్కదార్లు తొక్కుతారని సెక్స్ వైద్యులు అంటున్నారు. ఇందు కోసం విచ్చలవిడిగా డబ్బులు వెచ్చించేందుకు సైతం ఏమాత్రం వెనుకంజ వేయటం లేదని కొన్ని సర్వేలు చెబుతున్నాయి.

## టీనేజర్లలో ఆ కోరికలు ఎక్కువే!!

టీనేజ్‌లో శృంగారాన్ని సవ్యంగా అనుభవించని వారు జీవితంలో చాలా కోల్పోతారని కూడా నిపుణులు హెచ్చరిస్తున్నారు. అందుకే మోడ్రన్ యూత్ తమ సెక్సువల్ కోరికలు తీర్చుకునేందుకు ఉవ్విళ్లూరుతూ ఎక్కువగా ఖర్చు పెట్టేందుకు సిద్ధపడుతున్నట్లు ఈ సర్వేలు చెబుతున్నాయి. అందు కోసం ఎక్కువ డబ్బు సంపాదించేందుకు, ఎక్కువ కష్టపడేందుకు సైతం వారు సిద్ధమవుతున్నారట!



టీనేజర్లు కోరికలు తీర్చుకునేందుకు ఉవ్విళ్లూరడానికి కారణం అసలు శృంగారం అంటే ఏమిటో తెలుసుకోవాలన్న తపనేనట. ఆ తపన వల్లే అమ్మాయితో అబ్బాయి, అబ్బాయితో అమ్మాయి సంబంధాలు పెంచుకోవడానికీ, ఆ తరువాత ప్రేమలో మునిగి తేలేందుకూ ప్రయత్నిస్తారట! వీరిలా ప్రయత్నించడానికి ఇంకా 237 ఇతర కారణాలున్నట్లు చెబుతున్నారు సెక్స్ నిపుణులు.

ఇంకొక ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే, టీనేజ్‌లోనే శృంగార అనుభవాలను పొందుతున్న వారి సంఖ్య క్రమక్రమంగా పెరుగుతోందట! ఈమధ్యనే ఐర్లాండ్‌లో ఎనిమిది నుంచి 18 ఏళ్ల వయసులోని పిల్లలపై చేసిన సర్వేలు ఆశ్చర్యకరమైన విషయాలను వెల్లడిస్తున్నాయి. ఐర్లాండ్‌లో 230 స్కూళ్లలో 13,500 మంది విద్యార్థులపై హెల్త్ సర్వే నిర్వహించారు. ఈసర్వేలో పాల్గొన్న విద్యార్థినీ, విద్యార్థులు చాలామంది ఇప్పటికే తమకు శృంగార అనుభవాలు ఉన్నట్లు చెప్పారట. అందులోనూ పేద, మధ్యతరగతి పిల్లలే సెక్స్ పట్ల అధిక ఆసక్తి చూపుతున్నట్లు సర్వే ద్వారా వెల్లడైంది.

పరిచయాలు, చిర్నవ్వుల పలకరింపుల తర్వాత ఓ పళ్ళెంలో కొన్ని స్వీట్లు, కారప్పూసతో ఆత్మీయ ఆతిథ్యాన్నందజేశారు ఆడపెళ్ళివాళ్ళు.

“కతికితే అతకదు” అన్నాడు నవ్వుతూ వెంకట్రావు.

“ఇదేం భోజనం కాదు కదండీ. మనందరం కలుసుకున్న శుభవేళ నోటిని తీపి చేసుకుంటున్నాం. అంతే” బదులిచ్చాడు శిరీష తండ్రి సుబ్బారావు. వాళ్ళమాటల్ని ఎంజాయ్ చేయలేక పోతున్నాడు సూర్యం.

కాసేపటి తర్వాత ‘అమ్మాయిని తీసుకురండి’ అన్న పెళ్ళిపెద్ద సూచన. ఆ తర్వాతి క్షణాల్లోనే పక్కనే ఉన్న ఓ గది డోర్ కర్టెన్ కదిలిన అలికిడి. పెళ్ళికూతురు వస్తోందన్న సంకేతంలా పాదాల చిరుగజ్జెల సవ్వడి.

శిరీష వచ్చి కూచున్నట్లు తెలుస్తూనే ఉంది. తలెత్తి చూసేందుకు ధైర్యం చాలడం లేదు, సూర్యానికి. గతంలో ఒకట్రెండు పెళ్ళిచూపుల కెళ్ళిన అనుభవం ఉన్నా, ఈ తంతు ఎప్పటికప్పుడు కొత్తగా, గమ్మత్తుగానే ఉంటుంది.




“ఒకర్నొకరు ఇప్పుడే చూసుకోండి. అలా సిగ్గుపడితే లాభం లేదు” ఎవరో అంటున్నారా మాటల్ని.

“అబ్బాయీ! నువ్వయినా కళ్ళెత్తి అమ్మాయిని చూడరాదా?” పెళ్ళిపెద్ద దగ్గర్నుంచీ సూచన వచ్చింది.

ఇక లాభం లేదనుకుని నెమ్మదిగా కనురెప్పలెత్తి మరీ చూపులు సారించాడు, ఆమెవైపు.

సృష్టికర్త బ్రహ్మ ఈ లోకంలోకి వచ్చిన ప్రతీ ఒక్కరికోసం మరొకర్ని కచ్చితంగా పుట్టించే ఉంటాడు. అయితే ఆ ఒక్కరు ఎవరో ఎక్కడున్నారో తెలీకే తికమక అంతా!

“తనూ....” ఆశ్చర్యం, ఆనందం ఒక్కసారే ముప్పిరిగొన్నాయి సూర్యాన్ని. తనకోసం మాత్రమే పుట్టిన అమ్మాయి చిరునామా చిక్కితే చిక్కుముడి వీడి బ్రహ్మముడి పడ్డట్లే... అని తాను నమ్మిన సిద్ధాంతమే నిలువెత్తు రూపం దాల్చి ఎదురుగా కూచున్నట్లనిపించిదతడికి.

ఆమె కనిపించింది. గుళ్ళో ఎదురై ఎదను దోచిన దేవతే ఇలా కనికరించి కనిపించేసరికి... అతడి ఆనందానికి హద్దులు లేవు.

“అమ్మాయీ... నువ్వూ అబ్బాయినోసారి చూసుకుంటే..” ఆ మాటలకి ఆమెలో చిన్న కదలిక మొదలైంది. సిగ్గుభారంతో వాలిపోతున్న కనురెప్పల్ని బలవంతంగా ఎత్తి మరీ అతడి చూపుల్తో చూపులు కలిపిందామె.

“నువ్వు నచ్చావు. నేను నీకు నచ్చానా?” కళ్ళతోనే ప్రశ్నిస్తున్నాడు సూర్యం, ఆమెని.

‘నచ్చావ’న్నట్లు ఆమె చెక్కిలిపై అరుణిమ చెప్పకనే చెప్పింది.

నెల్లాళ్ళ తర్వాత ఓ రాత్రి...

“లవ్ ఎట్ ఫస్ట్ సైట్ ఫెంటాస్టిక్” అంది శిరీష సూర్యం కౌగిట్లో ఒద్దికగా ఇమిడిపోతూ.

“తొలిచూపు ప్రేమా?” అన్నాడు కంగారుగా సూర్యం, ఆమె గురించి తను పడిన తపనంతా తెలిసిపోయిందేమోననే బిడియంతో.

“ఎందుకలా కంగారు పడుతున్నారు?” అడిగింది శిరీష.

“కంగారా... లేదే?” అన్నాడతడు.

ఆ తర్వాత కాస్త నెమ్మదించాక- “ఇప్పటి దాకా జీవితంలో ఎన్నో రాత్రులొచ్చినా... ఇవాళ్టి ఈ రాత్రి మాత్రం మనకు ప్రత్యేకం కదూ” అన్నాడు ఆమెని మరింత దగ్గరగా తీసుకుంటూ.

“ఔను... నిజమే! కానీ, చూసిన మొదటి క్షణంలోనే ప్రేమ పుడుతుందని సినిమాల్లో చూపిస్తుంటే ఏమో అనుకున్నా! జీవితంలో రుజువయ్యాక ప్రేమే అనుకోవాల్సి ఉంటుంది కదూ”.

“ఔను... నిజమే! నిన్ను చూసిన వెంటనే పోగొట్టుకున్న నా మనసు... మళ్ళీ పెళ్ళిచూపుల్లో నువ్వు కనిపించాకే కుదుట పడింది. గుండెకొట్టుకుని మనిషిని బ్రతికించే ‘లబ్‌డబ్’ శబ్దం కూడా ‘లవ్‌లవ్’ అనిపించిందంటే అదంతా లవ్ ఎట్ ఫస్ట్ సైట్ మహిమే! ఆరోజు ఆలయంలో నిన్ను చూసిన తర్వాత మొదలైన ప్రేమకథంతా నా కళ్ళల్లో చదివేసి ఉంటావుకదూ” అన్నాడతడు దొరికిపోయిన దొంగలా ఫోజిస్తూ.

“అంటే... మీరూ తొలిచూపు ప్రేమలో పడ్డారా?” అడిగింది శిరీష.

“అంటే... నువ్వూ...” సందేహంగా అడిగాడు సూర్యం.

“పీకల్లోతు ప్రేమలో పడిపోయాను. ఆరోజు కోవెల్లో దేవతార్చన కోసం వచ్చి మీతో ప్రేమలో పడిపోయాను” చెప్తుంటే అవాక్కయిపోవడం సూర్యం వంతైంది.

“కరెంట్ పోయినపుడు ధ్వజస్తంభం దగ్గర ఒక్కో ప్రమిదను వెలిగిస్తూ మీ కళ్ళల్లో వెలుగుల్ని చూశాను. కరెంట్ వచ్చాక గర్భగుడి దగ్గరికి రాబోతుండగా... నా మనసుని గ్రహించిందేమో సిగ్గులేని నా పైట వేగంగా దూసుకొచ్చిన గాలి తాకిడికి ఒక్కసారిగా ఎగిరెళ్ళి మీ ముఖాన్ని వరదలా చుట్టేసింది. ఆ తర్వాతనుంచీ కళ్ళు మూసినా, తెరిచినా మీ రూపమే నన్ను వెంటాడుతుండేది. ఎవరికి చెప్పుకోవాలో తెలీదు. ఆ ఆరాటం నుంచి ఎలా సాంత్వన పొందాలో అస్సలు తెలీదు. తిరిగి మళ్ళీ మిమ్మల్ని కలుసుకుంటానో లేదోకూడా తెలీని అయోమయ అవస్థ. తప్పక కలుసుకోవాలనే తపన. చిందరవందర గందరగోళంగా మారిపోయింది మనసు. జీవితాన్ని మీతో తప్ప మరెవరితోనూ పంచుకోలేనేమోననిపించేది. గుండెల నిండా దిగులు. కళ్లనిండా జీవనదులు. క్షణక్షణం నరకం అనుభవించానంటే నమ్మండి’ తన కథే శిరీష నోట మళ్ళీ వింటున్నాడు సూర్యం.

“నా అడ్రస్ తెలీదు కదా... మళ్ళీ ఎలా కలుసుకుంటామనుకున్నావు?” అడిగాడు సూర్యం.

“ఏమో... ఆ లాజిక్ తెలీదు కానీ, మిమ్మల్ని కలిపి మేజిక్ చేసిందీ ప్రేమ. ప్రేమలో ఉన్న బలం అదేనేమో?” అంటూ మీకూ నేను నచ్చాను కదూ” అడిగింది శిరీష తలెత్తి సూర్యం గడ్డాన్ని నెమ్మదిగా నిమురుతూ.

“మనిద్దరి కథ ఒక్కటే! ముందుగా నువ్వు బయటపడ్డావు. ఇక, బయటపడాల్సింది నేనే” అంటూ ఆమెను అలా తమకంగా చూస్తూ తన్మయంలో మునిగిపోయాడు సూర్యం. కాస్త తేరుకున్న తర్వాత... ఆమెనొక్కసారిగా డబుల్ కాట్ బెడ్‌పై ఎత్తికుదేశాడు. ఆపై తనూ ఆమెపై దూకాడు.

“అరే.. ఏమైందీ?” అడిగింది ఉప్పెనలా చుట్టుముట్టేస్తున్న అతడిని నిలువరించే ప్రయత్నాన్ని అసలే మాత్రం చేయకుండా...

“మొదటిరాత్రి... మొదటిముద్దు... మొదటి ఎంగిలి... మొదటికౌగిలి... వందేళ్ల జీవితాన్ని నడిపించే ఇంధనాన్ని ఇవాళే సమకూర్చుకోవాలి” అంటూ ఎర్రెర్రని పెదాల్ని ఆకలిగా అందిపుచ్చుకున్నాడు సూర్యం.

“అధరామృతం బాగుంది” అంటూ మళ్ళీ మళ్ళీ ఆమె పెదాల్ని కొరికేస్తున్నాడు. ఆమెకూడా అతడిని తమకంతో చుట్టేస్తూ- ‘లవ్ ఎట్ ఫస్ట్ సైట్ జిందాబాద్’ అంది గుసగుసగా.

**సెల్: 90005 44160**



చలికాలం వచ్చిందంటే చాలు చర్మ సమస్యలు పెరుగుతుంటాయి. చలికి చర్మం పగుళ్లు, పెదాలు, కాళ్ల పగుళ్లు, పొడిబారిపోవడం, ఎంత మేకప్ వేసుకున్నా సరే చర్మం పొడవుతూ ఉంటుంది. ఇక ఆయిల్‌స్కిన్ ఉన్న వాళ్లతో పోల్చుకుంటే డ్రై స్కిన్ ఉన్నవాళ్లకైతే ఈరకమైన ఇబ్బందులు మరీ ఎక్కువ! కొన్ని జాగ్రత్తలు పాటిస్తే ఈ చలికాలంలో కూడా మీ చర్మాన్ని సురక్షితంగా ఉంచుకోవచ్చు. మరి ఆ జాగ్రత్తలేంటో తెలుసుకుందామా?

# చలికాలంలో చర్మసంరక్షణ

చర్మంలో తేమ శాతం తగ్గడం వల్ల, చలికాలంలో చర్మం పొడిబారినట్లు కనబడుతుంది. అంతేకాకుండా వాతావరణంలో వచ్చే గణనీయమైన మార్పుల కారణంగా చర్మం ప్రభావితమవుతుంది. ఇదే అనేక చర్మ సమస్యలకు దారి తీస్తుంది.

### అధిక గాఢత వద్దు

చలికాలంలో మామూలు సబ్బులకు బదులుగా గ్లిజరిన్‌తో కూడిన సబ్బులు వాడితే మంచిది. అంతేతప్ప అధిక గాఢత కలిగిన సాధారణ సబ్బులను ఉపయోగించవద్దు. చలికాలంలో వేడినీటి స్నానాన్నే అందరూ ఇష్టపడుతుంటారు. కానీ వేడినీటి స్నానం మంచిది కాదు. ఇది చర్మాన్ని మరింత పొడిబారేలా చేస్తుంది. గోరువెచ్చని నీటితో స్నానం చేయాలి. స్నానం అయిన తర్వాత చర్మం కొంచెం తడిగా ఉన్నప్పుడే పెదవులకు, ఒంటికి మాయిశ్చరైజర్లు రాసుకోవాలి. చలికాలం కదా, అస్సలు ఎండ ఉండదు. ఉన్నా అదేమంత పెద్ద ఎఫెక్ట్ చూపదులే! అని అనుకుంటే పొరబాటే. చలికాలంలో కూడా ఎండ తీవ్రత ఎక్కువగానే ఉంటుంది. అది ఒక్కోసారి మనకు తెలియకపోవచ్చు. అందుకని బయటకి వెళ్లేముందు సన్‌స్క్రీన్ లోషన్ తప్పనిసరిగా రాసుకుని వెళితే మంచిది. సాధ్యమైనంత వరకూ మీ చర్మతత్వాన్ని బట్టి క్రీమ్స్ ఎంచుకోవాలి.



### ఈ చిట్కాలు పాటించి చూడండి

1. చల్లారిన ఒక కప్పు టీనీళ్లలో రెండు స్పూన్ల బియ్యప్పిండి, తేనె కలిపి ముఖానికి రాసుకోవాలి. బియ్యప్పిండి మంచి స్క్రబ్‌లా పనిచేస్తుంది. తేనె చర్మానికి తేమనిస్తుంది. ఈ రెండిటినీ కలిపి వాడడం వల్ల చర్మానికి కండిషనర్ దొరికినట్టే!
2. ఒక టేబుల్ స్పూన్ ఉడికించిన ఓట్స్‌ని మెత్తగా చేసి రాసుకుంటే చర్మం మంట తగ్గుతుంది. ఇందులోనే ఒక టేబుల్ స్పూన్ నిమ్మరసం కలిపి రాసుకుంటే నిర్జీవంగా ఉన్న చర్మం కాంతిమంతమవుతుంది.
3. సున్నితమైన చర్మం గలవాళ్లు నిమ్మరసంలో కొన్ని నీళ్లు కలిపి గాఢతను తగ్గించి వాడాలి.
4. శనగపిండి, పసుపు, పెరుగు ఈ మూడింటినీ కలిపి రాసుకుంటే చర్మంపై ఉండే టాన్ పోతుంది. పసుపు నల్లటి మచ్చల్ని పోగొడుతుంది.
5. నువ్వులనూనె చలికాలంలో బాగా పనిచేస్తుంది. శరీరానికి ఈ నూనె పట్టించి సున్నిపిండితో రుద్ది, వేడి నీళ్ల స్నానం చేస్తే చర్మం సున్నితంగా మారుతుంది.

### వీలైనంత ఎక్కువగా నీళ్లు

చలికాలంలో అందంగా కనబడాలంటే చర్మం ఎప్పుడూ తేమగా కాంతిమంతంగా కనబడాలి. ఈకాలంలో చల్లగా ఉండటం వల్ల అంతగా దాహం వేయదు. అయినప్పటికీ నీటిని ఎక్కువగా తాగుతూ ఉండాలి. అప్పుడే చర్మంలోని మలినాలు తొలగిపోవడమే కాకుండా చర్మం తాజాగా తయారవుతుంది. దీనికితోడు వ్యాయామం కూడా కంపల్సరీగా చేయాలి. దీనివల్ల రక్తప్రసరణ ప్రక్రియ చక్కగా సాగుతుంది. కండరాలు ఉత్తేజితం అవుతాయి కూడా! అలాగే తినే భోజనంలో తాజా పళ్లు, కూరగాయలు ఉండేలా చూసుకోవాలి. చర్మం పొడిగా ఉన్నప్పుడు పెళుసుగా మారి దురదలాంటిది మొదలవుతుంది. దానివల్ల పదే పదే గోకడం చేస్తుంటారు. దాంతో ఇన్ఫెక్షన్లు వచ్చే అవకాశాలుంటాయి. కాబట్టి చలికాలంలో చర్మానికి సంబంధించి ఏ చిన్న ఎలర్జీ ఉన్నా సరే చర్మవ్యాధి నిపుణులను సంప్రదించడం చాలా మంచిది. చలిలో సాధ్యమైనంతవరకు చర్మాన్ని బయటి వాతావరణంతో కనెక్ట్ కాకుండా చూసుకోవాలి. దుమ్ము, ధూళికి దూరంగా ఉండాలి. పౌడర్ల జోలికి వెళ్లకుండా ఉండడం మేలు.

-నివేదిత



దారుల ప్రవేశంపై ఉన్న ఆంక్షలను ఎత్తేస్తామని, ఔషధ సంస్థల భవితవ్యానికి ఎటువంటి ఢోకా ఉండదని ఆయన ప్రకటించడం భారతీయ కంపెనీలకు ఊరట కలిగించాయి. ఆయన ఔట్‌సోర్సింగ్ మీద కూడా వ్యాఖ్యానాలు చేశారు. ఔట్‌సోర్సింగ్‌కు చరమగీతం పాడటం తథ్యమని ఆయన గట్టిగా చెప్పారు. భారతీయ కాల్ సెంటర్ ఉద్యోగుల పదజాలం మీదా, ఉచ్చారణ మీదా ఆయన జోకులు కూడా వేశారు. అయితే, ఇదంతా ఎన్నికల ప్రచారం వరకే పరిమితమని, ప్రస్తుత అమెరికా అధ్యక్షుడు బారక్ ఒబామా కూడా వివిధ అంశాలపై ఇటువంటి ప్రతికూల వ్యాఖ్యానాలు చేశారనీ నిపుణులు వివరించారు. మోదీ-ఒబామాల మధ్య ఇటీవలి కాలంలో టెక్నాలజీపై జరిగిన ఒప్పందాలపై ట్రంప్ అనేక విమర్శలు చేశారు. ఈ వ్యాఖ్యలు భారత్‌కు తీవ్ర ఆందోళన కలిగించాయి. ఏది ఏమైనా, ట్రంప్ విజయం భారత్‌కు అనేక అవకాశాలు కల్పిస్తుందని, హిల్లరీ క్లింటన్ గెలిచి ఉంటే ఈ అవకాశాలకు ఆస్కారమే ఉండేది

# ట్రంప్ విజయం భారత్‌కు మంచిదేనా?

**భారత్ అన్నా, మోదీ అన్నా తనకు అభిమానమని ట్రంప్ ఏడాదిగా అనేక వేదికలపై చెబుతూ వచ్చారు. ఈ అభిమానం భారత్‌తో సంబంధాల పటిష్టానికి సహకరిస్తుందా అన్నది చూడాలి.**

భారతదేశంలోని విదేశాంగ విధాన రూపకర్తలే కాదు, అమెరికాలోని భారతీయులు, ముఖ్యంగా పాలక భారతీయ జనతా పార్టీ (బీజేపీ) అనుకూలవాదులు సైతం డొనాల్డ్ ట్రంప్ విజయం భారత్‌కు ఇబ్బడిముబ్బడిగా లాభిస్తుందని గట్టిగా నమ్ముతున్నారు. ట్రంప్ అధికారం చేపట్టిన నాటి నుంచి భారత్, అమెరికాల మధ్యే కాక, వ్యక్తిగత స్థాయిలో ప్రధాని నరేంద్ర మోదీ, ట్రంప్‌ల మధ్య కూడా సంబంధాలు మరింత సన్నిహితమవుతాయని వారు భావిస్తున్నారు. ట్రంప్ విజయం ఉగ్రవాదం మీద సరికొత్త దాడికి, పాకిస్థాన్‌ను ఒంటరిని చేయడానికి ఉపకరిస్తుందని వారు చెబుతున్నారు. ఎన్నికల ప్రచార సమయంలో ట్రంప్ భారతదేశ ఆర్థికవ్యవస్థ గురించి, నరేంద్ర మోదీ నాయకత్వం గురించి సానుకూలంగా మాట్లాడారనే విషయం పరిగణనలోకి తీసుకోవాలని వారు గుర్తు చేస్తున్నారు.

ఎన్నికల్లో ట్రంప్ విజయం సాధించారనే ప్రకటన వెలువడగానే మొదటగా ఆయనను అభినందించిన వ్యక్తి మోదీయే. ఇరు దేశాల మధ్య సంబంధాల మెరుగుదలకు కలిసికట్టుగా కృషి చేయాల్సి ఉందని, దీని కోసం ఎంతో ఆత్రుతతో ఎదురు చూస్తున్నామని ట్రంప్‌తో మోదీ అన్నారు. ఎన్నికల ప్రచారం సందర్భంగా అమెరికాలోని భారతీయ సంతతివారితో ముఖ్యంగా హిందూ వర్గాలతో ట్రంప్ కలిసిపోయి అనేక విధాలుగా ప్రశంసించారు. ట్రంప్ విజయం సాధించి, అధికారం చేపడితే, ఆయన అనుసరించబోయే విధానాల పట్ల భారతీయులు తీవ్ర ఆందోళన చెందుతున్నారని అక్కడి భారతీయులు ఆయన దృష్టికి తీసుకు వచ్చారు. ఆయన వాటిని తేలికగా తీసిపారేశారు.

నిజానికి విదేశాంగ శాఖాధికారులే కాకుండా, భారతీయ పారిశ్రామికవేత్తలు పలువురు ట్రంప్ విధానాలపై అనేక రకాలుగా భయాందోళనలు వ్యక్తం చేస్తున్నారు. వాతావరణ మార్పులు, ఔట్‌సోర్సింగ్, వలసలు వంటివి ఈ విధానాల్లో ముఖ్యమైనవి. ప్రచార సమయంలో ట్రంప్ అమెరికా, మరో 11 దేశాల మధ్య కుదిరిన వాణిజ్య ఒప్పందాలపై సందేహాలు వ్యక్తం చేశారు. అందులో భారత్ కూడా ఉంది. ట్రంప్ హెచ్1బి వీసా వ్యవస్థను పునర్వ్యవస్థీకరిస్తారని, దానివల్ల అమెరికా సంస్థలు భారత్ నుంచి ఐటీ నిపుణులను ఔట్‌సోర్సింగ్ చేయడం కష్టతరమవుతుందని రకరకాల భయాలు వెల్లడవుతున్నాయి. అంతేకాదు, గ్రీన్ కార్డులను స్తంభింపజేస్తారని కూడా భయాలు వ్యక్తమయ్యేసరికి టాటా కన్సల్టెన్సీ సర్వీసెస్, విప్రో, ఇన్ఫోసిస్, హెచ్‌సీఎల్ టెక్నాలజీస్, టెక్ మహీంద్రా వంటి దిగ్గజ సంస్థల షేర్లు పతనమయ్యాయి.

## సానుకూల అంశాలు

అయితే, కొన్ని సానుకూల అంశాలు కూడా కనిపిస్తున్నాయి. ముఖ్యంగా ఔషధ సంస్థలు, స్థిరాస్తి రంగాల విషయంలో ఆయన వైఖరి సానుకూలంగానే కనిపిస్తోంది. ఔషధాల ఉత్పత్తి



కాదని ప్రభుత్వ అధికారులు, బీజేపీలోని విదేశాంగ విధాన పరిశీలకులు నిశ్చితాభిప్రాయంతో ఉన్నారు.

హిల్లరీ గనుక గెలిచి ఉంటే, భారత-పాకిస్థాన్ సంబంధాల విషయంలో అమెరికా వైఖరి ప్రతికూలంగా మారి ఉండేదని భారతీయ విదేశాంగ విధాన నిపుణులు భావిస్తున్నారు. పాలక బీజేపీకి చెందిన అమెరికా మద్దతుదార్లు (ప్రవాస భారతీయులు) ట్రంప్ ఎన్నికల ప్రచారం సందర్భంగా తీవ్ర ఒత్తిడికి లోనయ్యారు. అమెరికాలోని భారతీయుల్లో అధిక సంఖ్యాకులు మోదీ మద్దతుదార్లే. వారు ట్రంప్‌కు మద్దతునిస్తారా లేక హిల్లరీకి మద్దతునిస్తారా అని అటు రిపబ్లికన్లు, ఇటు డెమోక్రాట్లు ఒత్తిడి తెచ్చారు. ఈ మోదీ మద్దతుదార్లలో రిపబ్లికన్ పార్టీకి చెందినవారూ ఉన్నారు, డెమోక్రటిక్ పార్టీకి చెందినవారూ ఉన్నారు. అయితే మోదీని బట్టి ట్రంప్‌కో, హిల్లరీకో ఓటు వేయబోమని, స్థానిక సమస్యలను




బట్టే ఓటేస్తామని ఈ మద్దతుదార్లు తెగేసి చెప్పడం ప్రారంభించారు.

కాగా, ఈ మద్దతుదార్లు సైతం ట్రంప్ విజయం భారతదేశానికి ఎటువంటి అవకాశాలు తీసుకొస్తుందోనని వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తున్నారు. ఈ మద్దతుదార్లలో ట్రంప్‌కు బాగా సన్నిహితులైనవాళ్ళు కూడా ఉన్నారు. అమెరికాలో బాగా పట్టూ, పలుకుబడీ ఉన్న మేధావి వర్గ సంస్థ హెరిటేజ్ ఫౌండేషన్‌లో సభ్యులుగా, సన్నిహితులుగా ఉన్న మోదీ మద్దతుదార్లు కూడా ఉన్నారు. వీళ్ల ట్రంప్ విధాన నిర్ణయాలను ప్రభావితం చేయగల స్థితిలో ఉన్నారు. ఈ హెరిటేజ్ ఫౌండేషన్ ట్రంప్‌కు సలహాదారు. ట్రంప్‌కు ఎన్నికల ప్రచారంలో మద్దతు కూడా ఇచ్చింది. ఇంతకూ దక్షిణాసియా పట్ల ట్రంప్‌కు ఉన్న అభిప్రాయాలేవీ ఇంతవరకూ వెలుగు చూడలేదు. ఆయన ఒకే ఒకసారి భారత్ పర్యటనకు వచ్చారు. అప్పుడు కూడా ముంబైను మాత్రమే సందర్శించారు.

ఆయన ఈ ఏడాది ప్రారంభంలో ఎన్నికల ప్రచారం ప్రారంభిస్తూ, మోదీ అధికారంలోకి వచ్చిన తరువాత భారత్ ఓ ప్రధాన పెట్టుబడుల గమ్యస్థానంగా మారిందని ట్రంప్ వ్యాఖ్యానించారు. అంతేకాదు, “ప్రపంచంలో పాకిస్థాన్ అతి పెద్ద ప్రమాదకర దేశంగా అవతరించింది” అని కూడా ఆయన వ్యాఖ్యానించారు. పాకిస్థాన్‌ను అదుపులో పెట్టడం భారత్‌కు మాత్రమే సాధ్యమని కూడా ఆయన అన్నారు. వ్యాపార, వాణిజ్య రంగాల్లో అమెరికాకు ప్రధాన, కీలక శత్రువు చైనా అని ఆయన అభివర్ణించారు. ఇవన్నీ భారత్‌కు శుభ సూచకాలే! ట్రంప్ విజయం సాధించగానే భారతదేశం ఆయనను ప్రశంసలతో ముంచెత్తేదే. అయితే, అది ఆచి తూచి అడుగువేయడానికి కారణం ట్రంప్ విజయం విషయంలో అమెరికాలో అల్లర్లు చెలరేగుతుండడమే. ఈ అల్లర్లను బట్టి, నిరసనలను బట్టి చూస్తే ఆయన ఒకసారి పదవీ కాలం పూర్తి చేయడమే గగనంగా కనిపిస్తోంది.

**భారతదేశంలోని విదేశాంగ విధాన రూపకర్తలే కాదు, అమెరికాలోని భారతీయులు, బీజేపీ అనుకూలురు సైతం డొనాల్డ్ ట్రంప్ విజయం భారత్‌కు లాభిస్తుందని, మోదీ, ట్రంప్‌ల మధ్య కూడా సన్నిహిత సంబంధాలు బలపడతాయని భావిస్తున్నారు. రాజకీయ, వాణిజ్యపరంగా కూడా ట్రంప్ భారత్‌వైపే మొగ్గుచూపుతున్నట్లు ఆయన వ్యాఖ్యలు తెలియజేస్తున్నాయి. ఇదే ధోరణి మున్ముందు కొనసాగుతుందా? భారత్ పట్ల ట్రంప్ ఎలా వ్యవహరించబోతున్నాడు?**

## అనుభవ రాహిత్యం

వ్యాపార, వాణిజ్యాల్లో తప్ప రాజకీయంగా, పాలనాపరంగా ఆయనకు ఏమాత్రం అనుభవం లేకపోవడం కూడా ఓ సమస్య కావచ్చని భారత్ భావిస్తోంది. పాకిస్థాన్ ప్రాయోజిత ఉగ్రవాదంతో సహా ప్రపంచంలోని ఉగ్రవాద సంస్థలన్నిటి పైనా పోరాటం సాగించే విషయంలో ట్రంప్ అభిప్రాయాలు, భారత్ అభిప్రాయాలు కలుస్తున్నాయి కానీ, మిగిలిన అంశాల విషయంలో మాత్రం కాస్తంత జాగ్రత్తగా మెలగాల్సిన అవసరం ఉందని భారతీయ విదేశాంగ నిపుణులు భావిస్తున్నారు. అమెరికా ప్రజలందరికీ తాను అధ్యక్షుడిననీ, అన్ని దేశాలకూ తాను మిత్రుడిననీ ఆయన రుజువు చేసుకునేంతవరకూ భారత్ జాగ్రత్తగానే మెలగాల్సి ఉంటుందని కూడా వారు అభిప్రాయపడుతున్నారు. నిజానికి ఎన్నికల ప్రచారం సందర్భంగా చేసిన కొన్ని వ్యాఖ్యలను, ప్రకటనలను ఆయన గెలిచిన తరువాత ఉపసంహరించుకుంటున్నారు. ముస్లింల వలసలను ఆపేస్తానని, అమెరికా, మెక్సికోల మధ్య గోడ నిర్మిస్తానని, నాటో మీద నిధులు ఖర్చు చేయడం ఆపేస్తానని ఆయన ఎన్నికల తరువాత చెప్పడం ప్రారంభించారు. ఇక, రిపబ్లికన్లు మొదటి నుంచీ భారత్‌కు మద్దతునిస్తూనే ఉన్నారు.



డెమొక్రాటిక్ పార్టీకి చెందిన హిల్లరీ క్లింటన్ విదేశాంగ మంత్రిగా ఉండగా, భారత్‌తో స్నేహంగానే ఉన్నప్పటికీ, చైనా, పాకిస్థాన్‌ల పట్ల మొదటి నుంచీ మొగ్గు చూపిస్తూనే ఉన్నారు. ఒబామా కూడా మొదట్లో భారత్‌తో స్నేహభావంతోనే వ్యవహరించారు. అయితే, 2010లో ఆయన భారత్ సందర్శనకు వచ్చినప్పుడు, అణు, యుద్ధ విమానాల ఒప్పందాల విషయంలో విఫలం కావడం పరిస్థితిలో మార్పు తెచ్చింది. భారత్‌తో అణు వ్యాపారం ప్రారంభించడానికి ఒబామా చేసిందేమీ లేదు. పైగా ఆయన అవకాశం వచ్చినప్పుడల్లా మత సహనం మీద భారత్‌కు ఉపన్యాసాలు ఇవ్వడం కూడా మొదలు పెట్టారు. ఐక్యరాజ్య సమితి భద్రతా మండలి, అణు సరఫరాదార్ల బృందంలో సభ్యత్వం కోసం భారత్ ఎంతగా ప్రయత్నాలు సాగించినా ఒబామా నుంచి లభించిన మద్దతు మాత్రం శుష్కప్రియాలే.

డొనాల్డ్ ట్రంప్ ఎప్పుడు ఏం మాట్లాడతారో, ఎప్పుడు ఎలా స్పందిస్తారో చెప్పలేం గానీ, భారత్ సమస్యలు, తీవ్ర ఆందోళనల విషయంలో మాత్రం ఆయన భారత్ వెంటే ఉంటారనడంలో సందేహం లేదు. మోదీ అంతర్జాతీయ వేదికలపై ఎప్పుడు ప్రసంగించినా ఉగ్రవాదం గురించి ప్రస్తావించకుండా ప్రసంగం ముగించరు. భారత్‌కు తీవ్రంగా ఆందోళన కలిగిస్తున్న సమస్య అది. ట్రంప్ తప్పనిసరిగా ఆ సమస్య గురించి పట్టించుకోవడం జరుగుతుంది. ఈ సమస్య విషయంలో భారత్, అమెరికాల అభిప్రాయాలు ఒక్కటే! ట్రంప్ దాదాపు ఏడాది క్రితం నుంచీ పాకిస్థాన్ ప్రమాదకర దేశమని చెబుతూనే ఉన్నారు. పాకిస్థాన్ విషయంలో అటువంటి వైఖరిని తీసుకున్న అధ్యక్షుడు మరొకరు లేరు. ప్రధానంగా వాణిజ్యవేత్త అయిన ట్రంప్ భారత్‌లో అమెరికా పారిశ్రామిక, వాణిజ్యవేత్తలు పెట్టుబడులు పెట్టడానికి అభ్యంతర పెట్టకపోవచ్చు. భారత్ ఆర్థికంగా, పారిశ్రామికంగా, రాజకీయంగా ముందుకు దూసుకుపోతోందని, దీని గురించి ఏ దేశమూ పట్టించుకోకపోవడమేమిటని ఆయన ఓ కార్యక్రమంలో ప్రశ్నించారు.

ఆయన మాటలు, చేతలను బట్టి అర్థమవుతున్నదేమిటంటే, ఆయన భారత్ పట్ల మొగ్గు చూపే అవకాశం ఉంది. చైనా కంటే భారత్‌కే ఎక్కువగా మార్కెట్ అవకాశాలు కల్పించే అవకాశం కూడా ఉంది. చైనా విషయంలో ఆయన సందిగ్ధంలో ఉన్నారు. వాణిజ్య సంబంధాల విషయంలో ఆయన తరచూ చైనాపై విమర్శలు గుప్పించడం గమనించాల్సిన విషయం. అమెరికా, చైనాల మధ్య ఏటా 42 వేల కోట్ల డాలర్ల వ్యాపారం జరుగుతోంది. మున్ముందు అంత వ్యాపారం జరిగే అవకాశం ఉండకపోవచ్చు. చైనా-భారత్ సంబంధాలపై కూడా ఆయన భారత్‌కు అనుకూలంగా కొన్ని వ్యాఖ్యలు చేశారు. తాను భారత్‌కు, ముఖ్యంగా మోదీకి గొప్ప అభిమానినని ఆయన అనేక సందర్భాల్లో బయటపెట్టారు. ఇదే ధోరణి మున్ముందు కూడా కొనసాగవచ్చు. నవ్య



**"కమాన్! కంట్రోల్ యువర్‌సెల్ఫ్. వాళ్ళు సయీమ్ మనుషులే! అది తెలుస్తూనే ఉంది. అయితే, వాళ్ళు ఇంత ధైర్యంగా, సీసీటీవీల్లో పడతామని భయపడకుండా ఎందుకొచ్చారో అర్థమవుతోంది.**

సయీమ్ ఆ అపార్ట్‌మెంటులోకి ప్రవేశించే ముందే, ఆ బిల్డింగులోని సీసీటీవీలు పని చేయడం మానేశాయి. అంటే, ఇదంతా ప్రీప్లాన్డ్‌గానే జరిగింది. జలజ ఫ్లాటులో సీసీటీవీలు లేవని సయీమ్ నిర్ధారించుకుని, తన అనుచరులకు చెప్పి పంపించి ఉంటాడు. అందుకే వాళ్ళు ఇంత ఘాతుకానికి, ఇంత ధైర్యంగా తెగబడ్డారు. అయితే, జలజ మోషన్ సెన్సార్ కన్సీల్డ్ కెమేరాలు యాక్టివేట్ చేస్తుందని వాళ్ళు ఊహించలేదు. అయితే, ముందుగా అక్కడికి చేరుకున్న మా లోకల్ పోలీస్ టీమ్‌కి కూడా ఈ విషయం తెలియదు. తెల్లారాక, నేను వెళ్ళి మొత్తం పరిశీలిస్తుంటే, నాతోపాటు వచ్చిన క్లూస్ టీమ్‌లో ఒక ఎక్స్పర్టుకు ఏదో అనుమానమొచ్చింది. అపార్టుమెంటు సీసీటీవీలు, జలజ వచ్చేముందు నుంచే పనిచేయకపోవడంతో ఏదో పెద్ద గూడు పుఠాణి ఉందనీ, మాఫియాచేసే మర్డర్లు ఇలాగే ఉంటాయనీ ఊహించి, సయీమ్‌కి సంబంధం ఉందేమోననే అనుమానంతో, అతను నా దగ్గర కొచ్చి రహస్యంగా ఈ విషయం చెప్పాడు. అతని అనుమానం నిజమైంది. అందరినీ పంపించి, అతనూ, నేనూ కలిసి, లేటెస్ట్ ఎక్విప్‌మెంట్ తీసుకొచ్చి ఎక్కడెక్కడ కన్సీల్డ్ కెమేరాలున్నాయో గుర్తించాం. అవి రికార్డుచేసిన వీడియో ఫుటేజ్ అంతా నా పొసెషన్‌లోకి తీసుకున్నాను. అయితే, నీకు తెలుసుగా, మా డిపార్ట్‌మెంట్ సంగతి! ఇందాకే చూశావుగా, నేను ఎంత సీక్రెట్‌గా ప్లాన్‌చేసి, ఆపరేట్ చేసినా, ఎవడో లీక్ చేశాడు. డిపార్ట్‌మెంట్‌లో సయీమ్ చెంచా వెధవలు, డబ్బులకు అమ్ముడుపోయే వెధవలు చాలామంది ఉన్నారు. అయితే, లక్కీగా నా దగ్గర ఏముందో, ఏ వీడియో ఫుటేజ్ ఉందో, ఎవ్వరికీ కరెక్టుగా తెలియదు. అందుకే సయీమ్‌కి, నాకు ఏదో దొరికిందని తెలుసుగానీ, అదేంటో తెలిసే అవకాశం లేదు. నాతోపాటు వచ్చిన ఎక్స్‌పర్ట్‌ను అండర్‌గ్రౌండ్‌కు పంపాను. వాడు, సయీమ్, ఎంత పెద్దడాన్‌గానీ, కెమేరాకు చిక్కాడంటే వాడి చాప్టర్ క్లోజ్ అని వాడికీ తెలుసు. అందుకే, ఇండైరెక్టుగా నన్ను బెదిరించటం మొదలుపెట్టాడు. మంత్రులతో ఫోన్లు చేయిస్తున్నాడు. ఇప్పుడు నా దగ్గరున్న వీడియో ఫుటేజ్, పేలబోయే టైం బాంబు లాంటిది. దీన్ని ఎంతత్వరగా వీలయితే అంత త్వరగా ఛేదించాలి. లేకపోతే, నాకే ప్రమాదం! ఇందులో నాకు అర్థం కాని విషయం ఒకటి ఉంది. సయీమ్‌కు కావలసింది జలజ దగ్గర ఏదైనా ఉందా? దానికోసమే జలజని హింసించి చంపారా? ఉంటే ఏమిటది? లేకపోతే ఎందుకు చంపారు? ఈ విషయంలో క్లారిటీ వస్తేగానీ, ఆ తీగ దొరికితే కానీ దాని వెనక ఉన్న డొంకనంతా కదిలిస్తాను. మట్టుబెడతాను!

ఆ తీగను పట్టుకోవాలంటే ఈ మిస్టరీని ఛేదించాలంటే, నాలుగు టెరాబైట్స్ పైనే ఉన్న వీడియో ఫుటేజ్ మొత్తం క్షుణ్ణంగా పరిశీలించాలి.




ఇట్ ఈజ్ ఏ లాంగ్ నైట్ ఫర్ మీ! నాకు శివ రాత్రి జాగరణే ఈ రాత్రంతా.

ఇదంతా నీకెందుకు చెబుతున్నానంటే, నీకు ఎక్స్‌ప్లెయిన్ చేస్తుంటే, నాకు కొన్ని డౌట్స్ క్లియరవుతున్నాయి. కొన్ని అనుమానాలొస్తున్నాయి. వాటికి సమాధానం కనుక్కోవాలి. అందుకే, నీతో మాట్లాడుతున్నాను. జనరల్‌గా మా డిపార్ట్‌మెంట్‌లో, ఇటువంటి సమయంలో, స్ట్రాటజీ ప్లాన్ చేయాలి. కానీ, ఎవరితో ఏం డిస్కస్ చేస్తే, ఏ విషయం ఎక్కడికి చేరుతుందో, ఎవరు సయీమ్ మనుషులో, ఎవడు ఎవడి పే లిస్టులో ఉన్నాడో తెలియడం లేదు? ఇంత స్ట్రాంగ్ ఎవిడెన్స్ ఉన్నాక వాణ్ణి వదలకూడదు. వదలను కూడా! అయితే, ఆచితూచి అడుగు వెయ్యాలి".

అంటూ లేచి అటూఇటూ తిరగడం మొదలుపెట్టింది. అలా తిరుగుతూ ఆలోచించడం, ఆమె అలవాటు కాబోలు.

నాకు వోడ్కా తలకెక్కడం మొదలయింది. దానికి తోడు పొద్దుటి నుంచీ జరిగిన సంఘటనలూ, ఛేజింగులతో బాగా అలసిపోయి, అట్లాగే నడుచుకుంటూ వెళ్ళి పరుపుమీద పడిపోయాను.

•••

నేను లేచేసరికి ఆరైంది. మందు ప్రభావమో లేక బాగా ఎగ్జాస్ట్ అయినందుకో తెలియదుగానీ, గాఢంగా నిద్రపోయాను. తలంతా పోటుగా ఉంటే మెలకువ వచ్చింది. తలంతా గుమ్మిగా ఉంది. అట్లాగే లేచి హాల్లోకి వచ్చేసరికి, మేడమ్ అలాగే సోఫాలో పడి నిద్ర పోతోంది.

పేపరు ఇంకా రాలేదు. టీవీ ఆన్ చేశాను. సిటీ అంతా గగ్గోలు గగ్గోలుగా ఉంది. రాత్రి డీసీపీ మేడమ్ ఉంటున్న ఇంటిమీద బాంబులతో దాడి చేశారు. ఆమె ఫ్లాట్‌తో పాటు మిగిలిన ఫ్లాట్లు కూడా నేలమట్టమయ్యాయి. ఐదారుగురు వరకు చనిపోయారు. అందులో ఒక ఐఏఎస్ ఆఫీసర్ కూడా ఉండడంతో సిటీ అంతా హై అలర్ట్ ప్రకటించారు. అసలు ఎవరిమీద, ఎందుకు దాడి జరిగిందో అంతు చిక్కడం లేదు. అసలు టార్గెట్ ఎవరు? చనిపోయిన ఐఏఎస్ ఆఫీసరా? కనపడకుండా పోయిన మేడమా? లేక ఇంకెవరైనానా? ఐఏఎస్, ఐపీఎస్ అధికారులు నివాసముండే హౌసింగ్ కాంప్లెక్స్ మీద దాడి చేశారంటే వాళ్ళు మామూలు క్రిమినల్స్ మాత్రం కాదు. తప్పకుండా మాఫియా పనేనని టీవీ రిపోర్టర్లు భావిస్తున్నారు. ఇంకో ఛానల్ ఇంకాస్త ముందుకెళ్ళి, ముందురోజు అర్ధరాత్రి జరిగిన జంట హత్యకు, ఈ సంఘటనకు సంబంధమేమైనా ఉందా! అని ప్రేక్షకులపై ప్రశ్నల వర్షం కురిపించసాగింది, ఏదో ప్రేక్షకులకి ఈ హత్యలతో సంబంధం ఉన్నంత సీరియస్‌గా! ప్రమాదం జరిగినచోటికి సీనియర్ ఐపీయస్ ఆఫీసర్లు, హోం మంత్రి చేరుకుని పరిస్థితిని సమీక్షిస్తున్నారు.

డాగ్ స్క్వాడ్‌తో ఆ ఏరియా అంతా క్షుణ్ణంగా గాలించసాగారు.

కానీ, అన్నింటికీ మూలాధారమైన మేడమ్ - నా ఇంట్లో నా సోఫాలో ఆదమరచి, ఒళ్ళు తెలియని స్థితిలో నిద్ర పోతోంది. బహుశా, ఆమె ఏ నాలుగింటికో నిద్రపోయి ఉండవచ్చు. సోఫాలో అడ్డదిడ్డంగా పడుకోవడంతో, ఆమె ఒంటిమీద బట్టలు అస్తవ్యస్తమయి, ఆమె ఒంటి సోయగాలను బహిర్గత పరుస్తున్నాయి.

మేడమ్‌ను ఇప్పటివరకూ ఆ దృష్టితో చూడలేదు కాబట్టి ఆమెలోని స్త్రీత్వాన్ని నేను పట్టించుకోలేదు. ఇప్పుడు కూడా ఆ మూడ్ లేదు.

మనసంతా దుఃఖపు సముద్రంలో ముంచి తేల్చినట్టుగా, భారంగా ఉంది.

జలజ లేదు. లేదు అన్న దానికన్నా ఆమెను ఖండఖండాలుగా నరికి పడేయడం, ఆ ఘోర కృత్యాన్ని నేను వీడియోలో చూడడం గుర్తొచ్చి ఏడుపు తన్నుకొస్తోంది. ఇంతా చేసి, ఇదంతా - అంటే జలజ మా ఆఫీసుకు రావడం, నాతో సరస సంభాషణలాడి, స్వర్గలోకపు అంచులదాకా తీసుకువెళ్ళడం, ఇంతలో ఫోన్ రావడం, తెల్లారేసరికి హత్య చేయబడడం, నేను యాదగిరిగుట్టకు పారిపోవడం, రాత్రే మేడమ్‌ను కలవడం, మేడమ్ ఇంటిమీద దాడి జరగడం వంటి సంఘటనలు, మొన్న రాత్రే మొదలయ్యాయి - అని అనుకుంటే

### జరిగిన కథ

ఆస్కార్ అవార్డులపోటీల్లో అన్యభాషా చిత్రాల జాబితాలో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడతను. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. అతడో తెలుగు దర్శకుడు. హైద్రాబాద్‌లో జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో తన బండారం బైటపెట్టిన ఆ దర్శకుడికి డీసీపీ పుష్పాకిరణ్ సూచించిన రాజీమార్గం ద్వారా లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. పూటకు టికానాలేని దర్శకుడి దశతిరిగి, దేశం గర్వించదగ్గ గొప్ప సినిమా నిర్మించేందుకు కథాన్వేషణలో పడతాడు. అంతలోనే నటి జలజను మాఫియా నాయకుడు సయీమ్ హతమార్చాడు. ఆ వీడియో డీసీపీ వద్ద రహస్యంగా ఉంది. ఇప్పుడు వారిద్దరి ప్రాణాలకు ముప్పువాటిల్లింది. అందుకే డీసీపీ, ఆ దర్శకుడు ఒకచోట తలదాచుకుని ఆలోచనలో పడ్డారు.

ఆ తర్వాత.....

నమ్మబుద్ధి కావడం లేదు. నా జీవితంలో అత్యంత బాధాకరమైన, సుదీర్ఘమైన ముప్పై ఆరు గంటల కాలమిది.

ఈ వ్యథ ఇప్పట్లో తీరేదికాదు. ఎప్పటికీ మరిచి పోయేది కాదు. కాలం ఈ గాయాన్ని మాన్పినా, మనసు పొరల్లో ఎక్కడో ఈ సంఘటన నిక్షిప్త మయ్యే ఉంటుంది.

ఈ సంఘటనతో, జీవితం పట్ల నా దృక్ప థమే మారిపోయే అవకాశముంది.

టీవీ సౌండుకు డిస్టర్బ్ అయిందేమో, మేడమ్ కొంచెం కదిలింది. నేను టీవీ ఆఫ్ చేశాను.

"గుడ్ మార్నింగ్! పర్లేదు, టీవీ ఆన్ చెయ్యి. ఏం జరుగుతుందో చూద్దాం!" అంటూ సైలెంట్ మోడ్‌లో ఉన్న తన ఫోన్లను చూసుకుంది.

"మై గాడ్! వంద మిస్డ్ కాల్సున్నాయి" అంటూ నవ్వుకుంది.

టీవీలో వస్తున్న వార్తను చూసి, "అరే! అహూజా చచ్చిపోయాడే?" అంటూ సంతాపం ప్రకటించింది.

"ఏంటిది మేడమ్! మీరంటే నేను నమ్మలేదు కానీ, ఇది మీ మీద జరిగిన దాడే మేడమ్! ప్రెస్ వాళ్ళకు క్లూ దొరకలేదు గానీ, ఇది ఆ సయీమ్ గాడి మనుషుల పనే మేడమ్! పోలీసుల ప్రాణా లకే రక్షణ లేకపోతే, ఇంక మనం ఏ సమాజంలో బ్రతుకుతున్నట్టు మేడమ్?" అంటూ నేను సాను భూతిగా అన్నాను.

"సమాజం, చట్టుబండలు... అంతా బుల్‌షిట్! మీరు బతుకుతున్న సమాజం వేరు. మేము రోజూ చూస్తున్న నేరసామ్రాజ్యం వేరు. మాకు తెలిసిన విషయాలు గనుక బయటపెడితే, ఈ సోకాల్డ్ సభ్య సమాజం రోజుకు వందసార్లు ఉరి వేసు కుంటుంది. మీరనుకుంటున్నట్టు ఇది సభ్య సమాజం కాదు. అసభ్య, అవినీతి, అనైతిక, వావి వరుసలు మరిచి ప్రవర్తించే కుళ్ళిపోయిన సమాజం. ఓకే లీవిట్! కాఫీ ఏమైనా ఇస్తావా, కబుర్లేనా?" అంది.

నేను కాఫీ మేకర్లో కాఫీ తయారుచేయ

**తెల్లవారుజామున బ్రహ్మీముహూర్తంలో ఓ నిర్ణయానికొచ్చిందామె! కొడితే కుంభస్థలాన్నే కొట్టాలి. దానికి సరైన ప్లానింగ్ ఉండాలంటూ ఆలోచనలో పడింది. నా ప్లానింగ్ వల్ల ఎవరూ చిక్కుల్లో పడకూడదు. అదేవిధంగా నా ఉద్యోగధర్మానికి ద్రోహం చేయలేను. ఈరోజు అటోఇటో తేలిపోవాల్సిందే! అంటూ బయలుదేరింది. ఆమె వేసిన ప్లాన్ ఏంటి? ఎక్కడికి బయలుదేరిందామె?**

డానికి కిచెన్‌లోకి వెళ్ళాను. మేడమ్ ల్యాప్‌టాప్ తెరిచి పెట్టింది కానీ, టీవీలో ఏదో బ్రేకింగ్ న్యూస్ అంటూ వార్త రావడంతో దృష్టి అటు మరల్చింది.

"డీసీపీ పుష్ప ఏమైనట్టు? బాంబుదాడిలో మరణించిందా? మాఫియా కిడ్నాప్ చేసిందా? లేక దాడి ముందే పసిగట్టి ఎక్కడికైనా పారిపోయి దాక్కుందా?" అంటూ యాంకర్ పెద్ద గొంతు వేసుకుని అరుస్తోంది.

కాఫీ మగ్గుతో నిలబడిన నన్ను చూసి, మేడమ్ "చెప్పండి సార్, ఏం చేశారు మేడమ్‌ని? కిడ్నాప్ చేశారా మీరు?" అని అంటూ విరగబడి నవ్వ సాగింది.

కాఫీ తీసుకుని, "చూశావా? రాత్రి నువ్వు గనుక ఇక్కడకు తీసుకురాక పోతే... నేను కూడా అహూజాతోపాటు పైకిపోయే దాన్నే... యూ ఆరే డార్లింగ్" అంటూ కాఫీ సిప్ చేసింది.

"తెల్లవారుజామున, బ్రహ్మీ ముహూర్తంలో, ఒక నిర్ణయానికి వచ్చాను. కొడితే కుంభస్థలాన్నే కొట్టాలి. దానికి కావాల్సిన ప్లానింగ్ అంతా చేశాను. కానీ, ఆ వివరాలు నీకు చెబితే నా ఉద్యోగ ధర్మా నికి, ద్రోహం చేసినట్టవుతుంది. దానివల్ల నువ్వు కూడా చిక్కుల్లో పడే ప్రమాదముంది. ఆఁ... నువ్వు నాకు ఇంకో సహాయం చేయాలి. నీ దగ్గర బైకుందా?

నవీన్ బైకు పార్కింగ్‌లో ఉండడం రాత్రే చూశాను. బైకు ఆఫీసుదేకానీ, నవీన్ వాడుతుంటాడు కాబట్టి స్పేర్ కీస్ నా దగ్గర కూడా ఉంటాయి.

అందుకే, మేడమ్ అడగగానే బైక్ ఉందన్న ట్లుగా తలూపాను.

"అయితే ముందు మాంచి, సాలిడ్ బ్రేక్‌ఫాస్ట్ చేయించు. తర్వాత నన్ను డ్రాప్‌చేసి నువ్వు ఆఫీ సుకు వెళ్ళు. ఇవ్వాళ్టితో, ఈ ఎపిసోడ్‌కు ఫుల్ స్టాప్ పెట్టేస్తాను. అటోఇటో తేలిపోవాల్సిందే!"

•••

ఇద్దరం ముసుగులు ధరించాము.

ఆమె చెప్పిన అడ్రస్ విని నేను ఆశ్చర్య పోయాను.

బైక్ అక్కడకు చేరుకోకముందే, బైక్‌ను ఆప మంటూ అరుస్తూ, తుపాకులు పట్టుకుని ముగ్గురు నలుగురు పరిగెత్తుకుంటూ రావడం చూసి, నా ప్రాణాలు గాలిలోకి తేలిపోయాయి.

మేడమ్ చటుక్కున దిగి, నన్ను వెళ్ళిపొమ్మని చెప్పింది. మేడమ్‌కేమైనా ప్రమాదం జరుగుతుందే మోనని నేను కంగారు పడుతుంటే, తను నన్ను చూసి...

"కమాన్, మూవ్ మ్యాన్, వెళ్ళిపో!" అంటూ అరిచింది.

నేను వెనుకకు తిరిగి చూడకుండానే బండి రివర్స్ తీసుకుని వచ్చేశాను.

•••

తర్వాత రెండు రోజుల వరకు ఎటువంటి సమాచారమూ లేదు. నేను మామూలుగానే ఆఫీ సుకు వెళ్ళి వస్తున్నాను. కానీ, ఏదో జరగబోతుం దని మనసు శంకించడంతో పని మీద కాన్సం ట్రేట్ చేయలేకపోతున్నాను.

అదీ గాకుండా, నాలుగు రోజులుగా నవీన్ పత్తా లేకపోవడంతో, వాళ్ళ తల్లిదండ్రులు వచ్చి గొడవచేయడంతో మూడంతా ఔటయ్యింది. వాళ్ళు అడిగారని కాదు గానీ, జలజ హత్య జరిగిన రాత్రి, ఆమె మా ఆఫీసు నుండి బయటకు వెళ్తుంటే, ఆమెను ఫాలో కమ్మని నవీన్‌కి నేనే చెప్పాను. అప్పటినుంచి, నవీన్ కనపడకుండా పోవడంతో, నేను కూడా గిల్టీగా ఫీలవుతున్నాను.

అందుకే... నవీన్ మాయమైన మరునాటి రాత్రి మేడమ్, నా ఫ్లాట్‌కి వచ్చినప్పుడు, నవీన్ గురించి వాకబు చేయమని పర్సనల్‌గా రిక్వెస్ట్ చేశాను. మేడమ్ కూడా తప్పక ట్రేస్ చేస్తానని చెప్పింది. కానీ, అప్పటి నుంచి మేడమ్ దగ్గర నుండి ఎటు వంటి కమ్యూనికేషన్ లేదు.

పేపర్లు, టీవీలు ఐఏఎస్ ఆఫీసర్ అహూజా మరణం గురించీ, డీసీపీ అంతర్ధానం గురించీ



రకరకాల కథలు, కథనాలు వండి వార్చి ప్రసారం చేస్తున్నాయి. ఇంకొన్ని ఇన్వెస్టిగేషన్ జర్నలిజం పేరుతో, సినీరంగానికి, మాఫియాకు మధ్య ఉన్న గొడవల మూలంగానే, జలజ హత్య జరిగిందనీ, దాని పర్యవసానమే ఈ దాడి అని రసవత్తర మైన ఎపిసోడ్స్ ప్రసారం చేసి టీఆర్‌పీ రేట్లు పెంచుకుంటున్నాయి. కానీ, ఎవ్వరు కూడా పొర పాటున సయీమ్ పేరు ప్రస్తావించలేదు. అంతా అబ్సల్యూట్ సైలెన్స్!

మూడోరోజు పొద్దున్న హైదరాబాదు నగరం నిద్రలేచేసరికి, ప్రజల కోసం, ఓ అద్భుతమైన వార్త సిద్ధంగా ఉంది.

అది

"పోలీసుల ఎన్‌కౌంటర్‌లో నొటోరియస్ మాఫియా డాన్ సయీమ్ దుర్మరణం" అన్న ఆ వార్త, రాజ కీయ, పోలీసు, ఉన్నత, పారిశ్రామిక వర్గాల్లో సంచలనం సృష్టించింది.

నేను గుండెలు దడదడలాడుతుండగా పేపర్ విప్పాను. టీవీ ఆన్ చేశాను. అది ఎవరు చేశారో నాకు తెలుసు. ఆమెకేమైనా ప్రమాదం జరిగిందేమో నన్నదే నా భయం.

పేపర్లలో ఫ్రంట్‌పేజీ బ్యానర్ ఐటెమ్సన్నీ 'సయీమ్' ఎన్‌కౌంటర్ గురించిన వార్తలే! టీవీ ఛానళ్ళలో బ్రేకింగ్ న్యూస్‌లన్నీ సయీమ్ గురించే.

"నగరంలో వేర్వేరు చోట్లలో జరిగిన దాడుల్లో అనేకమంది సయీమ్ అనుచరులు పట్టుబడ్డారు. ఒక నలుగురు మాత్రం పోలీసుల మీదకు తిరగ బడి కాల్పులు జరపటంతో, పోలీసులు ఆత్మరక్షణ కోసం జరిపిన ఎదురు కాల్పుల్లో మరణించారు".

చనిపోయిన ఆ నలుగురిని నేను ఈ మధ్యనే చూశాను.

ఉదయం టీవీల్లో, పేపర్లలో ఈ వార్త వచ్చి నప్పటి నుండి రాష్ట్రంలో రాజకీయంగా అనేక సంఘటనలు చకచకా జరిగాయి.

సాయంత్రానికల్లా ఒక మంత్రిని పోలీసులు అరెస్టు చేశారు.

ఈ సంఘటనల మధ్యన ఇంకో ఆసక్తికర మైన సంఘటన జరిగింది. జూబ్లీహిల్స్‌లో నివాస ముంటున్న ఒక ప్రొడ్యూసర్ రాత్రి ఎనిమిదింటికి మేడమీద నుంచి మెట్లు దిగుతూ జారిపడి మరణించాడు. అది హత్య ఎంత మాత్రమూ కాదని, అసలు పోలీసులు వాళ్ళ ఇంట్లోకి రాలే దని, అతని దగ్గరి బంధువులు ఖండించారు.

ఇవన్నీ జరుగుతూనే ఉన్నాయి కానీ ఎక్కడా మేడమ్ ప్రస్తావన రావడం లేదు. నాకు కంగా రుగా ఉంది. నవీన్ జాడ కూడా తెలియలేదు. టీవీ చూస్తూ కూర్చున్నాను.

రాత్రి పది కావొస్తుంది.

ఇంతలో... డోర్ బెల్ మోగింది.

●●●

నేను వెళ్ళి తలుపు తీశాను.

ఎదురుగా మేలిముసుగులో స్త్రీ! నన్ను చూడ గానే ముసుగు తీసేసింది.

డీసీపీ మేడమ్!!

ముఖం నిండా పులుముకున్న నవ్వులతో, మంచి పూల డిజైనర్ గౌన్‌లో మేడమ్ ఒక పెద్ద పూలబొకేలా ఉంది. అట్లాంటిది, మేడమ్ చేతిలో పెద్ద పూలబొకే ఉంది. బొకేలోని ఆర్కిడ్స్ లాగే మేడమ్ కూడా నవనవోన్మేష, పూల బాలలా ఉంది. తలుపు తెరవగానే సుందర దృశ్యంతో పాటు, మంచి సువాసనలు గుప్పుమన్నాయి. మేడమ్‌ని చూసేసరికి మనసు పరవళ్ళు తొక్కింది. ఇన్నిరోజుల టెన్షన్ తగ్గింది. దానికి తోడు పూవింటి విలుకాని శరంలా తయారైన మేడమ్ నన్ను చూడగానే, గట్టిగా హత్తుకుంది.

ఆ క్షణమే నేను సుఖసాగరంలో మునిగి చచ్చిపోయాను.

ఒక అందమైన, యువ ఐపీయస్ ఆఫీసర్ కౌగిలి!! అదీ తనే ఇష్టపడి ఇచ్చిన కౌగిలి! వావ్! వాటే జోక్!! భారతదేశంలోని కోటానుకోట్ల పెళ్ళి కాని యువకుల్లో ఎంతమందికి, ఈ అదృష్టం కలుగుతుంది!

మేడమ్ కౌగిలి నుండి నేనైతే వీడదలుచుకో లేదు. కానీ కారిడార్‌లో కొంతమంది వింతగా చూస్తుండడంతో, మేడమ్ లోపలికి వచ్చింది.

లోపలికి రాగానే, ముందు బొకే ఇచ్చింది.

తర్వాత తన చేతిలోని వోడ్కా బాటిల్ ఇచ్చింది.

తర్వాత మరోసారి గట్టిగా వాటేసుకుని పెద వుల మీద ముద్దిచ్చింది.

ఫ్రెష్‌గా తయారైన, గోరువెచ్చగా ఉన్న కలా కంద ముక్కను కొరికినంత మధురంగా ఉంది మేడమ్ అధరం.

నేను పరవశంతో కౌగిలి బిగించాను.

అప్పుడు మేము లోకం మరిచిపోయాము.

అప్పుడు ఆమె డీసీపీ కాదు.

నేను ఫిలిం డైరెక్టర్ కాదు.

ఆమె ప్రకృతి.

నేను పురుషుణ్ణి.

తను ఈవ్.

నేను ఆడమ్.

ఇక మా మధ్యన రసగంగ ప్రవాహమే!

అసలు ఎవరం ఏంచేశామో కానీ, ఐదు నిమి షాల్లో ఇద్దరమూ నా బెడ్‌రూంలో.. నా పరుపు మీద అప్పుడే పుట్టిన పాపాయి డ్రస్సుల్లోకి మారి పోయాము.

ఇద్దరి ఆవేశాలు, ఆయాసాలు తీరాక ఒకరి నొకరం చూసుకుని సిగ్గుపడిపోయాం.

"ఏంటి ఇలా చేశావ్?" అని అడిగింది మేడమ్ చిలిపిగా.

"మేడమ్! ఇది అన్యాయం. అమాయకుణ్ణని నా మీద అభాండాలు వేస్తున్నారు. మీరే కదా ముందు నన్ను మీ కౌగిలిలో బంధించి హాట్‌హాట్ కలాకంద ముద్దిచ్చింది" అన్నాను నేను కూడా చిలిపిగా.

"అయితే మాత్రం... నువ్వు వద్దనొచ్చు కదా, గుడ్‌బోయ్ లాగా?" అంది బుంగమూతి పెడుతూ.

"లేదు మేడమ్.. ఈ విషయంలో మీ విష యంలో నేను ఎప్పటికీ బ్యాడ్‌బోయ్ లాగానే ఉండాలనుకుంటున్నాను" అనీ, "అయినా మేడమ్ గారి ఆజ్ఞ మీరడం నా వల్ల కాదు. మీరేది కోరుకున్నా అది ఇవ్వడం నా కర్తవ్యం" అన్నాను నవ్వుతూ.

తర్వాత ఇద్దరమూ పార్టీ చేసుకున్నాం.

ఈసారి కూడా పార్టీ పరుపులోనే ముగిసింది.

●●●

తనువుల ఆకలి, కడుపుల ఆకలి చల్లారింది. మేమిద్దరమూ అలాగే పరుపుపై పడుకుని ఉన్న పుడు మేడమ్ చెప్పడం ప్రారంభించింది.

●●●

"ఆరోజు నువ్వు నన్ను సీయం క్యాంపు ఆఫీసు దగ్గర దించి వెళ్ళాక చాలా తతంగమే జరిగింది.

---

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## సినీవాలి -7 (30-11-2016)

మా ప్రశ్న: జలజకు సినిమా ప్రొడ్యూసర్ ఎన్నెకరాల ల్యాండ్ గిఫ్ట్‌గా ఇచ్చాడు?

మీ జవాబు---------------------------------------------------------------

చిరునామా---------------------------------------------------------------

------------------------------------------------------------------------

-----------------------------పిన్-----------------ఫోన్‌నెం.-----------------

**ఈ కూపన్‌ను 29 నవంబర్ 2016 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా:నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

అసలు అక్కడున్న సెంట్రీలు నన్ను లోపలికి వదలడానికి ఒప్పుకోలేదు. నేనేమో డీసీపీనని చెప్పకూడదని అనుకున్నాను. డీసీపీనని చెబితే, రాజమార్గం గుండా వెళ్ళొచ్చు. కానీ, నా మీద అటాక్ ప్లాన్‌చేసిన వాళ్ళకు ఆ విషయం క్షణాల్లో చేరిపోతుంది. ఇక సీఎంని కూడా ఏమార్చే ప్రయత్నం చేస్తారు. ఒత్తిళ్ళు పెంచుతారు. ఏదో జరగబోతుందని ముందు జాగ్రత్తగా కుతంత్రం చేస్తారు. ఇక్కణ్ణుంచి కాకపోతే ఢిల్లీ నుంచే ప్రయత్నాలు ప్రారంభిస్తారు. అందుకే సీఎం కార్యాలయంలో నాకు నమ్మకస్థుడైన ఒక అధికారి ద్వారా లోపలికి వెళ్ళడానికి, నా ముసుగు తీసే అవసరం లేకుండానే, అనుమతి సంపాదించి అతనితోటే కలిసి లోపలికి వెళ్ళాను.

సీఎం పీఆర్‌వోను కలిసి 'సార్‌ను అర్జంటుగా కలవాలని' రిక్వెస్ట్ చేశాను. వాళ్ళు అస్సలు ఒప్పుకోలేదు. నేను నా ముసుగును తీయలేదు.

"చాలా అర్జెంట్. ఒక ఇన్ఫర్మేషన్ ఇవ్వాలని వచ్చాను. ఒక్క సీఎంగారికి తప్ప ఎవ్వరికీ ఇచ్చే ప్రసక్తే లేదు. మీరు కాదంటే వెళ్ళిపోతాను. డైరెక్టుగా టీవీ ఛానల్స్‌లో కూర్చుని, మీరు నన్ను సీఎం గారిని కలవనీయలేదని, మీ నిర్వాకాన్ని బట్ట బయలు చేస్తాన'ని బెదిరించాను.

వాళ్ళు చీఫ్ పీఆర్‌ఓ దగ్గరకు తీసుకువెళ్ళారు. నేను మళ్ళీ అదే చెప్పాను.

"సార్! యూడోంట్ రిగ్రెట్ ఇఫ్ యూ లెట్ మీ ఇన్? ఐయామ్ డూయింగ్ దిస్ ఫర్ ది బెనిఫిట్ ఆఫ్ ది గవర్నమెంట్!" అని ఇంగ్లీషులో దబాయించేసరికి ఒప్పుకున్నారు. కానీ, ముసుగు తీయమన్నారు. నేను తీసే సమస్యే లేదన్నాను.

సీఎం క్యాంపు ఆఫీసుకు వచ్చి అంత సెల్ఫ్ కాన్ఫిడెన్స్‌తో మాట్లాడుతున్న నన్నుచూసి, నా మాటలో ధ్వనిస్తున్న అధికారదర్పానికి, సిన్సియారిటీకి వాళ్ళు కన్విన్స్ అయ్యారు. ఏదో మతలబు ఉందని సమాధానపడ్డారు. నన్ను లోపలికి పంపించారు. సీఎం గారు ఒంటరిగా ఉన్నప్పుడే నేను లోపలికి వెళతానన్నాను.

"సారుకు పది నిమిషాల్లో మైక్రోసాఫ్ట్ కంపెనీ ప్రతినిధులతో మీటింగ్ ఉంది. తొందరగా... ఐదు నిమిషాలు మాత్రమే మీ టైం" అని అంటూ ఏ విధమైన ప్రొటోకాల్ పాటించాలో వివరించారు. వాళ్ళకు తెలియదు కదా నేను ఎన్నోసార్లు అదే చాంబర్‌లో అనేక మీటింగులకు హాజరయ్యానని.

నేను సీఎంగారి చాంబర్‌లోకి ప్రవేశించాక కూడా ముసుగు తీయలేదు.

"ఎవరమ్మా మీరు? బాగా గొడవ చేస్తున్నారట?" అన్నారు సీఎంగారు కొంచెం కోపంగా.

"అవును సార్! నాదొక చిన్నరిక్వెస్ట్ సార్! దయచేసి ఇక్కడి సీసీటీవీలు, రికార్డింగ్స్ ఆపించండి సార్. ఇటీజ్ డెడ్లీ కాన్ఫిడెన్షియల్".

"ఏం మాట్లాడుతున్నారమ్మా? హౌం డూ యు థింక్ యూ ఆర్ టాకింగ్ టు! అసలు మిమ్మల్ని లోపలికి పంపింది ఎవరు?" అంటూ బెల్ నొక్కబోయారు.

"సార్! నేను మాట్లాడబోయేది ఇతని గురించే" అంటూ చిన్నపేపరు మీద సయీామ్ పేరు రాసి చూపించాను.

"ఈజిట్?"

"యస్సార్!" అని నిటారుగా నిలబడి సెల్యూట్ చేశాను.

సీఎం గారి ఆర్డర్ ప్రకారం సీసీటీవీలు, రికార్డింగ్స్ ఆగిపోయాయి.

నేను నా ముసుగు తొలగించాను.

ఆయన నన్ను ఆశ్చర్యంగా చూశారు.

"యూ ఆర్....?"

"యస్సార్! ఐయామ్ పుష్ప, డీసీపీ".

"అవునవును, నాకు తెలుసు. రాత్రే మీ ఇంటి మీద దాడి జరిగిందనీ, అహూజా అనే ఐఏఎస్ ఆఫీసర్ చనిపోయాడనీ, నిన్ను కిడ్నాప్ చేశారనీ, డీజీపీగారు కూడా చెప్పారు. వీ ఆల్ ఆర్ వర్రీడ్ యాక్చువల్లీ! థాంక్ గాడ్ యూ ఆర్ సేఫ్!

"అవునుసార్! రాత్రి నా మీదనే వాళ్లు అటాక్ ప్లాన్ చేశారు. పాపం అహూజాగారు బలయ్యారు. కానీ... నేను ముందే ఇలాంటిదేదో జరగబోతుందని సస్పెక్ట్ చేసి తప్పించుకుని ఓ ఫ్రెండు దగ్గర రాత్రి షెల్టర్ తీసుకున్నాను".

"అసలు ఏమిటిదంతా?" అన్నారు నా ముసుగును ఉద్దేశించి.

"సార్, మొన్న రాత్రి జలజ అనే ఓ జూనియర్ ఆర్టిస్టుని ముక్కలు ముక్కలుగా నరికి చంపేశారు. నేను ఆ కేసును ఇన్వెస్టిగేట్ చేశాను సార్! ఐదేళ్ళక్రితం జలజకు, ఓ సినిమా ప్రొడ్యూసర్ నానక్‌రాంగూడలో ఐదెకరాల ల్యాండ్ గిఫ్టుగా ఇచ్చాడు సార్! ఇప్పుడు ఆ స్థలాన్ని ఆనుకుని మంత్రిగారు ఓ పదెకరాలు కొనుక్కుని, జలజకు ఇచ్చిన ఐదెకరాలు కూడా అమ్మమని ప్రొడ్యూసరుకు కబురుపెట్టారు. ప్రొడ్యూసర్ గారేమో, ఆ స్థలం జలజకు ఇచ్చానని చెప్పడంతో, మంత్రిగారు ఆ పనిని సయీామ్‌కి పురమాయించాడు. జలజ ఆ స్థలాన్ని అప్పటికే వేరేవాళ్ళకి బేరం పెట్టి అడ్వాన్స్ కూడా తీసుకుంది. ఆమె ల్యాండ్ ఇవ్వడానికి ఒప్పుకోకపోవడంతో ఆమెను చంపేశారు. ఆమె దగ్గర ల్యాండ్ కొన్నవాడికి కూడా అదే గతి పడుతుందన్న మెసేజ్ వెళ్ళాలని, ఆమెను అతి క్రూరంగా నరికి చంపారు".

ఇంతలో ఇంటర్‌కామ్ మోగింది.

"మైక్రోసాఫ్ట్ వాళ్ళను ఐటీ మినిస్టర్ గారితో మీట్ కమ్మని చెప్పండి. ఐటీ మినిస్టర్‌కి కూడా వీళ్ళను ఎంగేజ్ చేయమని ముందుగానే చెప్పండి. అండ్ వన్ మోర్ థింగ్. డోంట్ డిస్టర్బ్ మీ, టిల్ ఐ కాల్ యూ, డోంట్ కం ఇన్సైడ్ వితౌట్ మై పర్మిషన్!"

"అయితే, సయీామ్ గ్యాంగ్ ఎన్ని ప్రికాషన్స్ తీసుకున్నా, జలజ టూ ఇంటెలిజెంట్ సర్! ఆ హత్యా దృశ్యాలన్నీ కన్సీల్డ్ కెమేరాలలో రికార్డయ్యాయి. మా క్లూస్ టీం సహాయంతో అవన్నీ రిట్రీవ్ చేసి నా కస్టడీలోకి తీసుకున్నాను సార్. ఆ వీడియోలో సయీామ్ జలజని బెదిరించడం, తర్వాత సెక్సువల్ అసాల్ట్ చేయడం, ఆ తర్వాత అతని మనుషులు ఆమెను గ్యాంగ్ రేప్ చేసి చంపేసి ముక్కలు ముక్కలుగా నరకడం మొత్తం క్లియర్‌గా రికార్డయ్యింది సార్! ఒక్క సయీామ్ మాత్రమే కాదు సార్... మన వాళ్ళు చాలా మందే ఆ వీడియోల్లో ఉన్నారు సార్! నాకు ఏదో ఎవిడెన్స్ దొరికిందని వాళ్ళు అనుమానపడుతున్నారు సార్! మంత్రి గారు కూడా థ్రెటెన్ చేశారు సార్! నిన్నటినుంచి, మా డిపార్టుమెంట్ వాళ్ళతో పాటు చాలామంది ప్రముఖులు ఫోన్‌చేసి హింసిస్తున్నారు సార్! టార్చర్ చేస్తున్నారు. నేను ఆ ఎవిడెన్స్ వాళ్ళకు ఇవ్వకపోతే సయీామ్‌ని పంపిస్తామని వార్నింగు కూడా ఇచ్చారు. అందుకే, నేను ఎవిడెన్స్ అంతా కలెక్ట్ చేసుకుని, రాత్రికిరాత్రే వాళ్ళ కళ్ళుగప్పి, దొంగలాగా బయటపడి, ఓ ఫ్రెండింట్లో తల దాచుకుని ఇప్పుడు మీ దగ్గరకు వచ్చాను సార్!"

"ఆ ఎవిడెన్స్ మీ దగ్గరుందా ఇప్పుడు?"

"ఉంది సార్!"

***(ఇంకావుంది)***



## కెఫే కస్టమర్లకు రోబోలతో ఓరల్ సెక్స్

కస్టమర్లను ఆకట్టుకునేందుకు, ఖర్చులు తగ్గించుకునేందుకు ఇప్పుడు సేవారంగంలో రోబోలను ఎక్కువగా ఉపయోగిస్తున్నారు వ్యాపారస్థులు. కొందరైతే మరింత ముందుకు వెళ్ళిపోయి వికృతమైన ఆకర్షణలు ప్రవేశపెడుతున్నారు.

పర్యాటక ప్రదేశమైన స్విట్జర్లాండ్‌లోని ఒక కెఫేలో రోబోలను ప్రవేశపెడుతున్నారు. ఇందులో కొత్తేమిటి? అని ఆలోచిస్తే కొత్తదనమే ఉంది. కాఫీ తాగడానికి వచ్చే కస్టమర్లకు ఈ హోటల్‌లో రోబోలతో ఓరల్ సెక్స్‌కు త్వరలో అవకాశం కల్పిస్తారట. అయితే ఓరల్ సెక్స్ కోసం మొదట నిజమైన వ్యభిచారులనే ప్రవేశ పెడదామని ఆలోచించారట. కానీ తర్వాత ఆలోచనలు మార్చుకుని రోబోలను ప్రవేశపెట్టాలని నిర్ణయించారట.

జెనీవాలోని ఒక హోటల్‌లో కస్టమర్లు కాఫీ ఆర్డర్



ఇవ్వడానికి ముందుగానే, ఐపాడ్‌లో ఓరల్ సెక్స్ రోబోను బుక్ చేసుకోవాలట! ఈ లైంగిక చర్యలకు, హాట్ డ్రింక్స్ కోసం ఒక్కొక్క కస్టమర్ 40 పౌండ్లు అదనంగా సమర్పించుకోవాలి. థాయ్‌లాండ్‌లో చేసిన విధంగానే ఫేస్‌గర్ల్ ఫర్మ్ జెనీవాలో కూడా ఈ ఏడాది చివరినాటికి రోబోలతో ఓరల్ సెక్స్ ప్రవేశపెట్టేందుకు ఏర్పాటు చేస్తోంది.

అందమైన రోబోలను తయారుచేసి ఇచ్చే బాధ్యతను అమెరికాలోని ఒక పరిశ్రమకు అప్పగించినట్టు జెనీవాలోని ఫేస్ గర్ల్ ఫర్మ్ ప్రతినిధి Bradley Charvet చెప్పారు. ఒక్కొక్క ఉమన్ రోబో తయారీకి 2,400 పౌండ్లు ఖర్చు అవుతుందట. వచ్చే జనవరి లోపు ఎనిమిది అందమైన విమెన్ రోబోలు ఈ కెఫేలో రెడీగా ఉంటాయట. బార్‌లో కూర్చుని ఏదైనా చేసుకోవడానికి వీలుగా కస్టమర్లకు ఒక్కొక్క రికీ పది నిమిషాలు సమయం మాత్రమే ఇస్తారు. ఆ సమయం సరిపోతుందనీ, అప్పటికి 'కస్టమర్ పని పూర్తైపోతుందనీ' ఆయన చెప్పారు. ఈ కాఫీ కోసం 60 స్విస్ ఫ్రాంకులు చెల్లించాలి. డ్రింక్స్ కావాలంటే మరో ఐదు ఫ్రాంకులు అదనంగా చెల్లించాలి. అయితే వ్యభిచార వ్యతిరేక బృందం దీనిని తీవ్రంగా ప్రతిఘటిస్తోంది. మగవారిని ప్రలోభపెట్టి వ్యాపారం చేసేందుకే ఇలా చేస్తున్నారని ఈ బృందం ఆగ్రహం వ్యక్తం చేసింది.






**రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు**
**మాదిరాజు గోవర్ధనరావు**
**పేజీలు:** 248
**ప్రతులకు:** రచయిత, న్యాయవాది, పెదకోనేటివీధి, మంగళగిరి-03 మొబైల్ 09440264336

రెండు వందల సంవత్సరాల క్రితం మరణించిన రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు ఈనాటికీ చిరస్మరణీయుడే. స్వాతంత్రేచ్ఛతో ఈస్టిండియా కంపెనీ వారిని ముప్పుతిప్పలు పెట్టి 33 ఏళ్ళు 551 గ్రామాలు పాలించిన ప్రజాసంక్షేమ పాలకుడి చరిత్రే ఈ పుస్తకం. అమరావతీ నగర నిర్మాత, మంగళగిరి లక్ష్మీ నరసింహస్వామి ఆలయగాలిగోపుర అద్భుత నిర్మాత ఈతడే. రాజనీతిజ్ఞుడు, పరాక్రమశాలి. ఇదో గొప్ప పరిశోధనాత్మక గ్రంథం.

---

**పండు వెన్నెల**
**కతలు, కవిత్వాలు, అనుభవాలు**
**సంపాదకులు:** మల్లీశ్వరి, కె.పద్మ, నిశాంత్
**ధర:** 100 రూపాయలు,
**పేజీలు:** 90
**ప్రతులకు:** అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు

సాహిత్యానికీ, పిల్లలకూ అంతరం చెరిపేసే గొప్ప లక్ష్యంతో కొందరు రచయితలు చూపిన చొరవకు ప్రతిరూపమే ఈ పుస్తకం. పిల్లలతో సాహితీ యాత్రలు చేసిన రచయితలు ఆ పిల్లల్లోని ఔత్సాహిక రచయితలను, వారి సృజనను వెలికితీయగలిగారు. తెలుగుసమాజంలో పిల్లల మానసిక వికాసంకోసం జరిగే ఆదర్శవంతమైన సరికొత్త యత్నాల్లో ఇదో బిగ్ లీప్.



---



**జతగాళ్ళు, కతగాళ్ళు**
**కెం. మునిరాజు, గానోళ్ళ సురేశ్‌రెడ్డి**
**ధర:** 55 రూపాయలు,
**పేజీలు:** 120
**ప్రతులకు:** మంచి పుస్తకం, 12-13-439, వీధి నెం-1, తార్నాక, సికింద్రాబాద్-17
సెల్: 98482 96865, 97907 46614.

జనంనోట్లో నానే ఇరవైఒక్క కథలే ఇవన్నీ! కృష్ణదేవరాయలు పరిపాలించిన ప్రాంతంగా చెప్పే తమిళనాట కృష్ణగిరి జిల్లాకు చెందిన రచయితల సంఘం ద్వారా వెలువరించిన 21 స్థానిక కథలివి. వ్యవహారిక తెలుగులో ఈ కథలు మళ్ళీ మన ముందుకు వచ్చాయి.

---

**కథాయణం**
**అనిల్ ఎస్.రాయల్**
**ధర:** 60 రూపాయలు
**పేజీలు:** 88
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన, నవోదయ పబ్లిషర్స్, నవోదయ బుక్‌హౌస్‌లు, ప్రభవ, నెల్లూరు ప్రజాశక్తి బుక్‌హౌస్‌లు.

రెండువేల మంది సభ్యులతో ఫేస్‌బుక్‌లో అలరిస్తున్న సాహితీ సమూహం 'కథ గ్రూప్' కోసం అనిల్ ఎస్.రాయల్ 'కథాయణం' పేరిట రాసిన వ్యాసాలివన్నీ. ఔత్సాహిక కథకులకు సూచనలుగా పనిచేస్తాయి.

తాను కథలు రాసే పద్ధతి ఎలా ఉంటుందో రచయిత ఈ ఎనిమిది వ్యాసాల్లో వివరించారు. 'కథనోత్సాహకులకు' ఉపయుక్తమైన పుస్తకమిది.



---



**కడుపుకోత**
**కథా సంపుటి**
**దేవరాజు మహారాజు**
**ధర:** 75 రూపాయలు,
**పేజీలు:** 92
**ప్రతులకు:** అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

యువతరం కథారచయిత దేవరాజు మహారాజు. సొంతబాణీతో, మాండలికం మీద అభిమానంతో రచనలు చేసే రచయిత. తెలంగాణ పల్లె జీవనాన్ని కళాత్మకంగా కళ్ళకు కట్టిన పది కథలివి. తెలంగాణ మాండలికం కథల్ని మొదటిసారిగా ఒక సంపుటిగా తెచ్చిన ఘనత వీరిదే.

**-లలితా త్రిపుర సుందరి**




# ఓపెన్ అండ్ షట్ కేసు!

**'ఏమిటీ, ఇలా వచ్చావు?' రాస్తున్న రిపోర్టు లోంచి తల ఎత్తి చూసి అన్నాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.**

**నవ్వుతూ అతని ఎదురుగా కూర్చున్నాడు డిటెక్టివ్ శరత్.**

'ప్రఖ్యాత క్రికెటర్ కనకరాజు కేసు' అన్నాడు.

'దాన్లో పరిశోధించేది ఏముంది? కనకరాజుకు భార్య అనితతో విడాకుల భరణం కేసు నడుస్తోంది. కనకరాజు భార్యని కొట్టటం, హింసించటం వంటి పలు వివాదాస్పద అంశాలు వెలికి వస్తున్నాయి. ఇంతలో అతని భార్యకు బిజినెస్‌మేన్ భవానీతో సంబంధం ఉన్నట్టు తెలిసింది.

అతని ఇమేజ్ పాడవుతుందనే భయంతో, భార్యనూ, భవానీని రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకుని, చంపేసి ఉండవచ్చు. హత్య జరిగిన స్థలంలో ఒక గ్లవ్ దొరికింది. రెండవ గ్లవ్ కనకరాజు ఇంటి బయటున్న చెత్తడబ్బాలో దొరికింది. హత్యకోసం ఉపయోగించిన కత్తిని కనకరాజు రెండురోజుల క్రితం సూపర్ మార్కెట్‌లో కొన్నట్టుగా వీడియో క్లిప్ ఉంది. హత్య జరిగిన స్థలంలో హతుల రక్తంతో కలిసి కనకరాజు రక్తం దొరికింది. కత్తితో పొడిచేప్పుడు అతడికి గాయమై ఉంటుంది. కానీ అతడు వంట చేస్తుంటే గాయం అయిందంటున్నాడు. పైగా హత్య జరిగిన సమయంలో ఇంట్లో ఉన్నానంటున్నాడు. కానీ అతడిని బెంగుళూరులో అరెస్ట్ చేశాం. కాబట్టి కనకరాజు నేరస్థుడన్న విషయంలో ఎలాంటి అనుమానం లేదు' చెప్పాడు విజయ్.

'తాను నిర్దోషినని, అసలు నేరస్థుడిని పట్టుకుని తనను రక్షించమని నాకు కబురు పంపించాడు. ఓసారి కలవాలని వచ్చాను' అన్నాడు శరత్.

'నీ ఇష్టం. కేసు మాత్రం దాదాపుగా క్లోజ్ అయినట్టే!' అన్నాడు విజయ్.

●●●

'నేనీ హత్యలు చేయలేదు. ఎవరో తెలివిగా నాపై నేరం మోపుతున్నారు. నేను నిరపరాధిని' ఏడుస్తూ అన్నాడు కనకరాజు.

అతడిని పరిశీలనగా చూసి, 'మీరు నిరపరాధి అయితే మీ గ్లవ్స్‌లో ఒకటి హత్యాస్థలంలో ఎలా దొరికింది? ఇంకోటి మీ ఇంట్లో చెత్తడబ్బాలో ఎలా దొరికింది? మీరు కొన్న కత్తితో హత్య ఎలా జరిగింది? మీ రక్తం, హతుల రక్తంతో ఎలా కలిసింది?' అడిగాడు శరత్.

రెండు చేతులతో తల పట్టుకున్నాడు కనకరాజు.

'నాకు తెలియదు'.

'హత్య జరిగిన సమయంలో మీరు ఎక్కడ ఉన్నారు?'

'ఇంట్లోనే ఉన్నాను'.

'మీరు ఇంట్లో ఉన్నట్టు ఎవరైనా చూశారా?'

'నేను ఇంట్లో ఉన్నట్టు నిరూపించాల్సి వస్తుందని తెలిసి ఉంటే, అందరినీ పిలిచి నన్ను చూసి పొమ్మనేవాడిని'.

'మీరు బెంగళూరు ఎలా వెళ్ళారు?'

'విమానంలో. నేను క్యాబ్ బుక్ చేసుకున్నాను. అతడు వచ్చేసరికి నేను ఇంట్లో ఉన్నానో లేదో ఆ క్యాబ్ డ్రైవర్ మాత్రమే చెప్పగలడు!' అంటూ వివరాలు చెప్పాడు.

'ఇది పోలీసులకు చెప్పలేదా?'

'చెప్పాను. కానీ క్యాబ్ ఇంటికి చేరిన సమయానికి హత్య జరిగిపోయిందట! హత్య చేసి ఇంటికి వచ్చి, క్యాబ్ ఎక్కి వెళ్ళిపోయానంటున్నారు. కానీ నాకు హత్య చేయాల్సిన అవసరం లేదు. ఎప్పుడయితే ఆమెకు వేరేవాడితో సంబంధం ఉందని తెలిసిందో, అప్పుడే కేసు బలహీనమైపోయింది.'

'మీరు హత్య చేయలేదని నిరూపించే ఆధారం ఏదైనా ఉందా?'

'అది మీరే కనుక్కోవాలి.'

ఇంతలో శరత్‌కి ఫోన్ వచ్చింది. ఫోన్‌లో మాట్లాడిన శరత్, కనకరాజువైపు సూటిగా చూస్తూ, 'నిజం ఒప్పుకోండి... మీ కారులో హత్యకు వాడిన కత్తి దొరికిందట'.

కనకరాజు ముఖం పాలిపోయింది.

●●●

'బాస్! కేసు వదిలేయటమే మంచిది. హత్య చేసిన కత్తి దొరకటమే కాదు, కనకరాజు ఆరోజు సాయంత్రం కారులో బయటకు వెళ్ళాడని పొరుగింటివాళ్ళు చెప్పారు. క్యాబ్ రావటానికి కొద్ది నిమిషాలముందే వచ్చాడని చెప్తున్నారు' గబగబా చెప్పాడు అసిస్టెంట్ రాము, ఫైళ్లు తెచ్చి శరత్‌కి అందిస్తూ.

**అతడో ప్రముఖ క్రికెటర్. అతడి భార్యకు వేరొకరితో సంబంధం ఉందని తెలిసిందతడికి. కానీ వారిద్దరూ హత్యకు గురయ్యారు. నేరం అతడిపై పడింది. నేనా హత్యలు చేయలేదంటూ డిటెక్టివ్‌ని ఆశ్రయించాడా క్రికెటర్. కానీ ఆధారాలన్నీ క్రికెటరే ఆ హత్యలు చేసినట్టుగా నిరూపిస్తున్నాయి. ఈ కేసులో డిటెక్టివ్ నేరస్థులను పట్టుకోవడానికి ఎలాంటి వ్యూహం అనుసరించాడు? ఆ క్రికెటర్‌ని నిరపరాధిగా నిరూపించాడా?**

'ఫోన్ వివరాలు, బ్యాంక్ ఎకౌంట్ల వివరాలు సేకరించావా? కనకరాజు జైలుకి వెళ్తే లాభం ఎవరికో తెలుసుకున్నావా?' అడిగాడు శరత్.

'ఎవరికీలేదు. తన తరువాత ఆస్తి అనాథ శరణాలయానికి వెళ్ళాలని రాసిపెట్టాడు, భార్య వేరుపడగానే' చెప్పాడు రాము.

'అతని భార్యకు, ఆమె ప్రియుడికి శత్రువులు ఎవరైనా ఉన్నారేమో తెలుసుకున్నావా?'.

'యెస్ బాస్! అలాంటివేమీ లేవు'.

'ఓ పని చెయ్యి.. మరోసారి ఇంటి చుట్టుపక్కల వారిని ప్రశ్నించు. అలాగే క్యాబ్ డ్రైవర్ వివరాలు కూడా సేకరించు' చెప్పాడు శరత్.

'యెస్ బాస్' అని వెళ్ళిపోయాడు రాము.

పోలీస్ రిపోర్టులను పరిశీలించటం ప్రారంభించాడు శరత్. పాయింట్లను గుర్తు పెట్టుకున్నాడు.

మళ్ళీ జాగ్రత్తగా చదవటం ఆరంభించాడు. ఈసారి ముందు గుర్తుపెట్టుకున్న అంశాలను జాగ్రత్తగా పరిశీలించటం ఆరంభించాడు.

శరత్ భృకుటి ముడిపడింది. ఆ పేరాను ఒకటికి రెండుసార్లు చదివి, ఆలోచిస్తూ కూచున్నాడు.

●●●

'ఇంకా అయిపోలేదా నీ పరిశోధన?' అడిగాడు విజయ్, గదిలోకి అడుగుపెట్టిన శరత్‌ని చూసి.

'మీ పోలీసుల రిపోర్టులను నువ్వు పరిశీలించావా?' అడిగాడు శరత్.

'అఫ్‌కోర్స్' అన్నాడు విజయ్ కళ్ళెగరేసి.

'హత్య జరిగిందని తెలియగానే అక్కడకు చేరుకున్న పోలీసుల రిపోర్టు చూడు. తరువాత పరిశీలించిన డిటెక్టివ్‌ల రిపోర్టు చూడు' రిపోర్టులు అందించాడు శరత్.

గబగబా చదివాడు విజయ్. చదువుతుంటే విజయ్ ముఖంలో రంగులు మారాయి.

'నేను గమనించలేదు' అన్నాడు మెల్లగా. 'ఇవి ఎవరికి వారు వేర్వేరుగా ఇచ్చిన రిపోర్టులు'.

'ఈ రిపోర్టులు ఇచ్చినవారిని ప్రశ్నించాలి. అప్పుడు తీసిన ఫోటోలు చూడాలి' అన్నాడు శరత్.

అందించాడు విజయ్.

ఫోటోలను పరిశీలించి, కొన్ని ఫోటోలను పక్కన పెట్టాడు.

ఇంతలో ప్రాథమిక రిపోర్టు రాసిన పోలీసు వచ్చాడు. 'ఈ రిపోర్టులో రాసినదంతా నిజమేనా?' అడిగాడు శరత్.

తల ఊపాడతడు.

తరువాత రిపోర్టు రాసిన డిటెక్టివ్‌నీ, ఫోటోగ్రాఫర్‌నీ అదే ప్రశ్న అడిగాడు శరత్.

అదే సమాధానం వచ్చింది.

వాళ్లు వెళ్ళిన తరువాత విజయ్ వైపు చూశాడు శరత్.

'పోలీసులు వచ్చినప్పుడు 'గ్లవ్' లేదు. డిటెక్టివ్‌లు వచ్చేసరికి గ్లవ్ ఉంది. ఈ మధ్యకాలంలో ఎవరో అక్కడ గ్లవ్ ఉంచారు. అంటే, ఎవరో నేరం కనకరాజుపై నెట్టాలని ప్రయత్నిస్తున్నారు' అన్నాడు



శరత్ నిశ్చయంగా.

●●●

కనకరాజు ఇంటి బయట కారు ఆపి దిగాడు శరత్. ఇంటి చుట్టూ తిరిగి చూశాడు.

లోపల చెత్తడబ్బాను చూశాడు. 'ఎవరైనా గ్లవ్‌ని లోపలకు విసిరి వేయవచ్చు. అది చెత్త డబ్బాలో పడటం యాదృచ్ఛికం' అనుకున్నాడు.

ఇంటి మెయిన్‌గేటు, చెత్తడబ్బా ఉన్న స్థలాన్ని పరిశీలించాడు.

'హడావుడిలో ఉన్నవాడు, బయట క్యాబ్ ఎదురు చూస్తుండగా, కారు దిగి పార్క్‌చేసి ఇంత దూరం వచ్చి డస్ట్‌బిన్‌లో గ్లవ్ పారేసి వెళ్తాడా?' అన్నాడు శరత్, విజయ్‌తో. 'చూస్తుంటే, కారులో కత్తి దొర కటం కూడా కుట్రలో భాగం అనిపిస్తోంది' అన్నాడు విజయ్.

తల ఊపాడు శరత్.

●●●

తల వంచుకున్నాడు కనకరాజు.

'ఆరోజు ఏం జరిగిందో చెప్పకపోతే నేరం మీరు చేయలేదని నిరూపించటం కష్టం' నిర్మొహ మాటంగా చెప్పాడు శరత్.

'టెక్నికల్ పాయింట్ల ఆధారంగా బెనిఫిట్ ఆఫ్ డౌట్ నాకు రాదా?' అడిగాడు.

'కానీ జీవితాంతం మచ్చ ఉంటుంది'.

'నాకు ఆలోచించుకోవటానికి సమయం కావాలి' అన్నాడు కనకరాజు.

'ఎక్కువ సమయం లేదు' చెప్పాడు శరత్ బయటకు వస్తూ.

●●●

'బాస్, ఇవి గత సంవత్సరం ఫోన్ రికార్డులు' అందించాడు రాము.

వాటిని పరిశీలించటం ప్రారంభించాడు శరత్. ఫోన్ నెంబర్ల పక్కన, చేసినవాళ్ళ పేర్లు ఉన్నాయి. రెండుమూడుసార్ల కంటే ఎక్కువసార్లు వచ్చిన నెంబర్ల జాబితాను చూడటం ప్రారంభించాడు శరత్.

ఒక నెంబరు దగ్గర అతని దృష్టి ఆగిపోయింది. ఎందుకంటే, ఆ నెంబరు నుంచి ఫోన్ వచ్చింది. ఎత్తగానే సెకనుకే కట్ అయింది. కానీ ఆ వెంటనే మరో నెంబర్‌కి, కనకరాజు నెంబర్ నుండి ఫోన్ వెళ్ళింది.

రెండు నెంబర్లూ రాసుకొని, రామువైపు చూశాడు శరత్.

●●●

తలుపు తీసి శరత్ వైపు ప్రశ్నార్థకంగా చూసిందా అమ్మాయి.

తనని పరిచయం చేసుకున్నాడు శరత్.

ఆమె నవ్వి 'మీకు ఇంతకాలం పడుతుందని అనుకోలేదు. తనని రక్షించుకోవటానికి కనకరాజు ముందు నా పేరు చెప్తాడనుకున్నాను' అందామె.

శరత్ మాట్లాడలేదు.

'అవును. ఆ రోజు నా దగ్గరకు వచ్చాడు కనక రాజు. హత్య జరిగిన సమయంలో నాతోనే ఉన్నాడు. మా ఇద్దరిదీ ఎవరికీ తెలియని సంబంధం. దాన్ని అలాగే ఉంచాలనుకున్నాం. ఎట్టి పరిస్థితులలోనూ ఎవరికీ చెప్పనన్నాడు. కానీ వాగ్దానభంగం చేశాడు' అందామె నిరసనగా.

శరత్ ఏదో అనబోయాడు. అంతలో అతడికి రాము నుంచి మెసేజ్ వచ్చింది.

'మీ భర్త ఇంట్లో ఉన్నారా?' అడిగాడు శరత్.

'లేరు. ఆఫీసులో ఉన్నారు'.

'అడ్రస్ చెప్పండి'.

ఆమె చెప్పింది. అడ్రస్ చూసి నవ్వాడు శరత్.

'అది కూడా చెప్పాడా, నాకు వంట చేస్తుంటే అతడి వేలు తెగిందని' శరత్ బయటకు వెళ్తుంటే అడిగిందామె.

'కనకరాజు నోరు విప్పలేదు. చెప్పాల్సిందంతా మీరే చెప్పారు' అన్నాడు శరత్.

ఆమె 'షాక్ తిన్నట్టు చూసింది శరత్‌వైపు.

●●●

'ఆనంద్ అనాథ శరణాలయం'లోకి అడుగు పెట్టాడు శరత్. అతనివెంటే విజయ్, రాము ఉన్నారు. తిన్నగా ఫౌండర్ మేనేజర్ 'ప్రబుద్ధ' గది లోకి వెళ్ళారు.

'మిమ్మల్ని అనిల, భవానీ హత్యకేసులో అరెస్టు చేయటానికి వచ్చాము' సూటిగా చెప్పాడు శరత్.

'ప్రబుద్ధ' మాట్లాడలేదు. కాసేపటికి 'మీరు అబద్ధం చెప్తున్నారు. మీదగ్గర ఋజువులు లేవు' అన్నాడు.

'మీ భార్య అప్రూవర్‌గా మారింది. నిజం చెప్పింది.'

'అబద్ధం. ఆమె ఇపుడే ఫోన్ చేసింది. ఆమెకి ఏమీ తెలియదు' అన్నాడు ప్రబుద్ధ.

విజయ్ అడుగు ముందుకువేసి అతడిని పట్టుకున్నాడు.

'నీకు, నీ భార్యకూ కనకరాజుకూ ఉన్న సంబంధం తెలుసు. నీ భార్య ద్వారా కనకరాజును ఒప్పించి, అతని తరువాత ఆస్తి అంతా అనాథ శరణాల యానికి రాయించావు'.

'అబద్ధం'.

'అనిల, భవానీలను హత్యచేసి నేరం కనకరాజు పైకి నెట్టాలని ప్రయత్నించావు. కనకరాజు గ్లవ్స్ మీ ఇంట్లో మరచిపోయాడు. వాటిని తీసి దాచావు. ఇంతకీ పోలీసులకు దొరికిన కత్తి కనకరాజు కొన్నది కాదు. అతడు కొన్న కత్తి మీ ఇంట్లోనే ఉంది'.

'అబద్ధం. నా భార్య ఇదంతా చెప్పదు'.

'ఆస్తి వచ్చిన తరువాత, కనకరాజుకి శిక్ష పడిన తరువాత ఆమెను నువ్వు చంపుతావని నమ్మించాను' నవ్వుతూ అన్నాడు శరత్.

కుర్చీలో కూలబడ్డాడు ప్రబుద్ధ.

'ప్రాణం పోయేస్థితిలో కూడా ఆమె గురించి చెప్పని కనకరాజుని, డబ్బుకోసం హత్యలు చేసి, భార్యతో సంబంధం ఉందనే నేరం కనకరాజుపై నెట్టి ప్రతీకారం తీర్చు కోవాలనుకునే నీతో పోల్చి, ఎవరు మంచివారో గ్రహించిందామె' అన్నాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ,**
**సెల్: 98496 17392**

# మట్టివాసన

-రాచపూటి రమేష్

**"నారాయణ బాబాయ్ నుంచి ఫోన్ వచ్చింది శ్రీహరికి. నేను పద్దెనిమిదో తారీఖు రామేశ్వరం - ఓఖా ఎక్స్‌ప్రెస్‌లో కడపకు వస్తున్నాను. వీలైతే స్టేషన్‌కి వచ్చి రిసీవ్ చేసుకో. నీ ఇంట్లో రెండు, మూడు రోజులుండి వెళ్తాను. కడపలో నాకు కొన్ని పనులున్నాయి. అవి చూసుకొని వెళ్ళాలి" అన్నాడు బాబాయి ఫోన్లో.**

శ్రీహరి ఎగిరి గంతేసినంత పని చేశాడు. నాలుగేళ్ళ తరువాత బాబాయి తన ఇంటికి వస్తున్నాడు. ఆ మూడు రోజులూ బాబాయికి రాచమర్యాదలు చేసి ఆయన కృపకు పాత్రుడ వ్వాలనుకున్నాడు శ్రీహరి.

శ్రీహరి ఆత్రుతకు కారణం లేకపోలేదు. నారాయణ బాబాయి పెద్ద కోటీశ్వరుడు. ఆయుర్వేద వైద్యంలో దిట్ట. ప్రొద్దుటూరులో మూడు దశాబ్దాల పాటూ గొప్ప ఆయుర్వేద వైద్యుడిగా వెలుగొందాడు. రాయలసీమ జిల్లాలన్నీ విరివిగా పర్యటిస్తూ, ఎవరికీ అంతుబట్టని దీర్ఘకాల వ్యాధులను తన మూలికావైద్యంతోనూ, లేహ్యాలు, కషాయాలతోనూ నయం చేసి 'అపర ధన్వంతరి'గా పేరు గాంచాడు. ఆయనకు ప్రొద్దుటూరులో ఒక పెద్ద ఇల్లు, రాజంపేట సమీపంలో మామిడితోట, తమలపాకుల తోట ఉన్నాయి. నారాయణ మేష్టారు ఎందరికో వైద్యవిద్యలోని మెళకువలు నేర్పాడు. వారు వివిధ ప్రాంతాల్లో తమ గురువుగారి పేరు చెప్పుకొని వైద్యవృత్తిలో రాణిస్తూ ఉన్నారు. కానీ ఆయన ఒక్కగానొక్క కొడుకు ఎంబీబీయస్, ఆ తరువాత ఎం.డీ చేసి తండ్రి మాటలు ఖాతరు చేయకుండా విదేశాలకు ఎగిరిపోయాడు. ఆయుర్వేద వైద్యం నేర్చుకొని, తన వృత్తిని కొనసాగించమని నారాయణ ప్రాధేయపడినా వినలేదతను. కొన్నాళ్ళకు బాబాయి కొడుకు ఆనంద్ ఆ దేశంలోనే మరో డాక్టరు పిల్లను పెళ్ళాడి అక్కడే సెటిలై పోయాడన్న వర్తమానం బాబాయికి అందింది. అప్పటికే భార్యపోయి పుట్టెడు దుఃఖంలో ఉన్న బాబాయికి దెబ్బమీద దెబ్బ తగిలింది. దానితో కొడుకుమీద కోపంతో తానిక వాడి ముఖం చూడనని శపథం చేశాడు నారాయణ.

ఆనంద్ మళ్ళీ ఇండియా రానే లేదు. అతడి నుండి ఫోన్లు, మెయిళ్లు లేవు. నారాయణ కూడా కొడుకుతో మాట్లాడాలని ప్రయత్నించింది లేదు. అన్న కొడుకైన శ్రీహరిలోనే తన కొడుకును చూసుకుంటూ ఉన్నాడు.

శ్రీహరి కడపలో ఒక ప్రభుత్వశాఖలో జూనియర్ అసిస్టెంట్‌గా పనిచేస్తూ ఉన్నాడు. చాలీచాలని జీతంతో భార్యాపిల్లలను పోషిస్తూ ఉన్నాడు. అద్దె ఇంటిలో ఉంటూ పిల్లల కాన్వెంట్ చదువులకు డబ్బు సర్దలేక అవస్థలు పడుతూ ఉన్నాడు.

నారాయణ బాబాయి ప్రాక్టీసు మానేస్తున్నానని ప్రకటించిన రోజున ఆయన శిష్యులు ఆయనకు ప్రొద్దుటూరులో ఘనసన్మానం చేసి వైద్యరంగానికి ఆయన చేసిన సేవలను వేనోళ్లా పొగిడారు. శ్రీహరి, బాబాయిని కలిసి తన ఇంటికే వచ్చి ఉండిపొమ్మని ప్రాధేయపడ్డాడు.

"ఇంకా నా భవిష్యత్తు కార్యక్రమం నిర్ణయించుకోలేదు. అయినా నువ్వింతగా పిలుస్తున్నావు కాబట్టి నీ తృప్తికోసం నీ ఇంటికొచ్చి కొన్ని రోజులుంటాను" అన్నాడు బాబాయి.

శ్రీహరి, అతని భార్య సునీత నారాయణకు ఎన్నో సేవలు చేశారు. పిల్లల గురించి శ్రీహరి పడుతున్న అవస్థలను గమనించాడు నారాయణ.

"ఇకనుండి నీ పిల్లల ఫీజులు, పుస్తకాలకయ్యే ఖర్చంతా నేనే భరిస్తాను. ఇక్కడ లేకపోయినా, ఏడాదికొకసారి డీడీ తీసి పంపుతాను" అని బలవంతంగా శ్రీహరి చేతిలో ఇరవై వేల రూపాయలుంచాడు నారాయణ. ఆయన ఆప్యాయతకు శ్రీహరి ఒళ్ళు పులకరించింది.

కానీ ఇన్నాళ్ళు బిజీగా ఉండీ ఉండీ, ఒక్క



సారిగా విశ్రాంత జీవితం గడపాల్సి రావడం నారాయణ బాబాయ్‌కి చాలా విసుగ్గా అనిపిస్తూ ఉన్నట్లుంది. అంతలోనే రామేశ్వరం దగ్గరలోని హనుమాన్ ప్రకృతి చికిత్సాలయంలో ఉన్న ఆయన మిత్రుడి ద్వారా ఆయనకొక మంచి అవకాశం దక్కింది. ఇరవై ఎకరాల్లో అక్కడ ఔషధ మూలికలను, ఆయుర్వేద మొక్కలను పెంచుతున్నారు. వాటిని ఉపయోగించి మొండి వ్యాధులకు సరైన మందులను తయారుచేయగల నిష్ణాతులైన వైద్యులు వారికి కావాలి. నారాయణకున్న పేరు ప్రఖ్యాతులను గురించి విని ఉండటంతో ఆ వైద్యశాల వారు మంచి జీతంతో తమ ఆశ్రమంలోని ప్రయోగశాలలో కొత్త ఔషధాలను కనుగొనేందుకు నారాయణగారిని ఆహ్వానించారు.

"నువ్వు మాకు పెద్దదిక్కుగా ఇక్కడే ఉంటావనుకున్నాను బాబాయ్" అన్నాడు శ్రీహరి, రామేశ్వరానికి బయల్దేరుతున్న నారాయణతో. "మరేం బెంగపెట్టుకోవద్దు. అప్పుడప్పుడు వచ్చి మిమ్మల్నందరినీ చూసి వెళుతూనే ఉంటా" అన్నాడు నారాయణ.

అలా అన్నాడేగాని రామేశ్వరానికి వెళ్ళి నాలుగేళ్ళైనా నారాయణ ఇటువైపు రానేలేదు. అప్పుడప్పుడూ శ్రీహరి ఫోన్‌చేసి ఆయనను రమ్మని ఆహ్వానించినా, ఏదో కారణం చెప్పి తన ప్రయాణాన్ని ఎప్పటికప్పుడు వాయిదా వేసేవాడు నారాయణ. పిల్లల చదువులకు మాత్రం ఎప్పటికప్పుడు ఆయన నుండి డబ్బు అందేది.

"నీకు మా ఇంట్లో వసతిగా ఉండదేమో! మంచి హోటల్లో నీకు బస ఏర్పాటుచేస్తాను బాబాయ్" అన్నాడు శ్రీహరి కడప రైల్వేస్టేషన్‌లో ట్రైను దిగిన నారాయణతో.

"ఎందుకులేరా, ఇంట్లోనే నాకు బాగుంటుంది. పిల్లలతో సరదాగా గడపవచ్చు" అన్నాడు నారాయణ.

"పోనీ మానసాఇన్ హోటల్లో భోంచేసి వెళదాం. అక్కడ మష్రూమ్ ఫ్రై, గోబీ మంచూరియా, జీరా రైస్ బాగా వండుతారని మా ఆఫీసర్ చెప్పాడు" అన్నాడు శ్రీహరి.

"అక్కడికెందుకూ? అమ్మాయి చేతివంట తిని చాలా రోజులైంది" అని శ్రీహరిని బయల్దేరదీశాడు నారాయణ. "బాబాయ్, ఇంకా డైనింగ్ టేబుల్ కొనలేదు. నువ్వు కింద కూర్చొని భోజనం చేయగలవో లేదో" అని సంశయంగా అన్నాడు శ్రీహరి ఆటోలో వెళ్తుండగా.

**అతడో పెద్ద కోటీశ్వరుడు. అపర ధన్వంతరిగా పేరుగాంచాడు. ఆయుర్వేదంలో ఎందరికో మెళకువలు నేర్పాడు. కొడుకుని కూడా తనంతటివాడిని చేయాలని కలలు కన్నాడు. కానీ ఆ కలలన్నీ కల్లలయ్యాయి. ఒక్కగానొక్క కొడుకుని పక్కన పెట్టి, అన్న కొడుకుని చేరదీశాడు. అతడి కోరిక నెరవేరిందా? అన్నకొడుకు మూలికా వైద్యం నేర్చుకున్నాడా?**

"మరేం ఫర్వాలేదు. నాకు ఇంకా మోకాళ్ళనొప్పులు రాలేదు. పీట పైనే కూర్చొని భోంచేస్తాను" అన్నాడు నారాయణ నవ్వుతూ.

శ్రీహరికి మనసులో నారాయణ బాబాయి తనకున్న ఆస్తులలో కొన్నైనా తనకిస్తాడని నమ్మకం ఉంది. అందుకే భార్య సునీతకు చెప్పి ఎన్నో వంటకాలు సిద్ధం చేయించాడు. అడుగడుగునా నారాయణకు రాచమర్యాదలు చేస్తూ ఉన్నాడు.

"ఈ హంగులన్నీ నాకెందుకురా, ముసలివాణ్ణి! అమ్మాయ్ సునీత, ఇన్నిరకాలు నేను తినలేనమ్మా. నాకు గోంగూర పచ్చడి, ఇంగువచారు, మజ్జిగ చాలు. ఇవన్నీ పిల్లలు తింటారులే అని నారాయణ, సునీత వడ్డించబోతున్న పదార్థాలనన్నింటినీ సున్నితంగా తిరస్కరించాడు.

శ్రీహరి పిల్లలకు తాను తెచ్చిన కొత్త బట్టలు అందజేసి, ఆ రాత్రి వాళ్ళకు కొన్ని మంచికథలు, కబుర్లు చెప్పాడు నారాయణ. పిల్లలు అవి వింటూ హాయిగా నిద్రపోయారు.

మైదుకూరులో ఉన్న నా మిత్రుడు రంగస్వామికి లంగ్ కేన్సర్ అట. అతగాడి పరిస్థితి ఏమీ బాగాలేదట. కేవలం అతడిని చూడడానికే నేనింత దూరం రావడం. ఒకసారి వెళ్ళొద్దాం. నువ్వూ నాతోరా, ఈరోజు ఆదివారమే గదా" అన్నాడు మరుసటి రోజు నారాయణ శ్రీహరితో.

"అలాగే బాబాయ్, టాక్సీ మాట్లాడమంటావా?" అని అడిగాడు శ్రీహరి. "అక్కర్లేదు, నా మిత్రుడొకడు తనకారు పంపుతానని అన్నాడు" చెప్పాడు నారాయణ. డైమండ్ థియేటర్ల ఓనరు పంపిన ఇండికా కారు మరో పావుగంటలో వచ్చింది. శ్రీహరితో కలిసి నారాయణ మైదుకూరు బయల్దేరాడు.

"ఈ మేలో తిరుపతికి ట్రాన్స్‌ఫర్ చేయించుకుందామని అనుకుంటున్నాను బాబాయ్. సునీతది చిత్తూరు జిల్లా కదా! ఇక్కడ ఫ్యాక్షన్లు, బాంబుల సంస్కృతి అని, గలాటా మనుషులని ఆమె భయపడుతూ ఉంది" అన్నాడు శ్రీహరి.

"అదెందుకురా? ఇక్కడి మనుషుల మాట కఠినమైనా, మనసు మంచిది. చాలా సహాయంగా ఉంటారు. అన్నమయ్య, వీరబ్రహ్మంగారు, యోగి వేమన లాంటి మహనీయులు పుట్టిపెరిగిన జిల్లా ఇది. అందుకే బ్రౌన్‌దొర, థామస్ మన్రోలాంటి వాళ్ళు ఇక్కడ పని చేయడానికి అంత ఉత్సాహం చూపారు" అన్నాడు నారాయణ. శ్రీహరి తల ఊపాడు.

"ఆనంద్ నుండి ఫోన్లూ, లెటర్లేవైనా అందాయా?" అన్న శ్రీహరి మాటలను మధ్యలోనే కట్‌చేసి, "కొందరికి డబ్బే కానీ అనుబంధాలు, ఆప్యాయతలు అక్కర్లేదు. వాడిమాట నా దగ్గర ఎత్తకు" అన్నాడు నారాయణ కోపంగా.

నారాయణను చూసి, అతని మిత్రుడు రంగస్వామి ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయ్యాడు. రంగస్వామి కోడలు ఉమ శ్రీహరికి కాఫీ, నారాయణకు చిక్కని ఆవుపాలు ఇచ్చింది. నారాయణ మిత్రుడి కోసం తాను తయారుచేసిన వనమూలికల పొడిని ఇచ్చాడు.

"వేడి నీటిలో ఒక చెంచాపొడి కలిపి, మూడు పూటలూ తీసుకో! రెండు నెలల్లో నీ జబ్బు తగ్గ





## దటీజ్ సన్నీ!

సన్నీ బాలీవుడ్‌లో స్టార్ హీరోయిన్ కాకపోయినా అభిమానులకు మాత్రం కొదవేం కాదు. ఆమె కోసమే పదే పదే సినిమా చూసే అభిమానులు అక్కడ కోకొల్లలు. ఈ విషయాన్ని గ్రహించిన దర్శకనిర్మాతలు తమ సినిమాలో ఓ సాంగ్ చేయించారు. అప్పుడెప్పుడో మాధురీ దీక్షిత్ చేసిన 'చోళీ కే పీఛే క్యా హై' కన్నా సన్నీ చేసిన .'బ్లాక్ బస్టర్ ఛోళీ' సూపర్ డూపర్ సక్సెస్ అవుతుందని వారు బాగా ఆశపడ్డారు. అయితే మధ్యలో సెన్సారు వారు ఆ పాటలో కొన్ని సన్నివేశాలను తీసేస్తామన్నా ఆ దర్శకనిర్మాతలు 'నో' అన్నారట! చివరికి సినిమాకు 'ఎ' సర్టిఫికెట్ వచ్చిందట!

ముఖం పట్టకపోతే చూడు రంగబ్బీ" ధీమాగా అన్నాడు నారాయణ.

రంగస్వామి, అతడి కొడుకూ, కోడలూ భోజనానికి ఉండమని బలవంతం చేశారు. కానీ బద్వేలు సమీపంలో ఉన్న తన గురువు అవధూత పెద్దినాయన ఆశ్రమానికి భోజనానికి వస్తానని మాట ఇచ్చానని చెప్పి, మిత్రుడి దగ్గర సెలవు తీసుకున్నాడు నారాయణ.

"ఈ అవధూత గురువుగారు ఎవరు బాబాయ్, నాకెప్పుడూ చెప్పనేలేదు" కారు దట్టమైన లంకమల అడవుల గుండా ప్రయాణిస్తుండగా అడిగాడు శ్రీహరి.

విండోలోంచి 'పచ్చని చుక్కల చీర కట్టుకున్న పల్లెపడుచులా మెరుస్తున్న ప్రకృతి' దృశ్యాలను చూస్తూ ఉన్న నారాయణ చిరునవ్వు నవ్వాడు.

"యాభై ఏళ్ళ నుండీ మా గురువు. పెద్దాయనకి ఎనభై ఏళ్లుంటాయి. అష్టాంగమార్గాన్ని నిష్ఠగా జీవితమంతా ఆచరించిన వ్యక్తి. అష్టాంగమంటే తెలుసుగదా, యమ నియమ ఆసన ప్రత్యాహారాదులని బౌద్ధంలోనూ, మన హైందవ ధర్మంలోనూ చెప్పబడినది. ఆయన వాక్శుద్ధి గల కారణ జన్ముడు. ఈరోజు నన్ను తన ఆశ్రమానికి రమ్మని ఆదేశించాడు" అన్నాడు నారాయణ.

"ఈ అవధూతలెవరు బాబాయ్? ఈ మాట కడప జిల్లాలోనే ఎక్కువగా వినిపిస్తూ ఉంటుంది" అన్నాడు శ్రీహరి ఉత్సుకతతో.

"ఔనురా! కడప పాత బస్టాండు సమీపంలో ఒకప్పుడు దిశమొలతో జీవించిన యోగి గురించి వినే ఉంటావు. చేతిస్పర్శతో ఆయన కొన్ని మొండి రోగాలను నయం చేసేవాడంటారు! ఆయన మూఢనమ్మకాలను వ్యాప్తి చేస్తున్నాడనీ, ఊరు వదిలి పొమ్మని ఒక కలెక్టరు ఆదేశిస్తే ఖండ ఖండాలుగా నరకబడిన ఆయన దేహం క్యాంపుకు వెళ్ళి తిరిగివచ్చిన కలెక్టరుకి కనిపించిదట! కారులో తన ఆఫీసుకి తిరిగివచ్చిన కలెక్టరుకి, ఆఫీసు దగ్గర సజీవంగా నడిచొస్తున్న యోగి కనబడి, తికమక పెట్టాడట. మళ్ళీ ఆయన జోలికి పోలేదా కలెక్టరు. ఖండయోగం తెలిసిన యోగి! ఆయనకు భిక్ష వేస్తే వెయ్యిరెట్లు తిరిగిస్తాడంటారు ప్రజలు!

పోరుమామిళ్ళ దగ్గర అవతారపురుషుడిగా చెప్పబడే మరో అవధూత తెలుసుగా! ఆయన మాటలు నిజమవుతాయని, సీఎంలూ, పీఎంలూ కూడా ఆయన దగ్గర జోస్యం చెప్పించుకునేవాళ్ళు. తనవద్దకు వచ్చినవారిని కొళాయి నీళ్ళతో తడిపేసే బాబా ఒకరు, సదా నీళ్ళలో మునిగి ఉండి అతిథులడిగిన ప్రశ్నలకు శాస్త్రం చెప్పే యోగిని ఒకరు, దిగంబరంగా ఉండి తన వద్దకు వచ్చిన వాళ్ళను బూతులుతిట్టి బురదచల్లే స్వామి ఒకరు! ఆయన బూతులు తిట్టినా, అదే మహాభాగ్యమని మురిసిపోయే ప్రజలు ఎందరో ఉన్నారిక్కడ. అందరినీ మహిమాన్విత స్వరూపులని అనడం లేదు నేను. నమ్మకం ఎంత బలమైనదో నీకు చెప్పడానికే ఇదంతా చెప్పాను" అన్నాడు నారాయణ బాబాయ్ గంభీరంగా.

ఏరుపక్కన, పచ్చని చెట్ల మధ్య రమణీయంగా కనిపిస్తున్న పెద్దినాయన ఆశ్రమాన్ని సమీపించింది కారు. ఆశ్రమం బయట సిద్ధంగా ఉన్న స్వామి వారి శిష్యులిద్దరు కారు దగ్గరకు వచ్చి వారిని సాదరంగా ఆశ్రమం లోపలకు తీసుకువెళ్ళారు. రెల్లుగడ్డి కప్పిన ఒక కుటీరంలో ఉన్నారట పెద్దినాయనస్వామి.

స్ఫటికంలా మెరుస్తున్న శివలింగం ముందు పరచిన ఎర్రటి తివాచీపై ధ్యానముద్రలో కూర్చుని ఉన్నాడు పెద్దినాయన స్వామి. ఆయన ముఖవర్చస్సు చూసి ఎవ్వరూ ఆయనకు ఎనభై ఏళ్ళు ఉంటాయని అనుకోరు. ఆయనకు కొద్ది దూరంలో తివాచీపై నారాయణ, శ్రీహరి కూర్చున్నారు. ఆ వాతావరణంలో ఏదో దివ్యత్వం గోచరించింది శ్రీహరికి.

పావుగంట తరువాత నెమ్మదిగా కళ్ళు తెరచిన పెద్దినాయన నారాయణను చూసి చిరునవ్వు నవ్వాడు.

"నిన్ను చూసి ఎన్నో ఏళ్ళయినట్లుంది నాయనా! ఎట్లా ఉన్నావు? చూడగానే ఆరోగ్యంగా లేవని తెలిసిపోతూ ఉంది. ఏమిటి సమస్య? ఈ అబ్బాయెవరు?" గబగబా ప్రశ్నలు సంధించాడు స్వామి.

నారాయణగారు శ్రీహరిని స్వామికి పరిచయం చేశాడు. కాసేపు కుశలప్రశ్నలు వేశాక, నారాయణను దగ్గరకు పిలిచి, ఆయన నాడిని పరీక్షించాడు పెద్దినాయన స్వామి.

"నీ నాడీ వ్యవస్థ బలహీనంగా ఉంది. తీవ్రమైన వ్యాధి నిన్ను పీడిస్తూ ఉంది. నిజమేనా?" అని అడిగాడు స్వామి, కళ్ళు మూసుకునే.

"ఔను స్వామి! ఏడాది నుండీ లుకేమియాతో బాధపడుతున్నాను. మరో ఆర్నెల్లో, ఏడాది కన్నా ఆశ లేదన్నారు ఇంగ్లీషు వైద్యులు" అన్నాడు నారాయణ.

శ్రీహరి అప్రతిభుడయ్యాడు. "నారాయణ బాబాయ్‌కి బ్లడ్ కేన్సరా?" ఆ మాట నమ్మశక్యంగా లేదతనికి. కొద్దిగా మెత్తబడినా బాబాయి ఆరోగ్యంగానే ఉన్నాడనుకున్నాడతను.

"మూలికావైద్యంలో ఎవరెస్టు శిఖరమంతటి వాడివి! నీకు ఇంగిలిపీసు డాక్టర్లతో పని ఏమి? నీ మూలికలు, కషాయాలతో ఈ వ్యాధిని నయం చేయడమెంతసేపు?" పరిహాసంగా అన్నారు స్వామి.

"ప్రయత్నించి చూశాను స్వామి. అవేవీ నా జబ్బుని తగ్గించలేక పోయాయి. అయినా ఇంకా చాలాకాలం బతకాలన్న ఆశ నాకు లేదు" చిరునవ్వుతో అన్నాడు నారాయణ బాబాయి.

"లేదు, నీ ఆలోచన సరైనది కాదు. వైద్యరంగం ఎంత పురోగమించినా ఎవరికీ అంతుపట్టని కొత్త కొత్త రోగాలూ, జ్వరాలూ పుట్టుకొస్తూనే ఉన్నాయి. ఎయిడ్స్, ఎబోలా, స్వైన్‌ఫ్లూ, డెంగ్యూ ఇంకా ఎన్నెన్నో! మన ప్రాచీన వైద్యవిధానంలో మహర్షులు చాలా వ్యాధులకు మందులు తయారుచేశారు. ఈ

జబ్బులకూ కనిపెట్టవచ్చు. ఎవరికీ పనికిరాని తుచ్ఛులు రాలిపోయినా ఫర్వాలేదుగానీ, నీలాంటి వారు చిరకాలం బతికి, నలుగురికీ మేలు చేయాలి! దగ్గరకు రా, నీ కర్తవ్యాన్ని తెలియజేస్తాను' అని పిలిచారు పెద్దినాయనస్వామి గంభీరంగా.

నారాయణస్వామి వారి దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు. శ్రీకృష్ణుడు అర్జునుడికి గీతోపదేశం చేసినట్లు స్వామివారు చిన్నగా నారాయణతో ఏదో మాట్లాడారు. తరువాత నారాయణ చెవిలో ఏదో మంత్రోపదేశం చేశారు. కాసేపు నారాయణ బాబాయి ఆ మంత్రాన్ని శ్రద్ధగా మననం చేసుకున్నాడు.

"ఈ మంత్రాన్ని రోజుకు వీలైనన్నిసార్లు జపించు. మనోనిబ్బరం కోసం ప్రతి ఉదయం స్నానం చేశాక, నిష్ఠగా నరసింహ శతకం పారాయణం చేసుకో. నీ ఆరోగ్యం కోసం ప్రతి పౌర్ణమికి మృత్యుంజయ హోమం ఇక్కడ ఆశ్రమంలో నిర్వహిస్తాను" అని నారాయణ తలపై చేయివేసి ఆశీర్వదించారు పెద్దినాయన. నారాయణకేదో దివ్యానుభూతి కలిగినట్లైంది.

స్వామివారి శిష్యులు భోజనానికి ఏర్పాట్లు చేశారు. వేడి వేడి రాగి సంకటి, అందులో నంజుకునేందుకు ఎర్రగడ్డల కారం, జొన్నరొట్టెలు, పప్పు, అలసంద వడలు, అతిరసాలు, పెరుగు... తినడానికి రుచిగా ఉండే భోజనమది.

"నాదీ ఈ నేలే! ఈ నేల తిండి ఇదే! నీవనుకున్న జీరా రైసు, గోబీ మంచూరియాలు కావు" శ్రీహరితో నవ్వుతూ చెప్పాడు నారాయణ, భోం చేస్తున్నప్పుడు. హరి తల పంకించాడు. ఆశ్రమం వారిచే నిర్వహించబడుతున్న గోశాల, వేద పాఠశాల, అనాథాశ్రమాన్ని దర్శించారిద్దరూ!

స్వామివారి దగ్గర మళ్ళీ ఆశీర్వాదం తీసుకొని, కారులో కడపకు బయలుదేరారు. రోడ్డుపై వాహనాల రద్దీ పెద్దగా లేదు. అరుదైన పక్షి కలివికోడి కనిపించిన అభయారణ్యమది! అందుకే ఆ రోడ్డుపై వాహనాలను నియంత్రించడం జరుగుతుంది.

శ్రీహరి మనసులో ఎన్నో సందేహాలు. "అలోపతి వైద్యానికీ, ఆయుర్వేద వైద్యంలో దిట్టైన నారాయణ బాబాయి మూలికా వైద్యానికీ లొంగని కేన్సరు, పెద్దినాయన స్వామి ఉపదేశించిన మంత్రాలకూ, జపాలకూ లొంగుతుందా? అంతా బాబాయి పిచ్చిగానీ" అనుకున్నాడు శ్రీహరి.

మరుసటిరోజు శ్రీహరి, పిల్లలు, సునీత దగ్గర సెలవు తీసుకొని నారాయణ బాబాయి రామేశ్వరానికి బయలుదేరాడు. వెళ్లేముందు యథావిధిగా శ్రీహరి పిల్లల ఫీజుల కోసం కొంత సొమ్మును శ్రీహరికి అందజేశాడు.

నారాయణ బాబాయ్ మరో ఏడేళ్ళు బతికాడు. ఏ ఏడాదికా ఏడాది హరి పిల్లల చదువుల ఖర్చునంతా భరించాడు. వాళ్ళు చదువులు పూర్తి చేసి మంచి ఉద్యోగాల్లో స్థిరపడ్డారు.

నారాయణ బాబాయి చనిపోవటానికి ఆరు నెలల ముందు, ఏ వైద్యవిధానానికీ అంతుచిక్కని ఒక తీవ్రమైన జబ్బుకు మూలికా వైద్యం ద్వారా విరుగుడు మందు కనుగొన్నాడని, పేపర్లలో ఆయన చేసిన పరిశోధనల గురించి, ఫోటోతో సహా ప్రముఖంగా వార్త వచ్చింది. ప్రభుత్వం వారు ఆయనకు ప్రతిష్ఠాకరమైన అవార్డు ప్రకటించారు. కానీ ఆ అవార్డు అందుకోకముందే నారాయణ బాబాయి మరణించాడు. చనిపోయేముందు ఆయన తన అవయవాలన్నింటినీ ఒక ప్రముఖ హాస్పిటల్‌కు డొనేట్ చేసేందుకు అంగీకార పత్రం ఇచ్చాడు.

నారాయణ బాబాయి అంత్యక్రియలు జరిగిన రెండునెలల తరువాత శ్రీహరికి రామేశ్వరంలోని ఆశ్రమం ద్వారా ఒక కవర్ అందింది. శ్రీహరి పేరుతో ఒక బ్యాంకులో డిపాజిట్ చేసిన రసీదు, బాండు అందులో ఉంది. నారాయణ బాబాయి ప్రొద్దుటూరులోని తన ఇంటిని పేదలకు ఉచితంగా వైద్యం చేసే ఓ హాస్పిటల్‌కు, తోటల నుండి వచ్చే ఆదాయాన్ని ఆయుర్వేద వైద్యంలో పరిశోధనల నిమిత్తం రామేశ్వరంలోని చికిత్సాలయానికి చెందేలా వీలునామా రాశాడని తెలిసింది శ్రీహరికి. ఆయన ఔదార్యానికి శ్రీహరి కళ్ళు చెమ్మగిల్లాయి. మనసులోనే ఆ మహానుభావుడికి చేతులు జోడించాడు శ్రీహరి.

***సెల్: 98667 27042***

## మనమీదేనర్రోయ్!

సరసి











## ఆత్మవిశ్వాసమే వారి ఆయుధం

# 'షి'రోస్ రెస్టారెంట్

**రాజీపడడం ఆడపిల్లకు ఓ సామాజిక అలవాటు.**
**ఇతరులకోసం బతకడం, ఇతరుల కోసం ప్రతీదీ త్యాగం చేయడం**
**సమాజంకోసం జీవించడం..**
**దాష్టీకాలకు బలైపోవడం, అణగారిపోవడం**
**తమకంటూ ఏదీ మిగుల్చుకోకుండా బతుకీడ్చడం ఆడపిల్లలకు సమాజం చేసిన అలవాటు!**
**అనేక తరాలుగా నరనరాన జీర్ణింపజేసిన ఈ అలవాటు పేరే రాజీ..! త్యాగం!!**

నేటి సమాజంలో మహిళల సంభాషణలు అవి వారి చుట్టూ ఉన్న పరిస్థితులు, సమాజం మాట్లాడించేవేతప్ప తమకు ఇష్టమైన భావాల వ్యక్తీకరణ కాదంటున్నారు పరిశోధకులు.

ఇలాంటి పరిస్థితుల్లో తప్పు చేయకపోయినా శిక్ష అనుభవిస్తున్నారు కొందరు అమ్మాయిలు.

మగవారి యాసిడ్ దాష్టీకాలకు బలైన అలాంటి యువతులు కొందరు రాతిని చీల్చుకుని మొలిచే రావిమొక్కలా, ఆత్మవిశ్వాసమే ఆయుధంగా పునరుత్థానం చెందుతున్నారు. తమలాంటి మరింత మందిని అక్కున చేర్చుకుని ఇంకెందరికో స్ఫూర్తినిస్తున్నారు.

మరి ఆ కథనం ఏంటో తెలుసుకుందామా?

ఖరీదైన రెస్టారెంట్‌కు వెళితే మడత నలగని దుస్తుల్లో అందమైన అమ్మాయిలు చిరునవ్వులతో వంటకాలు వడ్డిస్తూ కనిపిస్తారు. కానీ ఆగ్రాలోని షిరోస్ రెస్టారెంట్‌కు మాత్రం అందుకు భిన్నమైన ప్రత్యేకత ఉంది. పేరుకు అదొక రెస్టారెంట్. కానీ అది రగిలిన హృదయాలను సేదతీర్చే వేదిక. కుప్పకూలిన కలల సౌధాన్ని సాకారం చేసే పునర్నిర్మాణ వేదిక!

ఆ రెస్టారెంటులో అమ్మాయిలుంటారు కానీ వాళ్ళు బాహ్య సౌందర్యంతో కాదు అంతఃసౌందర్యంతో మనకు జీవితాంతం గుర్తుండిపోతారు.

### ఏమిటీ రెస్టారెంట్ ప్రత్యేకత?

ఆగ్రాలోని తాజ్‌మహల్ సమీపంలో ఉంటుందీ 'షి'రోస్ రెస్టారెంట్. తాజ్‌మహల్ ప్రేమకు ప్రతిరూపమైతే, ఆ చేరువలోనే ఉన్న షిరోస్ రెస్టారెంట్ అంతులేని ఆత్మవిశ్వాసానికి ప్రతిబింబం. సమాధి కట్టిన అపురూప కట్టడానికి చేరువలో సమాధిలాంటి జీవితం నుంచి పునరుజ్జీవనం పొందినవారు ఏర్పాటు చేసిందే ఈ రెస్టారెంట్! యాసిడ్ బాధితులంతా కలిసి నడుపుతున్న ఈ కెఫె ఆకలి తీర్చడమే కాదు ఎందరికో అణువణువునా స్ఫూర్తి నింపుతోంది.

యాసిడ్ దాడులకు గురైన మహిళల గురించి మనందరికీ తెలుసు. పత్రికల్లో చదివి అయ్యో పాపం అనుకోవడం, మరిచిపోవడంతప్ప ఏమీ చెయ్యలేనివాళ్ళం. కానీ యాసిడ్ దాడుల తర్వాత వారి జీవితాలు ఎలా ఉంటాయో ఎవరైనా ఊహించగలరా? అలాంటి స్త్రీలను చేరదీసేదెవరు? ఆదరించి ఆశ్రయమిచ్చేదెవరు?

ఇలాంటి ఆలోచనలే చేసింది ఢిల్లీలోని ఛాన్స్ ఫౌండేషన్!

యాసిడ్ బాధితులను అక్కున చేర్చుకుంది. వారి భవిష్యత్తుకు బాటలు వేసే వేదికగా రూపాంతరం చెందింది.

### ప్రత్యేకం..సందేశాత్మకం

ఈ రెస్టారెంట్ ఎంతో కళాత్మకంగా, సందేశాత్మకంగా కనిపిస్తుంది. తాజ్‌మహల్ దగ్గరున్న ఆ కెఫెలోకి ఎంటరవ్వగానే మహిళా సాధికారికతకు సంబంధించిన ఫోటోలు, పెయింటింగ్స్, పుస్తకాలు కనిపిస్తాయి. అక్కడి టీవీలో కూడా వాటికి సంబంధించిన డాక్యుమెంటరీలు, ఫిల్ములే ప్రసారమవుతాయి.

వెదురుతో చేసిన ఫర్నిచర్.. మధురమైన సంగీతంతో, ఆహ్లాద వాతావరణంతో ప్రశాంతంగా ఉంటుంది. అక్కడి గోడలపై పెయింటింగ్స్ మన హృదయాల్ని కదిలిస్తాయి. ఆలోచింపజేస్తాయి. చెక్కబొమ్మలు, పాలరాతి, హస్తకళారూపాల్లో బాధితులు ప్రదర్శించిన నైపుణ్యం మనల్ని అలరిస్తుంది. కావల్సినవారు వాటిని కొనుక్కోవచ్చు. ఇది కేవలం ఆకలి తీర్చే రెస్టారెంట్ మాత్రమే కాదు ప్రేరణనిచ్చే కేంద్రం కూడా! ప్రస్తుతం ఈ రెస్టారెంట్‌ను గీత, రీతూ, నీతూ, డాలీ, రూప, చంచల్ అనే యాసిడ్‌బాధితులు నిర్వహిస్తున్నారు.

## రుచులెన్నో వ్యథలూ అన్నే

ఈ రెస్టారెంట్ రుచులను మాత్రమే వడ్డించి ఊరుకోదు. యాసిడ్ దాడి వ్యథలనూ కళ్ళకు కడుతుంది. హర్యానాలోని మారుమూల గ్రామ వాసి రీతూ. రాష్ట్రస్థాయి వాలీబాల్ క్రీడాకారిణి. అంతర్జాతీయ పోటీల్లో దేశం తరపున ప్రాతినిధ్యం వహించాలని ఎన్నో కలలుకంది. కానీ ఆమెపై యాసిడ్ దాడి చేశాడు ఆమె కజిన్. కుటుంబ సభ్యులే ఈ దాడి చేయించారు! సోదరుడు వరసైన ఆ కజిన్‌తో అనైతిక సంబంధాన్ని తిరస్కరించినందువల్లే రీతూ ఈ శిక్ష అనుభవిస్తోంది. ఈ సంఘటనలో ఆమె ఒక కన్ను పోగొట్టుకుంది. కానీ గుండెధైర్యం పోగొట్టుకోలేదు. ఆమె శరీరాన్ని కాల్చిన యాసిడ్, ఆమె నిరాశను కూడా కాల్చిబూడిదచేసింది. ఇప్పుడామె పునరుత్థానం చెందింది. రీతూ ఇప్పుడు షిరోస్ రెస్టారెంట్ మేనేజర్.

రెస్టారెంట్‌కు వచ్చే కస్టమర్లకు హాయ్ అంటూ నవ్వుతూ వెల్‌కమ్‌చెప్పే నీతూ మాథుర్‌పై ఆమె కన్నతండ్రే యాసిడ్‌దాడికి పాల్పడ్డాడు! తల్లి సైతం ఈ ఘటనలో గాయపడింది. కారణం ఏదైనా కావచ్చు, ఆ దాడిలో ఆమె ముఖం, కళ్ళు కాలిపోయాయి. ఇప్పుడు తల్లితో సహా నీతూ అదే రెస్టారెంట్లో విధులు నిర్వర్తిస్తోంది.

## తిరిగి నిర్మించుకునే దారిలో

అయినవాడో, కానివాడో ఎవరో ఒకరు యాసిడ్ పోసి వారి జీవితాలను చిందరవందర చేశారు. వారి కలలను కల్లలు చేశారు. అంతమాత్రంచేత అక్కడే వీరి జీవితం ఆగిపోలేదు. తమలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించే ఏ అవకాశాన్నీ వారు వదిలిపెట్టలేదు. పాకిస్తాన్‌లో ఉన్న ఒక బ్యూటీపార్లర్‌లో పనిచేసే యువతులను చూశాక షిరోస్ రెస్టారెంట్ పెట్టాలనే ఆలోచన వారికి కలిగిందట. ఇప్పుడు వీరు ఢిల్లీ, కాన్పూర్, లూధియానాలో సైతం షిరోస్ బ్రాంచ్‌లు ప్రారంభించబోతున్నారు.

## ర్యాంప్ వాక్‌లు

కేవలం ఈ కెఫె ఒక్కటే కాదు...కొంతకాలంగా ఈ యాసిడ్ బాధితులు ప్రపంచానికి తమ ధీరత్వం ఏమిటో చాటిచెబుతూనే ఉన్నారు. వివిధ రకాల డిజైన్ దుస్తులు ధరించి ఫోటోషూట్ సైతం నిర్వహిస్తున్నారు. తమ జీవితాలపై ఒక డాక్యుమెంటరీని రూపొందిస్తున్నారు. వీరిప్పుడు కమ్యూనిటీ రేడియో పెట్టబోతున్నారు. మొన్నీమధ్యే యాసిడ్‌దాడి బాధితురాలు రేష్మీ ఖురేషీ న్యూయార్క్ ఫ్యాషన్ వీక్‌లో పాల్గొని నాలుగ్గోడలకే పరిమితమైన ఎంతోమంది యాసిడ్ బాధితుల్లో స్ఫూర్తి నింపే ప్రయత్నం చేసింది. ఈమెకు తోడుగా మరో ఇద్దరు బాధితులు కూడా లండన్‌లో జరిగిన ఫ్యాషన్‌షోలో ర్యాంప్ వాక్ చేశారు. ఇందులో మనదేశానికి చెందిన లక్ష్మితో పాటు యూకేకి చెందిన ఆడెలెబెల్లిన్ కూడా పాల్గొని మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలపై అవగాహన కల్పించారు.

## స్టాప్ యాసిడ్ అటాక్స్

ప్రేమను తిరస్కరించిన కారణంగా 32 ఏళ్ళ వ్యక్తిచేతిలో దాడికి గురైంది లక్ష్మి. "స్టాప్ యాసిడ్ అటాక్స్" అనే నినాదంతో ఓ స్వచ్ఛంద సంస్థను కూడా నిర్వహిస్తోంది ఆమె. యాసిడ్ అటాక్స్ ఆపాలని ఆమె మనదేశంలోనే కాదు వివిధ దేశాలలోనూ ప్రచారం చేస్తోంది. ఆడెలెబెల్లిన్ కూడా ఆమ్లబాధితురాలే.

2014లో జరిగిన ఈ సంఘటన వల్ల బెల్లిన్ తన చెవితో పాటు జుట్టును కూడా కోల్పోయింది. ఇలా వేరువేరు దేశాలకు చెందిన ఈ ఇద్దరూ కలిసి మహిళల సమస్యలపై అవగాహన పెంచే ప్రయత్నం చేశారు.



## వీడియో సందేశం

ముంబైకి చెందిన సాధారణ యువతి రేష్మా ఖురేషీ! రెండేళ్ళ క్రితం యాసిడ్‌దాడిలో తన రూపం కోల్పోయింది. సొంత ఊరు అలహాబాద్‌లో కొన్ని రోజుల చికిత్స అనంతరం రేష్మ ముంబైలోని హాస్పిటల్‌లో చేరింది. ఎన్నో లక్షలు ఖర్చైనాగానీ ఆమె పరిస్థితి మెరుగుపడలేదు. యాసిడ్‌వల్ల ఓ కన్ను పూర్తిగా మూసుకుపోయింది. మరో కన్ను కనబడదు. కొన్నాళ్ళ ఇంట్లోనే ఉండిపోయిన రేష్మ మార్పు కోరుకుంది. ఆత్మవిశ్వాసం పెంపొందించుకుంది. అందుకే యాసిడ్ అమ్మకాలను నిషేధించమంటూ ప్రచారం ప్రారంభించింది. అందరికీ యూట్యూబ్‌లో సౌందర్య చిట్కాలు, మేకప్ పద్ధతులపై వీడియో క్లాసులు అందిస్తూ పాపులరైంది. ఆ వీడియోల ద్వారా కేన్స్ లయన్స్ అవార్డును కూడా పొందింది. ఫ్యాషన్ వీక్ డిజైనర్ల ప్రతిభకు ప్రపంచస్థాయి గుర్తింపునిచ్చే వేదిక న్యూయార్క్. వారు రూపొందించిన వస్త్రాలు ధరించి ర్యాంపుపై హొయలు ఒలకబోయాలని ప్రతి ఒక్క డిజైనర్ ఉవ్విళ్లూరుతుంటారు. ఆ ర్యాంప్‌పై హొయలొలికించి, అందరికీ స్ఫూర్తినిచ్చింది రేష్మాఖురేషి. ఎఫ్‌టీఎల్ మోడా అనే సౌందర్య ఉత్పత్తుల సంస్థ అందించిన అవకాశంతో ఈ ఫ్యాషన్ షోలో పాల్గొన్న రేష్మా ఫ్లోరల్ ప్రింట్ ఉన్న ఫ్లోర్ లెంగ్త్ దుస్తులు ధరించి అందరిమెప్పు పొందింది.

కేవలం రేష్మాఖురేషీ, లక్ష్మి, గీత, రూప మొదలైనవారే కాదు మొక్కవోని సంకల్పంతో ఆత్మవిశ్వాసంతో జీవితంలో ఏదో ఒకటి సాధించాలని ముందుకెళ్ళే ఇలాంటివారు చాలామందే ఉన్నారు.

*- విజేత దహగాం*






**కిచెన్లో పనిలో ఉంది లలిత. ఆమె ఆలోచనలు పరిపరి విధాలుగా పోతున్నాయి. రెండు కుటుంబాల మధ్య ఎన్నడూ లేని కొత్త వివాదం వల్ల ఒకళ్ళకొకళ్ళు మనసు విప్పి మాట్లాడుకోవడం లేదు సరికదా... కన్పించినా తడిపొడి మాటలు... తప్పించుకోవడానికి మాట్లాడుకుంటున్నారు. అటు భర్తకి ఎదురు చెప్పలేక, ఇటు వాళ్ళంతా దూరమవుతున్నందుకు తట్టుకోలేకపోతోంది. ఏమిటి పరిష్కారం? ఆలోచిస్తున్న లలితకి భర్తరాక అంతరాయం కల్గించినట్టయింది.**

"ఏమోయ్.. వంశీ ఎలా ఉన్నాడు? మాధురికి నచ్చాడా? తనేమంటోంది? ముందు నీకు నచ్చాడా?" అన్నాడు.

అప్పుడే అక్కడికి వచ్చిన మాధురి.. తండ్రి మాటలు విన్నది.

"వంశీ హిందీ హీరోలా ఉన్నాడు. మంచి చదువు, సంస్కారం అన్నీ పుష్కలంగా ఉన్నాయని పిస్తోంది. కానీ అతను నాకు నచ్చడంతో పనేంటి?" అంది.

"మనతో వాళ్ళు సంబంధం కలుపుకోవాలని ఇష్టపడుతున్నారు. నీకు పరిపూర్ణంగా నచ్చితే.. ఉయ్‌కెన్ ప్రొసీడ్" అన్నాడు రాజశేఖరం.

"... .. ..."

"పర్లేదు... ఆలోచించుకుని చెప్పు" అంటూ వెళ్ళిపోయాడు.

తల్లీకూతుళ్ళు మొహమొహాలు చూసుకుని తలలు పట్టుకున్నారు.

•••

"ఏవిటండీ! మళ్ళీ మొదటికొస్తున్నారు? మాధురిని ఓ మాట అడిగి కాదంటే.. మనం మరో సంబంధం చూడటం బావుంటుంది. అంతేగానీ ఆయనేదో చేసేస్తున్నాడని పిల్లల మనోభావాలు గ్రహించకుండా, మనమూ పగ, ప్రతీకారాలంటూ ఆజ్యం పొయ్యటం మంచిదంటారా?" అంది శారద.

భార్య మాట విన్పించుకోనట్టు కౌషిక్ వేపు తిరిగి... "కౌషిక్! నీ అభిప్రాయం త్వరగా చెబితే నేను పురుషోత్తానికి మాటివ్వడానికి కుదురుతుంది" అన్నాడు.

•••

"ఇప్పుడు వంశీ నచ్చాడని చెప్పాల్సింది నువ్వే



### జరిగిన కథ

పక్కపక్క ఇళ్ళల్లో స్థిరపడిన స్నేహితుల పిల్లలే కౌషిక్, మాధురి. ఒకరు డాక్టర్, మరొకరు ఇంజనీర్. పెద్దలు వారికి పెళ్ళిసన్నాహాలు చేస్తుంటారు. ఈ లోపు మాధురి ఫ్రెండ్ రూపతండ్రి వచ్చి కౌషిక్ తన కూతుర్ని ప్రేమిస్తున్నాడనీ, వారికి పెళ్ళిచేయాలనీ అడుగుతాడు. నిజానిజాలు తేలకముందే కౌషిక్ దోషిగా మారతాడు. ముస్సోరిలో ఐఏఎస్ శిక్షణ పొందుతున్న మాధురిని కలిసిన కౌషిక్ ఆమెకు అన్నీ వివరిస్తాడు. ఇంతలో వీరిద్దరి కుటుంబాల మధ్య ఉన్న దశాబ్దాలనాటి స్నేహం బీటలువారే స్థితికి చేరుకుంటుంది. మాధురి, కౌషిక్‌ల తండ్రులు వారికి వేరువేరు సంబంధాలు చేసేందుకు ముమ్మర అన్వేషణలో పడతారు.

ఆ తర్వాత.....

మాధురి! ఎందుకంటే మీ నాన్న ఏకపక్ష నిర్ణయం ఎప్పుడో తీసేసుకున్నారు. ఇది జస్ట్ నీ అభిప్రాయం కోసమే" అంది లలిత, వ్యంగ్యంగా.

అదేం పట్టించుకోని రాజశేఖరం... "రెండ్రోజుల్లో చెప్పినా పరవాలేదు. వంశీ త్వరలో స్టేట్స్ వెళ్తాడట. ఆ లోపలే.."

•••

"కొంచెం ఆలోచించుకోనివ్వండి డాడీ! వెంటనే చెప్పడానికి, చెయ్యడానికి నేను రోబోనికాదు... మనిషిని" అన్నాడు కౌశిక్ అసహనంగా.

•••

"అదే... త్వరగా చెబితే.. మళ్ళీ లీవుల సమస్య లేకుండా నిశ్చయతాంబూలాలు పుచ్చుకుని, అతను స్టేట్స్ నుండి వచ్చాక పెళ్ళి చేసెయ్యొచ్చు".

•••

"మాధురిని ఓ మాట అడిగాక, తర్వాత నిర్ణయిద్దాం. తొందరపడకండి" అనవసరంగా కౌషిక్‌ని బాధపెట్టకండి" అంది శారద, భర్తని పక్కకి పిలిచి.

"నీ కొడుకు చేసిన నిర్వాకానికి, ఏ మొహం పెట్టుకుని మాధురితో మాట్లాడమంటావు?.." చూశావుగా! ఆ రూపతో మన పుత్రరత్నం ఫోటోలు, ఫోజులు" అన్నాడు కౌషిక్‌కి విన్పించేలా.

•••

కౌషిక్, రూపల ఫోటోలు చూసి ఆవేశపడుతుందని ఆశించిన రాజశేఖరానికి, ఆశాభంగం కల్గిస్తూ, మాధురి లోపలికెళ్ళి నాలుగు ఫోటోలు తెచ్చి తండ్రి చేతికిచ్చింది. అవి చూసి అవాక్కవటం రాజశేఖరం వంతయింది.

•••

"డాడీ! ఈ ఫోటోలు కరెక్టని నమ్ముతున్నారా? అయితే ఉండండి" అని కౌషిక్ వేగంగా తన గదిలోకెళ్ళాడు.

•••

మాధురి ఇచ్చిన ఫోటోలు చూసిన రాజశేఖరం... "ఆ అమ్మాయి ఎవరితో తిరిగినా, ఎన్ని వందల ఫోటోలు ఇలాంటివి దిగినా, దటీజ్ నాట్ అవర్ ప్రాబ్లం! అలాంటి అమ్మాయి వెనక కౌషిక్ పడటం తప్పు!

•••

"అది తప్పయితే.. రూప, రాజేష్‌తో వెలగబెట్టిన ఈ రొమాన్సు చూడండి" అని కౌషిక్ ఫోటోలు తెచ్చి తండ్రి ముందుంచాడు. వాటిని చూసిన భాస్కర్రావు,

"ఇంతకీ ఇప్పుడు నువ్వేమంటావు? మాధురిని నీకిచ్చి చెయ్యనని మన మొహం మీదే చెప్పెళ్ళి, వేరే పెళ్ళి సంబంధం చూసి, పెళ్ళిచూపుల వరకు



**కళ్ళముందు పెరిగిన పిల్లల్ని నమ్మకుండా, వారిద్దరికీ వేర్వేరు సంబంధాలు చూడటం మొదలుపెట్టారు తల్లిదండ్రులు. దాంతో ఇద్దరూ ఇల్లొదిలి వెళ్ళాలని డిసైడయ్యారు. పెద్దవాళ్ళ ఈగోలకు మనమెందుకు తలవంచాలి అనుకున్నారు. అనుకున్నదే తడవు ఇద్దరూ చెరొక బ్యాగూ పట్టుకొని తమతమ ఇళ్ళనుంచి బయటపడ్డారు. ఆ తరువాత వారిద్దరూ ఎటువంటి సమస్యలు ఎదుర్కొన్నారు?**

వచ్చాడా రాజశేఖరం. కాదన్న వాళ్ళ కాళ్ళుపట్టుకోవడం నావల్లకాదు. అందుకే నేనో నిర్ణయాని కొచ్చాను. అలాగే... నీ నిర్ణయం కూడా చెప్పు" తీవ్రగొంతుతో అన్నాడు భాస్కర్రావు.

•••

వెంటనే నిర్ణయాలు చెప్పెయ్యడానికి ఇది బొమ్మలపెళ్ళి కాదండీ! జీవితంలో తీసుకునే ముఖ్యమైన నిర్ణయం. ఈ నిర్ణయమే జీవితానికి దశ, దిశ నిర్దేశించే దిక్సూచి. చంద్రమౌళిగారబ్బాయికి మాధురి నచ్చినంత మాత్రాన, మాధురికి అతను నచ్చాలన్న నియమం లేదు. సావకాశంగా దాన్ని ఆలోచించుకోనివ్వండి. మెడమీద కత్తి పెట్టినట్టు బలవంతంగా చెప్పమనడం బాగుండదు. ఇంకా అది చిన్నపిల్ల కాదు" అంది లలిత.

•••

కౌషిక్ లేచెళుతూ "అమ్మా! నా గురించి ఎవరూ ఎవరి కాళ్ళూ పట్టుకోనక్కర్లేదు. రూప తన బర్త్‌డే అని చెప్పింది. ఆమెతో హోటల్‌కి వెళ్ళింది మాత్రం నిజం. అక్కడ ఆమె కొత్త సెల్ ఫోన్ కెమేరాలో నాకు తెలీకుండా ఈ ఫోటోల్ని తీసింది. ఆ తర్వాత తన వేలికున్న రింగ్ టైట్ అయ్యిందని, దాన్ని తియ్యమంది. తీస్తుంటే సెల్ కెమేరాతో ఫోటోలు తీసి, వాటిని అడ్డం పెట్టుకుని ఈ చీప్‌గేమ్స్ ఆడుతోంది. కావాలంటే మీరే ఆమెతో మాట్లాడి తేల్చుకోండి" అని రూప నంబరు డయల్‌చేసి తండ్రికిస్తుంటే... "ఇంకా నేను ఆ అమ్మాయితో మాట్లాడటమేమిటి అసహ్యంగా" అని అక్కణ్ణుంచి లేచెళ్ళాడు.. భాస్కర్రావు.

•••

మర్నాడుదయం.. ఏడు గంటలు.. మాధురి బ్యాగ్ తీసుకుని బయటకి వెళ్తుంటే, సుందర్రామయ్య చూసి "ఆల్ ద బెస్ట్" అన్నాడు మెల్లగా.

•••

అదే సమయంలో కౌషిక్ ఓ బ్యాగు భుజానేసుకుని బయటికొస్తుంటే, హాల్లో కూచున్న గోపాలకృష్ణయ్య... "ఇంత పొద్దుటే బ్యాగేసుకుని ఎక్కడికి వెళ్తున్నావురా! కౌషిక్" అన్నాడు పెద్దగా, ఇంట్లో వాళ్ళకి వినబడేట్టు.

ఆ మాట విని శారద గబగబా భర్త గదిలోకి వచ్చింది. అప్పటికే కౌషిక్ బయటికొచ్చాడు.

•••

మామగారికి కాఫీగ్లాసిచ్చి "మాధురి గదిలో లేదు. ఇటేమైనా వచ్చిందా?" సుందర్రామయ్యని అడిగింది లలిత.

సైలెంట్‌గా మాధురి వెళ్ళినవైపు చూపుడు వేలితో చూపించాడు. లలిత వేగంగా బయటికొచ్చి మాధురిని చూసి, భర్తకి విన్పించేలా.... అరిచింది.

అప్పటికే కౌషిక్, మాధురి పక్కకొచ్చి నిలబడ్డాడు. వాళ్ళిద్దర్నీ చూసిన లలిత భర్తని పిలవడానికి లోపలికెళ్ళింది.

•••

"ఒరేయ్! కౌషిక్... మళ్ళీ ఎక్కడికిరా! వెళ్తున్నావు" అంది శారద. మౌనంగా తల్లివేపు చూశాడు కౌషిక్.

•••

"ఇంత ఉదయాన్నే ఎక్కడికెళ్తుంది మాధురి? అనవసరంగా కంగారుపడకు" క్యాజువల్‌గా అన్నాడు టీవీలో న్యూస్ చూస్తున్న రాజశేఖరం.

"అది కాదు! త్వరగారండి! కౌషిక్ కూడా బ్యాగ్ తీసుకుని మాధురి పక్కనే ఉన్నాడు".

"ఆఁ..." అని కంగారుగా పేపరు విసిరికొట్టి, ఒక్క ఉదుటన బయటికొచ్చి... వాళ్ళిద్దర్నీ చూసి...

"మధూ! వాటీజ్ దిస్ న్యూసెన్స్" అరిచినట్టన్నాడు కోపంగా.

•••

"కౌషిక్... ఏంటిరా ఇది? ఇంట్లో నుంచి వెళ్ళిపోతావా!" కోపంగా అన్నాడు భాస్కర్రావు.

"అవును నాన్నా! మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాం" స్థిరంగా చెప్పాడు కౌషిక్.

మాధురి కూడా తండ్రితో... 'ఎస్ డాడీ! ఉయ్ ఆర్ గోయింగ్ టు మ్యారీ" అంది.

"మా నిర్ణయంతో పన్లేదా?" సీరియస్‌గా అన్నాడు రాజశేఖరం.

"అంకుల్! బాల్ మీ కోర్టులో ఉంది కదా! అని మా జీవితాలతో ఆడుకోవటమే మీ నిర్ణయమైతే, మీ 'ఈగోల ఆటకి మేం బంతులు కాదల్చుకోలేదు. ఇది మా జీవితం. నిర్ణయించుకునే అధికారం, హక్కు మాకున్నాయి. మా ఇద్దరి నిర్ణయమూ ఒక్కటే".

"నేను నీతో మాట్లాడటం లేదు" అని మాధురిని చూస్తూ, "అదే నీ నిర్ణయమా?" అన్నాడు.

తాతలిద్దరూ, శారద, లలిత, గోవిందు, గంగ అందరూ అవాక్కయి చూస్తున్నారు.

"ఒరేయ్! నీ కొడుకు మాంచి దూకుడు మీదున్నట్టున్నాడు" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"మీ వాడేమన్నా తక్కువా... పోటీగా నీ మనవడికి సంబంధం తెచ్చాడుగా!" అన్నాడు సుందర్రామయ్య.

రాజశేఖరం కోపంగా... "మధూ! అందరిముందూ ఏంటీ అల్లరి. ఆర్యూ నాట్ ఫీల్ షై... కం ఇన్‌సైడ్" అన్నాడు.

"నో! డాడ్! మీ నిర్ణయంలో మార్పులేనప్పుడు మీకూతుర్ని నేను. ఇంతదూరం వచ్చాక.. ఒక్కసారి ఇంట్లోనుంచి కాలు బయట పెట్టాక, నా నిర్ణయంలో మార్పెలా ఉంటుంది?"

"గో టూ హెల్.." అని వేగంగా లోపలికెళ్ళిపోయాడు రాజశేఖరం.

"హెల్లో.. హెవనో... ఇప్పుడేదైనా ఒక్కటే మా ఇద్దరికి" అంది మాధురి.

"ఏమిట్రా! కౌషిక్.. ముందు మీ ఇద్దరూ లోపలికిరండి. ఇలా ఇల్లొదిలి బయటికెళ్ళి పెళ్ళి చేసుకుంటామనటం మీ ఇద్దరికీ బాగుందా? మేమంతా చచ్చామని వెళ్ళిపోదామనుకుంటున్నారా? ముందు లోపలికిరండి!" అంది శారద కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ. కొడుకు చెయ్యి పట్టుకుంది.

"వద్దు శారదా! వాళ్ళిద్దర్నీ వెళ్ళనియ్! మన భర్తల మధ్య ఈగోలకి పిల్లలెందుకు బలవ్వాలి? అటు ఆయన, ఇటు ఈయన మన బంధాలు, అనుబంధాల్ని మరచిపోయి, కళ్ళముందు పెరిగిన పిల్లల్ని నమ్మకుండా, ఇద్దరికీ ఎప్పుడైతే వేరే సంబంధాలు చూడటానికి సిద్ధపడ్డారో... అప్పుడే మనం పరాయివాళ్ళమయ్యాం. చిన్నసమస్య! అదీ ఎవరో పెట్టిన చిచ్చు. దీన్ని పరిష్కరించకుండా, పెద్దదిచేసి ఎప్పుడైతే పిల్లల్ని క్షోభకి గురిచేశామో, అప్పుడే వాళ్ళని శాసించే హక్కు కోల్పోయాం. మనం సంకుచితంగా ఆలోచించినా, వాళ్ళిద్దరూ సముచితంగానే ఆలోచించి సరైన నిర్ణయమే తీసుకున్నారు" ఆవేశంగా అంది లలిత.

"లలితమ్మ చెప్పిందే కరెక్టు శారదా! ముప్పయి సంవత్సరాలుగా ఈ రెండు కుటుంబాల మధ్య ఆత్మీయతానుబంధాలు... ఉమ్మడి కుటుంబాలు, రక్తసంబంధాలకంటే ఎక్కువగా అల్లుకుపోయాయి. అవి ఈ పెళ్ళితో శాశ్వతం అవుతాయని ఆశపడ్డాం. కానీ మనలో మనకే తెలియకుండా ఒకళ్ళపై ఒకళ్ళకి అంతర్గతంగా ఇంత బలీయమైన అసూయాద్వేషాలున్నాయని తెలుసుకోలేకపోయాం. అవి ఇప్పుడు బహిర్గతం కావడానికి వీళ్లిద్దరూ ఓ అవకాశం కల్పించారు. చూశావా! మనమూ మామూలు వాళ్ళమే అన్నట్టు అసూయతో ఎలా బయటపడిపోయామో!" అని గొంతు విప్పాడు గోపాలకృష్ణయ్య.

సుందర్రామయ్య ఏదో అనబోతుంటే... లోపల్నుంచి వేగంగా వచ్చిన రాజశేఖరం,

"ఒక్క నిమిషం నోర్మూసుకోండి నాన్నా!" అరిచినట్టుగా అన్నాడు.

అతని కళ్ళు ఎర్రగా ఉన్నాయి. కొడుకు ఆవేశం చూసి సుందర్రామయ్య సైలెంటై పోయాడు.

"మధూ! నీకు తగిన క్వాలిఫైడ్, డిగ్నిఫైడ్ అండ్ క్యారెక్టర్ ఉన్నవాణ్ణి చూడటం తండ్రిగా నాది తప్పని... అందరి ముందూ నన్నిలా అవమానిస్తున్నావా?"

"అంటే కౌషిక్‌కి క్యారెక్టర్ లేదనా మీ ఉద్దేశం"

"అని బుజువైందిగా!"

"ఎవరో చెప్పిన నాలుగు మాటల్ని, రెండు ఫోటోల్ని పట్టుకుని ఎలా డిసైడ్‌చేస్తారు? అవేగా మీ దగ్గరున్న ఆధారాలు. ఇన్నేళ్ళూ మనకు తెల్సిన కౌషిక్‌కి క్యారెక్టర్ లేదని ఎలా అనగలుగుతున్నారు నాన్నా! ఎవరో రాళ్ళు విసిరారని మనమూ మన చెట్టుమీదే రాళ్ళు విసురుకుంటే, కాయలు కాదు కదా! ఆకులు కూడా రాలిపోతాయి. చివరికి మిగిలేది మోడే డాడీ! ఇన్నేళ్ళూ మీ కళ్ళముందు ఉన్న కౌషిక్ క్యారెక్టర్ని కాలిక్యులేట్ చేయలేని

## శృతికే ఎందుకలా?



సెలబ్రిటీలకు బెదిరింపులేం కొత్త కాదు. శ్రుతి కూడా ఇప్పుడు వాటి బారిన పడింది. కర్నాటకకు చెందిన ఓ వైద్యుడు శ్రుతిని చంపేస్తానని సోషల్ మీడియా ద్వారా బెదిరింపులు మొదలెట్టాడట! ఈమేరకు అతగాడు పెట్టిన మెసేజ్‌లను సాక్ష్యాలుగా చూపిస్తూ శ్రుతి పోలీసులను ఆశ్రయించిందట! సుమారు మూడు సంవత్సరాల క్రితం శ్రుతి ఉన్న అపార్టుమెంటులోకి ఓ ఆగంతకుడు ప్రవేశించాడు. అప్పుడు శ్రుతి అప్రమత్తతతో ఎలాంటి ప్రమాదం సంభవించలేదు. సల్మాన్‌ఖాన్‌ను కూడా చంపేస్తానంటూ ఓ వ్యక్తి ఫోనులో బెదిరించాడట! అయితే అతని ఆచూకీ మాత్రం లభ్యం కాలేదు. తరచూ శ్రుతి విషయంలోనే ఎందుకిలా జరుగుతోందో అర్థం కావడం లేదని ఆమె సన్నిహితులు వాపోతున్నారు.

మీరు, ఇవ్వాళే పరిచయమైన డాక్టర్ వంశీ క్యారెక్టర్ని ఎలా అంచనా వేస్తారు? మీ నిర్ణయమే సరైనదని నన్నెలా నమ్మమంటారు? మీవి ఎప్పుడూ తొందరపాటు నిర్ణయాలే నాన్నా! మీరనుకున్నదే కరెక్టని, అదే అందరూ అనుసరించాలని అనుకోవడం మీ నైజం. బహుశ మిలిట్రీ మీకు నేర్పించిందో, లేకపోతే మీతోనే పుట్టిన బార్న్ క్యారెక్టరో అర్థం కావటం లేదు. రాన్రానూ అది పిడివాదంగా మారింది. మీరనుకున్న దానికి ఎవరెదురు చెప్పినా, చేసినా తట్టుకోలేకపోతున్నారు".

మాధురి మాటల్ని వింటూ భాస్కర్రావు చిద్విలాసంగా చూస్తున్నాడు.

"ఎవరిదాకానో ఎందుకు? ఇప్పటికీ మీరు అమ్మకి అర్థమయ్యానని అనుకుంటున్నారా? ఏనాడైనా అమ్మతో సలహా, సంప్రదింపులు చేశారా? ఇంట్లోవాళ్ళకే అర్థం గాని మీరు, మరి అన్నేళ్ళూ డాక్టరుగా పేషంట్ల బాధల్ని అర్థం చేసుకుని ఎలా సర్వీస్ చేశారన్నది మీకే తెలియాలి. చిన్నప్పుడు నేను చెయ్యని తప్పులకి, నిజానిజాలు తెలుసుకోకుండా, ఆవేశంలో తిట్టడం, కొట్టటం చేసేవారు. ఆ తప్పు నేను చెయ్యలేదని తెలిసిన తర్వాత.. కనీసం ఆప్యాయంగా దగ్గరకి తీసుకోవడం, లాలించడం ఎప్పుడైనా చేశారా? రాన్రానూ... మీలో డిక్టేటర్షిప్ వృద్ధయి.. మీతో మాట్లాడాలంటే భయపడేంత గ్యాప్ పెంచింది. మీకంటే పదిరెట్లు మాటపట్టింపు, రోషం నాలోనూ పెరిగి... క్రమంగా మీకూ, నాకూ దూరం పెంచింది. ఒకటా? రెండా? ఎన్నో సంఘటనలు.. మీ క్షణికావేశానికి నా మనస్సు చివుక్కుమన్న సందర్భాలు ఎన్నెన్నో! నాకు ఊహ తెలిసిన తర్వాత మీతో మాట్లాడిన మాటలు కొన్ని గంటలకే పరిమితమయ్యాయంటే విచిత్రంగా లేదూ!"

లలిత కన్నీళ్ళొత్తుకుంటూ నిస్సహాయంగా చూస్తోంది.

"ఇంట్లో నియంతలా ఉంటున్న మీ ప్రవర్తన, నిర్ణయాలవల్ల మీరేం మిస్సవుతున్నారో, మీ నుండి కుటుంబం ఏం మిస్సవుతోందో ఎప్పుడైనా ఆలోచించారా? కౌషిక్‌ది అల్లరి మనస్తత్వమే! కానీ క్యారెక్టర్ కోల్పోయే వ్యక్తిత్వం కాదు. మీరు పదేపదే కౌషిక్ క్యారెక్టర్ గురించి అంటుంటే చిన్నప్పట్నుంచీ అతన్ని పూర్తిగా చదివిన నేను తట్టుకోలేకపోతున్నాను. ఇది మేమిద్దరం కలిసి తీసుకున్న నిర్ణయం కాబట్టి.. సరైనది సముచితమైనది అనుకుంటున్నాం. ఇది మీకు తప్పనిపిస్తే... మాకు అడ్డురాకండి" అంది మాధురి ఆవేశంగా. అందరూ అవాక్కయి వింటున్నారు.

భాస్కర్రావు వైపు తిరిగి... "అంకుల్! మీ కొడుకు గురించి మీకు తెలీదా? డాడీ ఒకవైపు, మీరు మరోవైపు మా ఇద్దరికీ వేరే సంబంధాలు చూసి, మా ఇద్దర్నీ విడదీయటానికి సిద్ధపడ్డారంటే.. మీ ఇద్దరి మధ్యా 'ఈగో' ఎంతగా పేరుకుపోయిందో ఆలోచించండి. మాకిద్దరికీ పెళ్ళిచేద్దామని 'వెడ్డింగ్ కార్డ్స్' వరకూ వెళ్ళిన మీరు, ఇప్పుడు వేరేవాళ్ళని పెళ్ళిచేసుకుంటే మీరు తట్టుకోగలరా? మా డాడీ గురించి మీకు తెలియదా? ఆయన



ఆవేశపు నిర్ణయాలు మీకు కొత్తేం కాదుగా! ఆయన చేసిన తప్పే మీరు చెయ్యడానికి, కౌషిక్‌కి మరో సంబంధం చూశారంటే... ఇంక మీ స్నేహానికి మీరిచ్చిన విలువ ఇదేనా? ఎన్నడూ చూడని విధంగా మీరిద్దరూ బద్ధశత్రువుల్లా మారిపోయి.. రెండిళ్ళ మధ్యా, అందరి మనస్సుల్లోనూ 'గోడ' కట్టడానికి సిద్ధమయ్యారు. అందుకే మీరు మా అనుబంధానికి అడ్డుగోడ కట్టకముందే మేల్కొని, మీకా అవకాశం ఇవ్వకుండా వెళ్ళిపోతున్నాం. ఆయన చంద్రమౌళిగారికేం చెప్పుకుంటాడో, మీరు పురుషోత్తంగారికి ఏం సంజాయిషీ ఇచ్చుకుంటారో మీమీ ఈగోలతో ఏం ఈక్వేషన్లేసుకుంటారో మీ ఇష్టం. ఒక్కటిమాత్రం నిజం అంకుల్... ఇన్నేళ్ళూ ఒక్కటిగా ఉన్నామనుకుంటున్న మీరంతా ఒకళ్ళనొకళ్ళు మోసం చేసుకుంటున్నారు. ఎప్పుడూ కొట్టుకుంటూనే ఉండే మా ఇద్దరి మనసుల్లో స్నేహం వృద్ధయింది గానీ.. ద్వేషం కాదు. మమ్మల్ని ఎవరూ విడదీయలేరు. ఉయ్ ఆర్ గోయింగ్" కళ్ళు తుడుచుకుంటూ అంది మాధురి.

మాధురి మనసులో తన స్థానాన్ని అందరి ముందూ, ఆమె మాటల్లోనే, ఇన్నాళ్ళకి విన్న కౌషిక్ గర్వంగా ఫీలై, ఆమె భుజం చుట్టూ చెయ్యేసి, దగ్గరగా తీసుకుని "యస్ ఉయ్ ఆర్..." అన్నాడు అందరివైపు చూసి...

"ఒరేయ్! గోపాలం! 'మాధుర్యం' మనల్నొదిలి వెళ్ళిపోతుంటే, ఇంకాచూస్తూ నిలబడ్డావేంట్రా! రా! వీళ్ళిద్దరికీ నాలుగక్షింతలెయ్యకపోతే... మన స్నేహం దేనికిరా! వీళ్ళకి పెళ్ళి చేసి, మన ఊరికెళ్ళిపోదాం" అన్నాడు.

"ఈ మాటకోసమేరా చూస్తున్నా! అవసానంలో అంతరాల్లేని మాటలు పడటం నాకూ కష్టంగానే ఉంది. నువ్వే వెళ్ళిపోతుంటే, నాకింకా ఇక్కడేం పని! హాయిగా మన ఊరెళ్ళిపోదాం పద" అంటూ తాతలిద్దరూ కౌషిక్, మాధురి పక్కకి చేరారు.

శారద, లలిత... మొహాలు చూసుకుని... "ఉండండ్రా! మేమూ వస్తున్నాం" అని వచ్చి నిలబడ్డారు.

"అమ్మగార్లూ! మీతోబాటే మేమూ" అంటూ గంగ, గోవిందు వచ్చేశారు. రాజశేఖరం అసహనంతో ఊగిపోతూ.. 'మీ ఇష్టం వచ్చినట్టు చేసుకోండి. నా నిర్ణయం వెనక్కి తీసుకోను" అంటూ లోపలికెళ్ళాడు.

బయల్దేరబోతున్న మాధురి, కౌషిక్‌లకి అడ్డొచ్చి "వెళ్ళకండి. నేను వాడితో మాట్లాడి తీసుకొస్తాను" అని భాస్కర్రావు వేగంగా లోపలికి వెళ్ళాడు.

తలపట్టుకుని సోఫాలో కూచుని, కాళ్ళు బార్లా జాపుకుని, నిర్వికారంగా చూస్తూ, రెస్ట్‌లెస్‌గా కూచున్న రాజశేఖరాన్ని ఏనాడూ అలా చూడని భాస్కర్రావు.. భుజం మీద చెయ్యేశాడు. తలతిప్పి చూసి తప్పుచేసిన వాడిలా తలదించుకున్నాడు రాజశేఖరం. అంతలోనే అభిజాత్యం అడ్డొచ్చి తల తిప్పుకుంటుంటే..

"ఏవిట్రా! రాజా! ఇది.. ఇంట్లోవాళ్ళంతా మనల్ని వెలివేసి, వదిలేసి వెళ్ళిపోతున్నార్రా! ఇంకా ఈ నాలుగ్గోడల మధ్య మన ఈగోలే ముఖ్యమనుకుంటూ ఒంటరిగా ఉండగలమా?" అన్నాడు పక్కన కూచుని.




సరిహద్దుకు
రక్తపు మరకంటితే
జాతి భేదాలన్నీ మాయం
యుద్ధమా! నీవెంత ప్రేరకమే!

శత్రువు దొంగ దెబ్బకు
దీటైన జవాబిస్తే
ఆసేతు హిమాచలం పండగే
సైనికుడా! నీ జీవితం ధన్యమే!

## ధర్మవిజయం



పాము చిన్నదే
చావు దెబ్బ తీయనిదే
సరిహద్దున శాంతిపూలు పూయవు
సహనమా! నీ కోపాగ్ని తీవ్రమే!

హిమసానువుల్లో
ఎంతకాలమీ రెప్పవేయని రాత్రులు?
పగవాడు కన్నుమూయనీ
దేశమా! ధర్మానికెప్పుడు విజయమే!

*-కోట్ల వెంకటేశ్వరరెడ్డి*
**సెల్: 94402 33261**

రాజశేఖరం మౌనంగా ఎటో చూస్తున్నాడు.

"పోనీ... ఇన్నేళ్ళ మన బాల్యస్నేహాన్ని, అనుబంధాన్ని ఈ చిన్నవిషయం కోసం తెంపేసుకుని విడిపోదామా? ఎవరికోసమైతే మన మధ్య ఈ సమస్య తలెత్తిందో, వాళ్ళిద్దరే ఒకటై, వెళ్ళిపోతామంటే.. ఇంకా ఈ భేషజం దేనికిరా! వద్దు. నా మాట విను. పిల్లల అభిప్రాయాన్ని గౌరవిద్దాం. వాళ్ళిద్దరికీ జాంజామ్మని పెళ్ళిచేసి మన పెద్దరికాన్ని నిలుపుకుందాం. మనం ఎంత వద్దనుకున్నా, లేవనుకున్నా... అప్పుడప్పుడూ ఇలాంటివి తలెత్తుతుంటాయి. మనమే వాటిని అధిగమించాలి. అయినా నీకు నేను చెప్పేటంతటి వాణ్ణి కాదు. నాకంత వయసూ లేదు. ఎందుకంటే నీకంటే రెణ్ణెల్లు చిన్నవాణ్ణని చిన్నప్పట్నుంచీ గుర్తు చేస్తుంటావు గదా!" అన్నాడు.

"ఊఁ హూఁ...." రాజశేఖరంలో కదలిక లేదు.

"సరేరా! పిల్లలకి ఇష్టంలేని పెళ్ళిళ్ళు చేసి మనం మనశ్శాంతిగా ఉండగలమా? మనమాట అటుంచు. వాళ్ళే మన ప్రమేయం అక్కర్లేదని వెళ్ళిపోతున్నారు. అయినా మన పిల్లలు నువ్వనుకునేంత చెడ్డవాళ్ళుకాదు. చూడు ఇవ్వాళ్టి యాంత్రిక జీవితాల్లో ప్రతి మనిషికీ ఎన్నో సమస్యలు! వాటితో ఇల్లు చేరేసరికి ప్రశాంతత కోరుకుంటుంటారు. కానీ మన ఇళ్ళలో అలాంటి సమస్యల్లేవు. చిన్నచిన్న అనుభూతుల దగ్గర్నుంచి, పెద్దపెద్ద అనుభవాల వరకూ కలిసి పంచుకోవడానికి అలవాటుపడ్డాం. ఇప్పుడు ఎవరికోసమో ఆ మాధుర్యాన్ని కోల్పోయి విడిపోవటం అవసరమా? లే! నా మాట విను. అన్ని విషయాలూ నీకే తెలుసుననుకోవటం నీ వీక్నెస్. నీ సాంగత్యంలో నాకూ అదే అలవాటైంది. కానీ చాలా విషయాలు నీకంటే నాకే బాగా తెలుసన్నది నువ్వు తెలుసుకోవాలి. మన ఇద్దరిలో ఉన్న లోపాల్ని మన ఇంటిల్లపాదీ గ్రహించి, మనల్నికాదని వెళ్ళిపోవడానికి సిద్ధమయ్యారు. ఇంకా మనం గ్రహించకపోతే మనకి మూర్ఖత్వమే మిగులుతుంది. ఈ రెండిళ్ళకీ రెండు కళ్ళు కౌషిక్, మాధురి. వాళ్ళిద్దరికీ వాళ్ళు కోరుకున్నట్టు పెళ్ళిచేసి అందరిముందూ తలెత్తుకు తిరగాల్సిన మనం ఇలా తల దించుక్కూచోవటం అవసరమా! ఈ పెళ్ళితో మన స్నేహాన్ని శాశ్వతం చేసుకుని, మనవాళ్ళందరితో పంచుకుందాం రా! లే! రారా!!" అని రాజశేఖరం మొహాన్ని తన వైపు తిప్పుకున్నాడు.

తలతిప్పిన రాజశేఖరం కళ్ళు వర్షిస్తుంటే.. చలించిపోయిన భాస్కర్రావు.. ఆప్యాయంగా దగ్గరకి తీసుకుని...

"ఏవిట్రా ఇది! చిన్నపిల్లాడిలా! పులిలా ఉండే నీ కళ్ళ వెంట కన్నీళ్ళా? నెవర్? హిట్లర్ హిట్లర్లాగే ఉండాలి.." అన్నాడు.

ఒక్క ఉదుటున లేచి నిలబడి "సారీరా! ఇంట్లో అందర్నీ, ముఖ్యంగా నిన్ను నా ఈగోతో చాలా హర్ట్ చేశాను. క్షమించరా! ఇహపై... నో....నో వద్దు ఇదే ఆఖరుసారి" అన్నాడు భాస్కర్రావు చేతులు పట్టుకుని.

"మన మధ్య సారీలు, క్షమాపణలు ఏంటిరా! పద వెళ్దాం" అన్నాడు భాస్కర్రావు.

అప్పటివరకూ లోపల ఏం జరుగుతోందోనని టెన్షన్‌గా చూస్తున్న కుటుంబసభ్యులు ఎదురుగా దర్జాగా, దర్పంగా వస్తున్న రాజశేఖరం, భాస్కర్రావులని చూసి ఊపిరి పీల్చుకున్నారు.

తాతలిద్దరూ కౌషిక్, మాధురిల చేతులు పుచ్చుకుని "అఘోరించార్లే... లోపలికి రండి" అన్నారిద్దరూ.

"అవున్రోయ్... మా హిట్లర్ మూడ్ మారకముందే, ఆ మూడుముళ్ళూ వేయించేద్దాం" అన్నాడు సుందర్రామయ్య.

"కౌషిక్, మధూ... ప్లీజ్... కం ఇన్‌సైడ్" అన్నాడు రాజశేఖరం గొంతు పెగల్చుకుని.

తండ్రి ఆ మాట అనడానికి పడ్డ మథన అర్థం చేసుకున్న మాధురి.. కన్నీళ్ళు తుడుచుకుని, తండ్రి పక్కకి వచ్చింది. కూతుర్ని ఆప్యాయంగా దగ్గరికి తీసుకుని రాజశేఖరం లోపలికి వస్తుంటే.. అందరి వికసిత వదనాల్లో మాధుర్యపు మధురిమలు తొంగిచూశాయి.

**(ముగింపు వచ్చేవారం)**

# వంటలు

## కాల్చిన రుచే వేరు

పులుసులు, వేపుళ్ళు తినీ తినీ ఎప్పుడూ ఇవే వెరైటీలా? అనుకుంటుంటారు. డాక్టర్లు కూడా పచ్చి కూరగాయలు తినమని చెబుతుంటారు. కనీసం సలాడ్‌లాగా చేసుకునైనా తినమంటారు. అందుకే రొటీన్ వంటలకు భిన్నంగా కొత్తరకం రుచుల్ని ఆస్వాదించాలనుకునేవారికి గ్రిల్డ్ వెరైటీలు మంచి ఆప్షన్. అంటే వండే పని లేకుండా గ్రిల్‌లో పెట్టి కాల్చుకుంటే సరిపోతుంది. మీ ఇంట్లో గ్రిల్ సౌకర్యం లేకపోతే పుల్కాలు కాల్చుకునే తవ్వాపై గ్రిల్ చేసుకోవచ్చు.

### మీకు నచ్చే కొన్ని వెరైటీ గ్రిల్డ్ రుచుల పరిచయం....

## • బంగాళదుంప ముక్కలు



**కావలసిన పదార్థాలు:** బంగాళ దుంపలు - 2, ధనియాలపొడి - ఒక టీ స్పూన్, ఉప్పు, కారం - సరిపడా, వంటసోడా - చిటికెడు, నూనె - కొద్దిగా.

**తయారుచేసే పద్ధతి:** రెండు బంగాళ దుంపల్ని తీసుకుని చెక్కు తీసేయాలి. మరీ పలచగా కాకుండా అలాగని బాగా దళసరిగా కాకుండా చక్రాలు కోసుకోవాలి. ఒక గిన్నెలో అరగ్లాసు నీళ్ళు పోసి కొద్దిగా ఉప్పు, చిటికెడు సోడా, ఒక టీ స్పూను ధనియాలపొడి వేసుకుని కలుపుకోవాలి. ఈ నీళ్ళలో బంగాళదుంప ముక్కలు వేసి పదినిమిషాల తర్వాత ముక్కలు తీసేయాలి. ముక్క రెండువైపులా నూనె రాసి కాల్చాలి. ముక్కలు ఎర్రగా అయ్యాక తీసి కొద్దిగా ఉప్పు, కారం చల్లుకుని తింటే చాలా రుచిగా ఉంటాయి. వీటిని చారన్నంలో నంజుకుతిన్నా బాగుంటాయి.

## • టమాట ముక్కలు



**కావలసిన పదార్థాలు:** టమాటాలు - 5, ధనియాలపొడి - టీ స్పూన్, ఉప్పు, కారం - సరిపడా, కోడిగుడ్డు - 1, నూనె - కొద్దిగా.

**తయారుచేసే పద్ధతి:** దోరగా ఉన్న ఐదు టమాటాలు తీసుకుని నిలువుగా కోసుకోవాలి. కాయల్లోని నీరంతా పోనిచ్చి ముక్క చుట్టూ కొద్దిగా నూనె రాసుకోవాలి. కోడిగుడ్డు తెల్లసొనలో కొద్దిగా ఉప్పు, కారం కలుపుకుని టమాటా ముక్క పైన రాసి కాల్చుకోవాలి. తీసేసిన తర్వాత ధనియాల పొడి చల్లుకుని తినాలి.

## • బెండకాయలు



**కావలసిన పదార్థాలు:** బెండకాయలు - 10, పల్లీపొడి - ఒక టేబుల్ స్పూన్, కొబ్బరిపొడి - అర టేబుల్ స్పూన్, ధనియాలపొడి - ఒక టేబుల్ స్పూన్, కారం - అర టీ స్పూన్, ఉప్పు - తగినంత, నూనె - కొద్దిగా.

**తయారుచేసే పద్ధతి:** పది బెండకాయల్ని శుభ్రంగా కడిగేసి తడిలేకుండా బట్టతో తుడిచి నూనె రాయాలి. ఒక గిన్నెలో ఒక టేబుల్ స్పూన్ పల్లీపొడి, అర టేబుల్ స్పూన్ కొబ్బరిపొడి, ఒక టీస్పూన్ ధనియాలపొడి, అర టీ స్పూన్ కారం, తగినంత ఉప్పు వేసి బాగా కలుపుకోవాలి. బెండకాయ మధ్యలో గాటు పెట్టి ఈ పొడిని కూరాలి. ఇలా అన్ని బెండకాయల్ని చేశాక, ఒకేసారి గ్రిల్‌పై పెట్టి కాల్చుకోవాలి. వీటిని నేరుగా తినొచ్చు లేదంటే చారన్నంలో నంజుకు తినొచ్చు.

## • వంకాయ, అరటి ముక్కలు



**కావలసిన పదార్థాలు:** వంకాయలు - రెండు, అరటికాయ - ఒకటి, కొబ్బరి ముద్ద - ఒక టేబుల్ స్పూను, అల్లంవెల్లుల్లి ముద్ద - ఒక టీ స్పూన్, కారం - ఒక టీ స్పూన్, పసుపు - చిటికెడు, ధనియాలపొడి - ఒక టీ స్పూను, ఉప్పు - తగినంత, గరం మసాలా - అర టీ స్పూను.

**తయారుచేసే పద్ధతి:** రెండు వంకాయలు, ఒక అరటికాయను సన్న ముక్కలుగా కోసుకుని నీళ్ళలో వేసుకోవాలి. గిన్నెలో ఒక టేబుల్ స్పూను కొబ్బరి ముద్ద, ఒక టీ స్పూను అల్లం వెల్లుల్లి ముద్ద, ఒక టీ స్పూను కారం, చిటికెడు పసుపు, ఒక టీ స్పూను ధనియాల పొడి, తగినంత ఉప్పు వేసి బాగా కలపాలి. ఈ గుజ్జులో వంకాయ ముక్కలు, అరటికాయ ముక్కలు వేసి ఒక అరగంట సేపు నానబెట్టాలి. ఇప్పుడు ముక్కలను కాల్చుకోవాలి. వీటిని సాంబారన్నంలో తింటే చాలా రుచిగా ఉంటాయి. మసాలా ఇష్టపడేవారు కొబ్బరి ముద్దలో అర టీ స్పూను గరం మసాలా వేసుకోవచ్చు.

## • క్యారెట్లు



**కావలసిన పదార్థాలు:** క్యారెట్లు - నాలుగు, ఉప్పు, కారం - తగినంత, నిమ్మకాయ - ఒకటి, మిరియాల పొడి - ఒక టేబుల్ స్పూన్, నూనె - కొద్దిగా.

**తయారుచేసే పద్ధతి:** నాలుగు క్యారెట్లు తీసుకుని పైన చెక్కు తీసేసి, అక్కడక్కడా గాట్లు పెట్టుకోవాలి. ఉప్పు, కారం కలిపి క్యారెట్లకు రాసుకోవాలి. నూనె కూడా రాసి కాయకాయగానే గ్రిల్ చేసుకోవాలి. క్యారెట్లు కాలాక పైన మిరియాలపొడి, కొద్దిగా నిమ్మరసం పిండుకొని తింటే ఆ రుచే వేరు. వీటిని పిల్లలకు సాయంత్రం స్నాక్స్‌లా పెడితే రుచికి రుచి, ఆరోగ్యానికి ఆరోగ్యం.




**అయోధ్యపౌరులు, ఆప్తులు, హనుమసహా ఊరేగింపుగా వస్తున్న భరతుణ్ణి చూశాడు రాముడు. పుష్పకాన్ని కిందికి దించాడు. నేలకు దిగడం ఆలస్యం, రామునికి నమస్కరిస్తూ పుష్పకంలోకి ప్రవేశించాడు భరతుడు. అతనికి సాష్టాంగప్రణామం చేశాడు.**

భుజాలు పట్టుకుని భరతుణ్ణి లేవనెత్తాడు రాముడు. అభిమానంగా దగ్గరగా తీసుకున్నాడు. కౌగిలించుకున్నాడు.

"సోదరా క్షేమమే కదా?" అడిగాడు. క్షేమమేనన్నాడు భరతుడు. సీతాదేవిని చూశాడు. నమస్కరించాడామెకు. అంతలో తనని సమీపించిన లక్ష్మణుణ్ణి చూశాడు. కౌగిలించుకున్నాడతన్ని. హనుమ పరిచయం చేస్తోంటే వానరరాజు సుగ్రీవుణ్ణీ, అంగదుణ్ణీ ఆలింగనం చేసుకున్నాడు భరతుడు. తర్వాత మైంద, ద్వివిద, నల, నీల, సుషేణ, జాంబవంతాదులతో కరచాలనం చేశాడు. సుగ్రీవుణ్ణి సమీపించాడు.

"సుగ్రీవా! మా రాముణ్ణి ఆపదల్లో ఆదుకున్నందుకు నిన్ను ఎలా అభిమానించాలో, అభినందించాలో తెలియడం లేదు. ఒక్కటి మాత్రం చెప్పగలను. ఈరోజు నుంచి నీతోసహా మనం ఐదుగురం అన్నదమ్ములం." అన్నాడు భరతుడు. మళ్ళీ గట్టిగా సుగ్రీవుణ్ణి కౌగలించుకున్నాడు.

విభీషణుణ్ణి సమీపించాడు.

"మిత్రమా" అన్నాడు. దగ్గరగా తీసుకున్నాడతన్ని.

"నీ స్నేహం మరువలేనిది. అన్న రామునికే కాదు, ఈ అయోధ్యకే నువ్వు స్నేహితుడివి." అన్నాడు.

శత్రుఘ్నుడు వచ్చాడప్పుడు. పుష్పకంలోనికి ప్రవేశించాడు. వస్తూనే సీతారాములకి సాష్టాంగ ప్రణామం చేశాడు. అన్న లక్ష్మణుని సమీపించాడు. చేతులు జోడించి నమస్కరించాడతనికి. తనకి నమస్కరించి నిల్చున్న శత్రుఘ్నుణ్ణి దగ్గరగా తీసుకున్నాడు లక్ష్మణుడు. ఇద్దరూ పక్కపక్కగా నిల్చున్నారు. ఇంతలో కౌసల్యాదేవి వచ్చిందక్కడికి. కౌసల్యను చూస్తూనే 'అమ్మా' అంటూ ఆమెను సమీపించాడు రాముడు. సాష్టాంగప్రణామం చేశాడామెకు.

"తల్లీ! కర్తవ్యనిర్వహణలో ఆనాడు నీ మాట కాదన్నాను, నన్ను క్షమించు." అన్నాడు. 'నాయనా' అని రాముణ్ణి లేవనెత్తి దగ్గరగా తీసుకున్నదామె. తల్లి పక్కన నిల్చున్న సుమిత్ర, కైకమ్మలసహా తల్లులందరినీ చూశాడు రాముడు. పేరు పేరునా వారందరికీ నమస్కరించాడు. వసిష్ఠుణ్ణి చూశాడప్పుడు. అతనికి సాష్టాంగనమస్కారం చేశాడు.

"రామా" అని లేవనెత్తి, రాముణ్ణి అక్కున చేర్చుకున్నాడు వసిష్ఠుడు. పక్కన కూర్చోబెట్టుకున్నాడు. కూర్చున్న రాముని పాదాలకు, తాను పూజిస్తున్న బంగారుపాదుకలు తొడిగాడు భరతుడు.

"అన్నా! నీ ఆజ్ఞ ప్రకారం నేను ఇంత వరకూ కాపాడిన నీ రాజ్యాన్ని ఈ పాదుకలసహా నీకు అర్పిస్తున్నాను. స్వీకరించు." అన్నాడు. ఆ మాటకి రాముని కళ్ళల్లో ఆనందబాష్పాలు చోటుచేసుకున్నాయి.

"ధర్మప్రభూ! నిన్ను తలచుకుంటూ రాజ్యపాలన చేయడంతో ధనాగారాలూ, శస్త్రశాలలూ, ధాన్యాగారాలూ, సైన్యబలం, నగర రాజ్యసంపదలూ, పదిరెట్లు పెరిగాయి. శాంతి సౌఖ్యాలు వర్ధిల్లాయి. రామా! నీసొమ్ము నీకు సమర్పించి, నిన్ను రాజుగా చూడడంతో నా జన్మ ధన్యమైంది." అన్నాడు భరతుడు. అతని సోదరప్రేమనూ, శీలసంపత్తినీ గమనించి సుగ్రీవ విభీషణాదులు ఆనందించారు. అభినందించారతన్ని.

"భరతుడు లోకోత్తరుడు" అన్నారు. పొగిడారు.

పుష్పకం అక్కణ్ణుంచి బయల్దేరింది. నంది గ్రామానికి చేరుకున్నారంతా. భరతాశ్రమం వద్ద ఆగారు. అందరితో పాటుగా రాముడు పుష్పకం దిగాడు. విమానచోదకుణ్ణి అభిమానంగా చూశాడు.

"నేను మనసులో అనుకున్నది గ్రహించి విమానాన్ని నడిపావు. కృతజ్ఞతలు." అన్నాడు. విభీషణుణ్ణి ఓసారి చూసి, తర్వాత మళ్ళీ చోదకునితో అన్నాడిలా.

"పుష్పకాన్ని తిరిగి కుబేరునికి అందజెయ్యి."

"ఆజ్ఞ" అన్నాడు చోదకుడు. బయల్దేరాడు అక్కణ్ణుంచి.

తమ్ముడు భరతునిసహా ఆశ్రమంలోనికి ప్రవేశించాడు రాముడు. ఆశ్రమంలో మళ్ళీ గురుదేవులు వసిష్ఠునికి అన్నదమ్ములిద్దరూ సాష్టాంగ నమస్కారం చేశారు. యోగాసనాలపై కూర్చున్నారు. చేతులు జోడించి రామునికి నమస్కరిస్తూ అన్నాడిలా భరతుడు.

"అన్నా! ఆనాడు నా తల్లి కోరిక ప్రకారం ఈ రాజ్యాన్ని విడిచి, ఆమెను గౌరవించావు. అలాగే నన్ను కూడా గౌరవించి నీ ప్రతినిధిగా ఈ రాజ్యాన్ని పాలించమన్నావు. పాలించాను. ఇప్పుడిక రామరాజ్యస్థాపన జరగాలి. ఈ రాజ్యాన్ని నువ్వు పాలించాలి. వెంటనే పట్టాభిషిక్తుడివై అందరికీ ఆనందాన్ని కలిగించు."

భరతుని వేడుకోలును కాదనలేదు రాముడు. నవ్వుతూ అందుకు అంగీకరించాడు.

కాసేపటికి శ్రీరామ భరతలక్ష్మణులు జటలు తొలగించుకున్నారు. అభ్యంగనం చేశారు. చందనం అలదుకున్నారు. జిలుగు వస్త్రాలూ, పూలమాలలూ ధరించారు. రామునికి లక్ష్మణ, శత్రుఘ్నులు స్వయంగా రత్నభూషణాలు అలంకరించారు.

రాజపత్నులు సీతకు అభ్యంగనం చేశారు. రత్నాభరణాలతో ఆమెను అలంకరించారు. అలాగే వానరపత్నులను కూడా అభ్యంగనం చేయించి, వారిని కూడా మనోజ్ఞవస్త్రాలతోనూ, ఆభరణాలతోనూ అలంకరించారు.

ఆసరికి సుమంత్రుడు రథాన్ని సిద్ధం చేశాడు. రాముడు అధిరోహించాడు దాన్ని. శత్రుఘ్నుడు గొడుగుపట్టాడతనికి. లక్ష్మణుడు వింజామరతో వీచసాగాడు. భరతుని సారథ్యంలో రథం ముందుకు సాగింది. ఆ రథాన్ని పల్లకీల్లో కూర్చుని ఉండి సీత, రాజపత్నులూ వెన్నంటారు. రథానికి ముందు గోవులూ, అక్షతలతో విప్రులూ, కన్యలూ నడిస్తే, వెనుక పౌరులూ, వారి వెంట పదాతులూ భేరీలు మోగిస్తూ ఊరేగింపుగా నడిచారు. రథం నంది గ్రామం నుండి బయల్దేరి, అయోధ్యలో ప్రవేశించింది. రాజమందిరం దగ్గరకు చేరుకున్నాడు రాముడు. రథం దిగాడు. దిగుతూనే విడిది ఏర్పాట్లలో పడ్డాడు. తన మందిరాన్ని సుగ్రీవునికిచ్చాడు. మిగిలిన ప్రముఖులకు తగిన వసతులు ఏర్పాటు చేశాడు.

# రామరాజ్యం:రామాయణమహిమ

**పవిత్రంగా మంత్రపఠనం సాగుతోంటే, సీతాసహితంగా శ్రీరాముణ్ణి పవిత్ర జలాలతో అభిషేకించారు ఋత్విక్కులూ, దేవతలూ! రాజ్య పౌరులు, దిక్పాలకులు, దేవసిద్ధగణాల జయజయధ్వానాలతో శ్రీరామ పట్టాభిషేకం వైభవోపేతంగా కన్నులపండువగా సాగింది. పట్టాభిషేక మహోత్సవానికి విచ్చేసిన అతిథులను తగురీతిన సత్కరించారు సీతారాములు! రామరాజ్యం ప్రజారంజకంగా సాగింది. నూరు అశ్వమేథయాగాలూ, గొప్ప యాగాలెన్నో చేసి పదకొండువేల ఏళ్ళపాటు ఈ భూమిని పాలించాడు రాముడు!**

సుగ్రీవుని ఆదేశానుసారం వానరవీరులు నాలుగు సముద్రాల నుంచీ, అనేక పవిత్ర నదుల నుంచీ కలశాల్లో జలాలు తీసుకొచ్చారు.

ఆ రాత్రి గడచింది. తెల్లారింది.

తెల్లవారుతూనే సిద్ధంగా ఉన్న జలాలను చూసి శత్రుఘ్నుడు ఆనందించాడు. అభిషేకయత్నాలు చేయాల్సిందిగా పౌరోహితుల్ని ఆజ్ఞాపించాడు.

పవిత్రంగా మంత్రపఠనం సాగుతోంటే, రాముణ్ణీ సీతనీ మణిపీఠం మీద కూర్చోబెట్టాడు వసిష్ఠుడు. పరిమళిస్తున్న పవిత్రజలంతో వారిని అభిషేకించాడు. ఆ తర్వాత వరుసగా కాశ్యప, వామదేవ, కాత్యాయన, జాబాలి, విజయ, గౌతమ, సుయజ్ఞులు ఆ దంపతుల్ని అభిషేకించారు. ఋత్విక్కులూ, దేవతలు కూడా సీతారాముల్ని అభిషేకించారు. కనులపండువైన ఆ దృశ్యాన్ని చూసి అసంఖ్యాక పౌరులేగాక, దిక్పాలకులూ, దేవ సిద్ధ గణాలూ జయజయధ్వానాలు చేశారు.

అభిషేక అనంతరం సీతారాముల్ని సభా మందిరంలో గల అమూల్యరత్న సింహాసనంపై కూర్చుండబెట్టాడు వసిష్ఠుడు. మాణిక్యకిరీటాన్ని రాముని శిరస్సుపై ఉంచాడు. వాయుదేవుడు ప్రత్యక్షమయ్యాడప్పుడు. ఇంద్రుడు ఇచ్చిన అమూల్య రత్నహారాన్ని రామునికి బహుమతిగా అందజేశాడు. శత్రుఘ్నుడప్పుడు గొడుగుపట్టాడు. సుగ్రీవ విభీషణులు వింజామరలతో వీచసాగారు. ఆ అద్భుతానికి ఆకాశంలో గంధర్వగానాలు సాగాయి. అప్సరసలు నాట్యం చేశారు. ఋషిసమూహాలు సీతారాముల్ని ఆశీర్వదించాయి. వసుధ పులకించిందప్పుడు. పుష్ప, ఫలభరితాలైన వృక్షాలతోనూ, పచ్చనిపైర్లతోనూ శోభించింది. సంతోషించాడు రాముడు. ఆ సందర్భంగా ముప్పయికోట్ల సువర్ణాలూ, లక్షధేనువులూ, లక్షగుర్రాలూ, నూరు వృషభాలనూ దానం చేశాడు. సుగ్రీవునికి రత్నహారాన్ని బహూకరించాడు. అంగదునికి బంగారు భుజకీర్తులను అందించాడు. అమూల్య ముత్యాల హారాన్ని సీతకు కానుకగా ఇచ్చాడు.

రాముని అనుమతి తీసుకుని, హనుమను సత్కరించింది సీత. వస్త్రాభరణాలను అందించిందతనికి. అయినా తృప్తి చెందలేదామె. మహోపకారి హనుమను ఇలా సత్కరించడం తక్కువనుకున్నదామె. అప్పుడు తన మెడలోని ఉజ్జ్వల హారాన్ని తీసి, హనుమకు ఇవ్వబోతూ ఆగింది. అనుమతి కోసం రాముణ్ణి చూసింది. అంగీకార సూచకంగా నవ్వాడతను. అప్పుడు ఆ హారాన్ని హనుమకు కానుక చేసి తృప్తి చెందిందామె.

నీల, మైంద, ద్వివిదులను కూడా సత్కరించాడు రాముడు. వారు కోరిన మేరకు కానుకలను అందజేశాడు. వివిధ కానుకలను అందించి మిగిలిన వారిని కూడా సంతోషపెట్టాడు.

అయోధ్యవాసులు సంబరాల్లో ఉంటూండగానే రాముని అనుమతి తీసుకుని సుగ్రీవ, అంగద, హనుమంతాదులు కిష్కింధకు వెళ్ళిపోయారు. విభీషణుడు లంకకు చేరుకున్నాడు.

లక్ష్మణుణ్ణి చేరపిలిచాడు రాముడు. వచ్చాడతను.

"లక్ష్మణా! ఈ మహారాజ్యానికి నువ్వు యువరాజువై వర్ధిల్లు." అన్నాడు రాముడు. కాదన్నాడు లక్ష్మణుడు. ఎన్ని విధాల నచ్చజెప్పినా ఒప్పుకోలేదతను. యువరాజ్యం రామసేవకు ప్రతిబంధకం అన్నాడు. అప్పుడు భరతుణ్ణి యువరాజుని చేశాడు రాముడు.



ప్రజారంజకంగా రామరాజ్యం సాగింది. నూరు అశ్వమేధయాగాలూ, గొప్ప యాగాలు మరెన్నో చేసి, పదకొండువేల ఏళ్ళపాటు ఈ భూమిని పాలించాడు రాముడు. అతని పాలనలో గాలులు హాయిగా వీచాయి. వర్షాలు చక్కగా కురిశాయి. పంటలు పండాయి. కరువు కాటకాలన్నవి తెలియదెవరికీ.

సమాజంలో నాలుగు వర్ణాల ప్రజలూ ఐకమత్యంగా మసలారు. సోమరితనం ఎరుగరెవరూ. తృప్తి, న్యాయదృష్టితో అంతా ధార్మికంగా జీవించారు.

ప్రజలు విద్యావంతులై, తాతలూ, తండ్రులూ, బిడ్డలతో సౌఖ్యంగా జీవించారు. చిరంజీవులయ్యారు.

ప్రకృతి వైపరీత్యాలు లేవు. సర్వసమృద్ధిగా ఉండేదంతా. దొంగలన్న మాటేలేదు. అకాలమరణాలు, పెద్దలముందు పిన్నలు మరణించడాలూ కనిపించేవి కావు. వైధవ్యం అన్నది స్త్రీలు ఎరుగరు.

ప్రజలను కన్నబిడ్డల్లా ప్రేమించేవాడు రాముడు. ప్రజలు కూడా రాముణ్ణి కన్నతండ్రిలా చూసుకునేవారు. పౌర జానపదులంతా సీతారాముల, ఆ సోదరుల అనురాగ త్యాగాలనూ, నియమనిష్ఠలనూ, విజయాలను కథలు కథలుగా చెప్పుకుని ఆనందించేవారు. వారి ఆదర్శాలను ప్రేరణగా తీసుకుని ప్రవర్తించేవారు.

ఎక్కడ విన్నా రామనామమే! ఎల్లెడలా రామనామమే! రామనామంతో భూమ్యాకాశాలు తరించాయి. ప్రకృతి పరవశించింది.

ఆదికవి వాల్మీకి రచించిన ఈ రామాయణాన్ని పఠించిన వారికి, వారు చేసిన పాపాలు పోయి, పుణ్యాలు ప్రాప్తిస్తాయి. కోరిన కోరికలు తీరుతాయి. దీర్ఘాయుష్షూ, కీర్తీ లభిస్తుంది.

**శ్లో. ఆపదా మపహర్తారం, దాతారం సర్వసంపదామ్!**
**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం!!**

(సమాప్తం) D

**-అరణి**




నవంబర్ 23 నుంచి
నవంబర్ 29 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

ఉన్నత విద్య, దూరప్రయాణాలు, వృత్తి, వ్యాపారాలు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాలు, విందుల్లో పాల్గొంటారు. 24, 25, 26 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్పెక్యులేషన్లు, ఆర్థిక లావాదేవీల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. 27, 28 తేదీల్లో ఆర్థికపరమైన సమావేశాలకు అనుకూలం. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. డిపాజిట్లు, పొదుపు పథకాల్లో నిరాశ ఎదురయ్యే అవకాశం ఉంది. 29న న్యాయ, బోధన, రవాణా రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

ఆరోగ్యం, ఆర్థిక సంస్థలతో పనులు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 24, 25, 26 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. సహోద్యోగుల ఆంతరంగిక విషయాల్లో జోక్యం చేసుకోవాల్సి రావచ్చు. 27, 28 తేదీల్లో బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. స్పెక్యులేషన్లలో నష్టం సంభవం. భాగస్వామి కోసం ఖర్చులు అంచనాలు మించుతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. 29న వేడుకలు, సంస్మరణల్లో పాల్గొంటారు. పెట్టుబడులను సమీక్షించుకుంటారు.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, శుభకార్యాలు, సినీ, రాజకీయ విషయాలు, ఆరోగ్య అంశాలకు ఈ వారం అనుకూలం. బుధవారం వేడుకలు, శుభకార్యాలకు ఏర్పాట్లు చేస్తారు. కుటుంబ సభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 24, 25, 26 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. స్పెక్యులేషన్లకు దూరంగా ఉండాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. 27, 28 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ప్రియతముల ఆరోగ్యం మందగిస్తుంది. లక్ష్య సాధనలో ఆటంకాలు ఎదురవుతాయి. 29న స్పెక్యులేషన్లలో నిదానం అవసరం. శ్రీవారు, శ్రీమతి వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, స్పెక్యులేషన్లు, వేడుకలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. కొత్త స్నేహాలు చిగురిస్తాయి. 24, 25, 26 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు లక్ష్యాలు సాధిస్తారు. బదిలీల కోసం చేసే ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 27, 28 తేదీల్లో అడ్వర్టయిజ్‌మెంట్లు, విద్యారంగాల వారు లక్ష్యాలు సాధిస్తారు. విద్యార్థులకు లక్ష్య సాధనలో ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 29న విందుల్లో పాల్గొంటారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. వైద్యం, హోటల్, వ్యవసాయం, పరిశ్రమల రంగాల వారికి శుభప్రదం.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

ప్రేమానుబంధాలు, పెట్టుబడులు, వృత్తిపరమైన నిర్ణయాలు, ఆరోగ్యంపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు సేకరిస్తారు. 24, 25, 26 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. చర్చలు, పర్యటనలు లాభిస్తాయి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్ల విషయంలో పొరపాట్లు దొర్లే అవకాశం ఉంది. 27, 28 తేదీల్లో బంధుమిత్రుల రాక ఆనందం కలిగిస్తుంది. బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. ప్రియతముల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. 29న చిన్నారులు, ప్రియతముల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, గృహోపకరణాల సేకరణ, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. 24, 25, 26 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. డబ్బు విషయంలో మీ వైఖరిని సమీక్షించుకుంటారు. 27, 28 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో ప్రోత్సాహకరం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్ల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. చర్చలు, ప్రయాణాల్లో నిదానం అవసరం. 29న కుటుంబ విషయాల కారణంగా అశాంతికి లోనవుతారు. ఇల్లు, కార్యాలయంలో మార్పులు, చేర్పుల కోసం ప్రయత్నిస్తారు.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, వృత్తిపరమైన సమావేశాలు, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. సినీ, రాజకీయ రంగాలవారు కీలక సమాచారం అందుకుంటారు. 24, 25, 26 తేదీల్లో సోదరీసోదరుల వ్యవహారాలపై దృష్టి పెడతారు. ఇంటర్వ్యూలలో నిరాశ తప్పకపోవచ్చు. ప్రయాణాల్లో నిదానం అవసరం. 27, 28 తేదీల్లో విలువైన పత్రాలు అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో తొందరపాటు కారణంగా నష్టపోయే అవకాశం ఉంది. 29న ప్రయాణాలు, చర్చల్లో నిదానం అవసరం. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, ఇంక్రిమెంట్లు, పెట్టుబడులు, విద్యా విషయాలు, స్థిర చరాస్తి విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు. ఆర్థికంగా ప్రోత్సాహకర సమయం. 24, 25, 26 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. రాజకీయ, సినీరంగాలవారికి నిరుత్సాహకరంగా ఉంటుంది. 27,28 తేదీల్లో కొత్త ఆదాయ మార్గాల అన్వేషణ ఫలిస్తుంది. ఆర్థిక విషయాల్లో కీలక నిర్ణయాలకు తగిన సమయం కాదు. విలువైన వస్తువులు భద్రం. 29న బృందకార్యక్రమాల కోసం ఖర్చు చేస్తారు. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

కొత్త ప్రాజెక్టులు, పెట్టుబడులు విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ప్రముఖులను కలుసుకుంటారు. 24, 25, 26 తేదీల్లో సమావేశాలు, బృందకార్యక్రమాల్లో కీలకపాత్ర పోషిస్తారు. ఆర్థిక విషయాల్లో కీలక నిర్ణయాలకు ఇది సమయం కాదు. 27,28 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. మనశ్శాంతి లోపిస్తుంది. రాజకీయ, సినీరంగాల వారు తొందరపాటు కారణంగా నష్టపోయే అవకాశం ఉంది. 29న కొత్త పనుల ప్రారంభానికి తగిన సమయం కాదు. మీ మనసు మార్పు కోరుకుంటుంది.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, ప్రయాణాలు, ఆధ్యాత్మిక కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ప్రయాణాలు, చర్చలకు అనుకూలం. విద్యార్థులకు శుభప్రదం. 24, 25, 26 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. సినీ,రాజకీయ రంగాల వారికి అనుకోని ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 27, 28 తేదీల్లో సమావేశాలు, వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక విషయాల్లో కొంత అసౌకర్యం కలుగుతుంది. సన్నిహితులకు సంబంధించిన సమాచారం కలవరం కలిగిస్తుంది. 29న బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సినిమా, రాజకీయాలు, ఫోటోగ్రఫీ, గ్రాఫిక్స్, ఆధ్యాత్మిక రంగాలవారు ఆచితూచి వ్యవహరించాలి.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వేడుకలు, విద్యా విషయాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం రుణప్రయత్నాలు ఫలిస్తాయి. పూర్వ మిత్రులను కలుసుకుంటారు. 24, 25, 26 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. ఆర్థిక విషయాల్లో మీ అంచనాలు ఫలించకపోవచ్చు. 27,28 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా లాభిస్తుంది. ప్రముఖుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. ఉన్నత పదవుల విషయంలో ఆశాభంగం తప్పకపోవచ్చు. 29న ఖర్చులు అధికం. బృందకార్యక్రమాలు, వేడుకలు ఉల్లాసం కలిగిస్తాయి. సహకార సంఘాలు, యూనియన్ కార్యకలాపాల్లో పాల్గొంటారు.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

కీలక నిర్ణయాలు, ఇంక్రిమెంట్లు, వృత్తిపరమైన సమావేశాలు, వేడుకలకు ఈ వారం అనుకూలం. బుధవారం శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. ప్రముఖులతో పరిచయాలు ఏర్పడతాయి. 24, 25, 26 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ప్రముఖుల సహకారం అందుకుంటారు. ఉద్యోగ, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు గత అనుభవం తోడ్పడుతుంది. పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. 27,28 తేదీల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాలు, ప్రయాణాల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. పెద్దల కారణంగా మనస్తాపం కలుగుతుంది. 29న పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు.






## అల్లుడిని అనుమానించిన అత్త

ట్వింకిల్ ఖన్నా అక్షయ్ కుమార్‌ని చేసుకుంటానంటే డింపుల్ కపాడియా ససేమిరా అందట! ట్వింకిల్ తల్లికి ఎంత నచ్చచెప్పాలని చూసినా దిగి రాలేదట! దీనికి కారణం ఉంది అంటోంది ట్వింకిల్. తన తల్లికి అక్షయ్‌కుమార్ గే అని ఎవరో చెప్పారట! వారి మాటలను నమ్మిన తన తల్లి తమ పెళ్ళికి ఒప్పుకోలేదనీ, చివరికి అది అబద్ధమని తెలిసిన తరువాత అంగీకరించిందనీ ట్వింకిల్ చెప్పుకొచ్చింది. ఇన్ని సంవత్సరాలుగా బయటపెట్టని ఈ విషయాన్ని ట్వింకిల్ ఇటీవలే వెల్లడించింది.



## దర్శకేంద్రుడి రిటైర్‌మెంట్?



'అన్నమయ్య'లాంటి గొప్ప సినిమాను తెరకెక్కించిన దర్శకేంద్రుడు రాఘవేంద్ర రావు ప్రతిభ గురించి ఎంత చెప్పినా తక్కువే! తాజాగా ఆయన తెరకెక్కిస్తున్న 'ఓం నమో వెంకటేశాయ' తరువాత సినిమాల నుంచి రిటైర్ అయ్యే ఆలోచనలో ఉన్నారట! ఇక సినిమాల నుంచి తప్పుకుని ప్రస్తుత దర్శకులకి అవసరమైతే సలహాలు ఇవ్వాలని అనుకుంటున్నారట! కమర్షియల్ సినిమాలకు స్వస్తి చెప్పి దశాబ్దకాలంగా ఆధ్యాత్మిక సినిమాలు మాత్రమే తీస్తున్న దర్శకేంద్రుడు వాటికి కూడా బైబై చెప్పే ఆలోచన కొందరిని బాధిస్తోందట!

## 'రైతు'కు బిగ్‌బీ దూరం?

బాలకృష్ణ 101 సినిమా 'రైతు'లో బిగ్‌బీ అమితాబ్ నటించబోతున్నారన్న వార్త బాగానే హల్‌చల్ చేసింది. అయితే ఇప్పుడు ఈ సినిమాలో అమితాబ్ చేయడం లేదన్న మరో వార్త గుప్పుమంది. మరో ఆరునెలల వరకూ అమితాబ్‌కి డేట్లు అడ్జస్ట్ చేయడం కుదరదట! ఆరు నెలల తరువాతే డేట్లు ఇవ్వడం కుదురుతుందని ఆయన చెప్పినట్టు సమాచారం! ఆయన లేకుండా సినిమా చేస్తారా? లేదా? అన్నది వేచి చూడాల్సిందే అంటున్నారు టాలీవుడ్ జనాలు.



## నోటు సెగ ఆ స్టార్‌కు లేదు

టాలీవుడ్‌లో ఆర్.నారాయణమూర్తి గురించీ, ఆయన ఆశయాల గురించీ తెలియని వారంటూ ఉండరేమో! టాలీవుడ్‌లో చిన్న నటుడు దగ్గర నుంచి స్టార్ హీరో వరకూ అందరూ కోట్లు వెనకేసుకోవాలని తాపత్రయపడుతుంటే ఆర్.నారాయణమూర్తి మాత్రం తను నమ్మిన సిద్ధాంతానికి లోబడే సినిమాలు చేస్తారు. దాంతో ఆయన దగ్గర మంచి సినిమా తీశానన్న సంతృప్తి తప్ప పెద్ద నోట్లు జమకావు. ఈ కారణంగానే మోదీ నోట్ల సెగకు జనాలు అందరూ విలవిల్లాడుతుంటే ఆయన మాత్రం బిందాస్‌గా ఉన్నారని టాలీవుడ్ జనాలు అంటున్నారు.



## ఆ క్లబ్‌లోకి ఐష్!

దశాబ్దానికి పైగా ఐశ్వర్యారాయ్ సినీ రంగంలో కొనసాగుతోంది. ఎన్నో బ్లాక్‌బస్టర్లను తన ఖాతాలో జమ చేసుకుంది. కానీ వంద కోట్ల క్లబ్‌లోకి మాత్రం చేరుకోలేకపోయింది. ఇప్పుడు 'ఏ దిల్ హై ముష్కిల్' సినిమాతో ఆ కొరత కూడా తీరిపోయిందట ఐష్‌కి! సంగతేమిటంటే ఐష్ నటించిన 'ఏ దిల్ హై ముష్కిల్' రెండు వారాల్లో 104కోట్లు వసూళ్లను సాధించి ఐష్ కలను నెరవేర్చింది. ఈ సినిమాలో ఐష్ నటన మీద చాలా మంది చాలా చాలా కామెంట్లు చేస్తున్నా, అవన్నీ ప్రేమతో చేస్తున్నవేననీ, వారికి తన మీద ఎనలేని ప్రేమే వారి చేత అలా మాట్లాడిస్తోందనీ తేల్చిపారేసింది. తన మాటలతో పనిలో పనిగా అత్తగారికి కూడా చురకలు అంటించింది అంటున్నారు బాలీవుడ్ జనాలు.



# అంతా ఆ దర్శకుల ప్రోత్సాహం వల్లే!

**-రఘు కారుమంచి**

**చూడగానే నవ్వు తెప్పించే ముఖం...దానికి తగినట్టుండే శరీరభాష... అతడిని ఓ మంచి కమెడియన్‌ని చేశాయి. తెలుగులో చాలా మంది కమెడియన్లు ఉన్నా, ఎవరి ప్రత్యేకత వారిదే! కామెడీకి కొదవలేదు...వారందరి కన్నా విభిన్నమైన హాస్య నటుడు రఘు కారుమంచి. అతడి కోరికలకు అంతులేదు. ఎందుకంటే దాదాపు కమెడియన్లందరూ హీరోగా నటించాలని చూస్తుంటే ఈ కమెడియన్ మాత్రం విలన్ అవుతానంటున్నాడు. అదేంటో ఆయన మాటల్లోనే....**

### నా గురించి....

వాస్తవానికి మాది తెనాలి. కానీ నేను పుట్టింది, పెరిగింది అంతా హైదరాబాదులోనే. మా ఫాదర్ ఆర్మీ వ్యక్తి. అమ్మ ఇంట్లోనే ఉంటుంది. నాకొక బ్రదర్ ఉన్నాడు. తను బిజినెస్ చేస్తున్నాడు. నా భార్య కూడా బాగా చదువుకుంది. తను ఎం.ఏ పొలిటికల్ సైన్స్. నాకు ఇద్దరు పిల్లలు.

### చదువు, ఉద్యోగం

ఎంబీఏ చేశాను. సాఫ్ట్‌వేర్ రంగంలో ఉద్యోగం చేసేవాడిని. అప్పట్లో, దాదాపు పదమూడు సంవత్సరాల కిందటే మంచి జీతం వచ్చేది. ఓ పక్క ఉద్యోగం చేస్తూనే చాలా సంవత్సరాలు సినిమాల్లో నటించాను. కానీ సినిమాలు, ఉద్యోగం రెండింటినీ బ్యాలెన్స్ చేయడం కష్టమనిపించింది. అందుకే సినిమాల కోసం ఉద్యోగం వదిలేశాను.

### సినిమాల్లోకి ఎలా ఎంట్రీ...

ఎలాంటి శిక్షణ లేకుండానే సినిమాల్లోకి వచ్చాను. మంచి పేరు తెచ్చుకున్నాను. ఈ విషయంలో నేను చాలా అదృష్టవంతుడిని. చాలా సంవత్సరాలుగా వి.వి.వినాయక్‌గారూ, సురేందర్ రెడ్డిగారూ, నేనూ మంచి స్నేహితులం. అప్పుడే వాళ్ళిద్దరూ సినిమాల్లో పైకి వస్తున్నారు. నన్ను కూడా రమ్మన్నారు. కమెడియన్‌గా నాకు మంచి భవిష్యత్తు ఉందని ముందు ఊహించింది ఆ ఇద్దరే! నేనే వస్తాను... వస్తాను అంటూ కాలయాపన చేసేవాడిని చివరికి వి.వి.వినాయక్ 2002లో 'ఆది'లో నాకొక పాత్ర ఇచ్చారు. ఆ సినిమా సమయంలో జూనియర్ ఎన్టీఆర్ నాకు ఇచ్చిన సపోర్ట్ ఎన్నటికీ మరిచిపోలేను. ఆయనతోనే ఎక్కువ సినిమాలు చేశాను. ఎప్పటికైనా నిర్మాతగా మారి ఆయనతో ఓ సినిమా చేయాలని నా కోరిక. అది ఎప్పటికైనా తీరుతుందన్న నమ్మకం నాకుంది. సినిమాల్లోకి వచ్చిన కొత్తల్లో ఈ వేషాలు మానేసి బుద్ధిగా ఉద్యోగం చేసుకుంటే బాగుంటుంది కదా అనిపించేది. కమెడియన్‌గా సక్సెస్ అయ్యాక ఇప్పుడు ఉద్యోగం గుర్తుకు రాదు.

### కమెడియన్‌గానే ఎందుకంటే..

తెలుగులో ఉన్న పలు యాసలను అనర్గళంగా మాట్లాడగలను. ఆ యాసల్లోనే అప్పుడప్పుడూ కొందరిని టీజ్ చేస్తుండేవాడిని(సరదాగానే). నా యాస చూసి ఎవరూ పెద్దగా కోపగించుకోకుండా నవ్వుకుంటూ వెళ్ళేవారు. అది చూసి వినాయక్ గారు కమెడియన్‌గా చేయమంటూ ప్రోత్సహించి, ఆయనే ముందుగా నాకు కమెడియన్‌గా అవకాశం ఇచ్చారు.

### కామెడీ కష్టమే!

బయట నేను మాట్లాడినప్పుడు ఒకరిద్దరికి సరదాగా ఉండొచ్చు. కానీ తెరమీద కామెడీ చేస్తూ కోట్లాది మంది ప్రేక్షకులను నవ్వించడం అంటే అంత తేలికైన విషయం కాదు. కష్టమే! తెలుగులో దాదాపు వందమందికి పైగా కమెడియన్లు ఉన్నారు. అందరం ఒక్కసారి కలుసుకోవడం సాధ్యం కాదు. కానీ కలుసుకున్నప్పుడు మాత్రం సరదాగా మాట్లాడుకుంటాం.

### విలన్‌గా చేయాలి

నేను చాలా సినిమాల్లో విలన్ పక్కన కమెడియన్ పాత్రలు చేశాను తప్ప పూర్తి స్థాయి విలన్‌గా చేయలేదు. ఎవరైనా అవకాశం ఇస్తే పూర్తిస్థాయి విలన్‌గా నటించాలని ఉంది. కమెడియన్‌గా చాలా సంతోషంగా ఉన్నాను.

### పేరు తెచ్చిన సినిమాలంటే...

అన్ని భాషల్లో కలిపి ఇప్పటివరకూ నేను దాదాపు 150 సినిమాలు చేశాను. అవన్నీ నాకు

మంచి పేరునే తెచ్చిపెట్టాయి. నటుడిగా అందరూ నన్ను గుర్తుపడుతున్నారంటే నేను చేసిన పాత్రలే దానికి కారణం.

**బ్రేక్ వచ్చిందెప్పుడంటే...**

'అదుర్స్' సినిమాకి ముందు దాదాపు 30 సినిమాల్లో నటించాను. ఆ తర్వాత 'అదుర్స్' సినిమా చేసినప్పుడు మంచి గుర్తింపు లభించింది. 'అన్నా నన్ను వదిలేస్తే బందర్ పోతా' అంటూ నేను చెప్పిన డైలాగ్‌కి ప్రేక్షకుల నుంచి మంచి స్పందన వచ్చింది. 'అదుర్స్' తరువాత నాకు ఇంకా మంచి అవకాశాలు వస్తున్నాయి.

**అన్ని భాషల్లోనూ...**

నన్నూ, నాలోని నటుడినీ గుర్తించింది తెలుగు భాషే అయినా, దక్షిణాది భాషలే కాకుండా ఉత్తరాది భాషల్లో కూడా సినిమాలు చేస్తున్నాను. ఓ ఇంగ్లీష్ సినిమా కూడా చేశాను. నటుడిగా నాకు ఇంత మంచి గుర్తింపు వచ్చినా, ఇన్ని సినిమాలు చేయడానికి కారణం ఆ ఇద్దరే! వి.వి.వినాయక్ గారు, సురేందర్ రెడ్డిగారు! వారు లేకపోతే నేను లేను. వారి రుణం తీర్చుకునేది కాదు.

**ఆ ఇద్దరితో చేయాలని ఉంది**

దాదాపు చాలామంది హీరోలతో చేశాను కానీ, బాలకృష్ణగారు, పవన్‌కల్యాణ్‌గారితో చేయడం కుదరలేదు. అలాగే రాజమౌళిగారితోనూ, త్రివిక్రమ్ గారితోనూ చేసే అవకాశం రాలేదు. వస్తే తప్పకుండా చేస్తాను.

**టీవి షోలలో...**

2003లో చాలా టీవి షోలు చేశాను. 'జబర్దస్త్'లో 27 షోలు చేశాను. అందులో 27 గెటప్‌లు వేసుకున్నాను. ఆ షో చేస్తున్నప్పుడు ఇంకా మంచి మంచి అవకాశాలు వస్తాయనుకున్నా. ఇప్పుడు టీవీ షోలు చేసే టైం లేదు.



**మరిచిపోలేని అనుభవం..**

ఉద్యోగం చేస్తున్నప్పుడు రఘు అంటే ఎవరికీ తెలియదు. అదే సినిమాల్లో చేయడం మొదలుపెట్టిన తరువాత చాలా మంది నన్ను గుర్తుపట్టడం ప్రారంభించారు. ఓ వ్యాపారవేత్త, ఓ రాజకీయనాయకుడు మామూలుగా రోడ్డు మీద నడుచుకుంటూ వెళ్తోంటే ఎవరూ పట్టించుకోరు. అదే సినిమా నటుడు అయితే వెంటనే గుర్తు పట్టి చుట్టుముగిపోతారు. అతను చిన్న నటుడా? స్టార్ హీరోనా, క్యారెక్టర్ ఆర్టిస్టా? అన్నది పట్టించుకోరు. సినిమా వ్యక్తి... అంతే! అదే గుర్తింపు. సరిగ్గా ఇలాంటి గుర్తింపే తిరుపతిలో నాకు ఎదురైంది. ఓసారి తిరుపతి వెళ్ళినప్పుడు దర్శనం సమయం అయిపోయింది. ఆలయం మూసేయబోతున్నారు. అక్కడున్న వాళ్ళు నన్ను గుర్తుపట్టి లోపలికి తీసుకెళ్ళి ప్రత్యేక దర్శనం చేయించారు. సినిమా వ్యక్తులకి ఎంత గుర్తింపు ఉంటుందన్నది నాకు అప్పుడే తెలిసింది. ఈ అనుభవాన్ని ఎప్పటికీ మరిచిపోలేను.

**మెగాస్టార్ సినిమాలో**

గతంలో చిరంజీవిగారి 'ఠాగూర్' సినిమాలో చేశాను కానీ, ఆ సినిమాలో చిరంజీవిగారితో నాకు సీన్లు లేవు. 'ఖైదీ 150'లో మాత్రం నాకు మంచి పాత్ర లభించింది. ఆయనతో కలిసి మూడు సీన్లలో కనిపిస్తాను. సినిమా ప్రారంభ సమయంలోనే చిరంజీవి గారిని కలిశాను. మాట్లాడాలంటే భయం. చాలా టెన్షన్ పడ్డాను. కానీ చిరంజీవిగారు పక్కన కూర్చోబెట్టుకుని చాలా ఆప్యాయంగా మాట్లాడారు. ఆయన ఆప్యాయత కూడా ఎన్నటికీ మరిచిపోలేను.

**పోటీ అంటే?**

నా ప్రత్యేకత తెలియాలంటే కచ్చితంగా పోటీ ఉండాల్సిందే! అప్పుడే నాలోని కమెడియన్ బాగా చేయగలుగుతాడు. కమెడియన్లు ఎంతమంది ఉన్నా ఎవరి అవకాశాలు వారికే ఉంటాయి.

**చేయబోతున్న సినిమాలు...**

నాలుగైదు సినిమాలు చేస్తున్నాను. కొన్ని సినిమాలు విడుదల కావాల్సి ఉంది.

-చిన్ని



## రాఖీ రాజకీయాలు

రాఖీ అంటే మాజీ హీరోయిన్ రాఖీ కాదు. ఈ రాఖీ సావంత్ హీరోయిన్ కమ్ ఐటెంగర్ల్.. ఈవిడగారి పేరు వినగానే ఆమె చేసిన ఐటెం సాంగ్స్ కన్నా 'స్వయంవరం' పేరుతో వేసిన వేషాలే టక్కున గుర్తుకొస్తాయి. సినిమాల్లో అవకాశాలు తగ్గడంతో 'స్వయంవరం' పేరుతో బడాబాబులకు గాలం వేయాలని చూసింది. ఈ షో ఆమె సినిమాల్లాగే అట్టర్ ఫ్లాప్ కావడంతో రాజకీయాల వైపు దృష్టి సారించింది. ఎప్పటికప్పుడు ఎన్నికల్లో పోటీచేస్తానని ప్రకటించడమే తప్ప ఆచరణలో పెట్టలేదు. ఈసారి మాత్రం ఎన్నికలను సీరియస్‌గానే తీసుకోబోతోందట! రాబోయే ఉత్తరప్రదేశ్ ఎన్నికల్లో రాఖీ పోటీకి సిద్ధమవుతోంది. ఈ మాట రాఖీనే చెబితే ఎవరూ నమ్మేవారు కాదేమో కానీ రిపబ్లికన్ పార్టీ ఈ విషయాన్ని వెల్లడించడంతో అందరూ నిజమేననుకుంటున్నారు. రాఖీ పోటీ పడేది అల్లాటప్పా వ్యక్తితో కాదు మాజీ ముఖ్యమంత్రి, బీఎస్పీ అధినేత్రి మాయావతితోనట! మాయావతి ఎక్కడి నుంచి పోటీ చేస్తే అక్కడ నుంచి రాఖీ నిలబడుతుందట! ఇంతవరకూ బాగానే ఉంది కానీ, అసలు మాయావతి ఎన్నికల్లో నిలబడుతుందా? లేదా? అని బాలీవుడ్ జనాలు సంశయిస్తున్నారు. గత ఎన్నికల్లో ఓటమిపాలైన తరువాత రాజ్యసభ నుంచి ఎంపీగా కొనసాగుతున్న మాయావతి ఈ ఎన్నికల్లో బరిలో ఉంటారా? లేదా? అన్న అనుమానాన్ని చాలామంది వ్యక్తం చేస్తున్నారు. కేవలం మాయావతి మీదే రాఖీ పోటీ చేస్తుందా? వేరే నియోజకవర్గం నుంచి అయినా పోటీ చేస్తుందా? అన్న సందేహాన్ని రాఖీనే నివృత్తి చేయాలంటున్నారు బాలీవుడ్ జనాలు.

ఇంటర్వ్యూ



# సినిమా ఇప్పుడు పచ్చి వ్యాపారమైపోయింది

-నర్సింగ్‌యాదవ్

**కమెడియన్ విలన్‌గా ప్రేక్షకులను నవ్వుల్లో ముంచెత్తిన నటుడు నర్సింగ్ యాదవ్. మూడు దశాబ్దాలుగా ఆరు భాషల్లో సుమారు 400 చిత్రాల్లో నటించారు. సినిమాకీ, తన బస్తీ ప్రజలకూ జీవితాన్ని అంకితం చేసిన నటుడు, నాయకుడు నర్సింగ్ యాదవ్. సినిమా ఇప్పుడు పచ్చివ్యాపారమైపోయిందంటున్న ఆయన ఇంటర్వ్యూ ఈ వారం.....**

హైదరాబాద్ నగరం నడిబొడ్డు సుల్తాన్ బజార్, కోఠీలో జన్మించాను. మా నాన్నగారు మైలా రాజయ్య యాదవ్. అమ్మ లక్ష్మీనరసమ్మ. ఇంటర్మీడియట్ వరకు చదివాను.

### బంధువులు, స్నేహితుల ప్రోత్సాహం

నేను నటుణ్ణి అవుతాననుకోలేదు. కానీ నటించాలనే బలమైన కోరిక ఉండేది. ఫిజికల్‌గా నా లుక్ బాగుంటుందని అందరూ అనేవారు. మా ఇంటికి దగ్గర్లో ఉన్న హనుమాన్ వ్యాయామ శాలలో వ్యాయామం చేసేవాణ్ణి. నా పర్సనాలిటీ చూసి చాలామంది మిత్రులు, బంధువులు సినిమాల్లో చేరమనేవారు. నేను పట్టించుకునేవాణ్ణి కాదు. కానీ మొదటిసారిగా విజయనిర్మలగారి చిత్రంలో అవకాశం వచ్చింది.

### గురుతుల్యుడు రామ్‌గోపాల్‌వర్మ

విజయనిర్మలగారి దర్శకత్వంలో నిర్మించిన 'ప్రజల మనిషి' చిత్రంలో చిన్నపాత్రతో నా కెరీర్ మొదలై, రామ్‌గోపాల్‌వర్మగారి పరిచయంతో మలుపు తిరిగింది. ఆయన 'క్షణక్షణం' చిత్రంలో నాకు ఒకే ఒక డైలాగ్, 'తెలియదు సార్', 'తెలియదు సార్'....ఆ ఒక్క డైలాగే సైడ్ విలన్‌గా నన్ను ఆకాశానికి ఎత్తేసింది. వర్మగారి పుణ్యాన నేను ఆ చిత్రంలో నటించడం నిజంగా అదృష్టం. ఆయన నా గురుతుల్యులు.

క్షణక్షణంలో ఒక సీన్‌లో నటి శ్రీదేవిగారిని వెంబడిస్తాను. ఖైరతాబాద్‌లో ఈ షూటింగ్ జరిగింది. నేను కొంచెం నిదానంగా పరిగెత్తాను. దాంతో వర్మగారు, 'నువ్వు నడుస్తున్నావా? ఫాస్ట్ వాకింగ్ చేస్తున్నావా? నీ జేబులో పర్సు ఎవరైనా కొట్టేసి పారిపోతుంటే వాళ్ళవెనక ఇలాగే పరిగెడతావా?' అంటూ ఎంతో నిదానంగా సూచించారు నాకు. వర్మగారి చిత్రంలో ప్రతి నటుడూ హీరోయే! జె.డి.చక్రవర్తి, హిందీ చిత్రాల్లో నటించే మనోజ్ బాజ్‌పాయ్, ఉత్తేజ్ లాంటివాళ్ళు ఆయన ఆశీర్వాదాలతో వచ్చినవారే! మా అందరికీ మంచి ఆఫర్లు రావడం ఆయన చలవే!

### చిరంజీవి చిత్రాల్లోనే ఎక్కువ

చిరంజీవి నాకు గురువు. గాడ్ ఫాదర్! ఆయన ఎంతో గొప్ప స్నేహశీలి. ఆయనతో నేను నటించిన 'ఠాగూర్' చిత్రం నాకు మంచిపేరు తెచ్చింది. 'అన్నా, మూడు కర్రలుంటే దీన్ని గిల్లి దండులంటారన్నా, ఈ కిరికిరి కిరికెట్టేందన్నా' అనే ఇందులోని నా డైలాగ్ మంచి హాస్యం పండించింది. ఆ డైలాగ్ వచ్చినప్పుడల్లా ప్రేక్షకులు హర్షధ్వానాలు చేసేవారు. 25 థియేటర్లలో స్వయంగా నేను వెళ్ళి చూసినప్పుడు నాకు ప్రత్యక్షంగా ఎదురైన చక్కటి అనుభవమిది. ప్రేక్షకుల నుంచి మంచి స్పందననే కోరుకుంటాడు ఏ నటుడైనా. ఏవో కొన్నితప్ప చిరంజీవిగారు నటించిన చిత్రాలన్నింటిలో నేనూ నటించాను.

### ఆయన చిత్రాల్లో నా పాత్ర ఒక సెంటిమెంట్!

చిరంజీవిగారితో నేను నటించిన చిత్రాల్లో ప్రేక్షకులకు బాగా గుర్తుండిపోయేవి శంకర్‌దాదా MBBS, మెకానిక్ అల్లుడు, ముగ్గురు మొనగాళ్ళు, మాస్టర్, ముఠామేస్త్రీ లాంటివెన్నో. ఆయన చిత్రాలన్నీ దాదాపు శతదినోత్సవాలు చేసుకున్నవే!

చిరంజీవిగారు, నేను కనిపించినప్పుడల్లా 'క్రికెట్ వీరుడొచ్చాడు' అని చమత్కారంగా అంటుంటారు. సెట్‌లో కనిపిస్తే చాలు, నర్సింగ్ యాదవన్నా, నమస్తే అని చమత్కారంగా అంటారు. మాస్టర్ చిత్రంలో క్రికెట్ బ్యాట్‌తో ఆయనపై దాడిచేసే సన్నివేశంలో ఆయన్ను చూసి బ్యాట్ పారేసి పారిపోతాను. ఆ సమయంలో నా ఫీలింగ్స్ బాగున్నాయని చాలామంది మెచ్చుకుంటారు. ఆయన చిత్రంలో నేను కనీసం ఒక నిమిషమైనా కనిపించాలి. అది ఆయనకు సెంటిమెంట్ అంటుంటారు.

### మాస్ చిత్రంలో పాత్ర నిజజీవిత ఘటనే!

నాగార్జునగారి మాస్ చిత్రంలో నాది మంచి పాత్ర. మంచి కామెడీ సన్నివేశాలున్నాయి. నిజజీవితంలో ఆకలితో ఉన్నవారిపట్ల జాలి, దయతో ప్రవర్తిస్తాను. ఎవరైనా ఆకలితో డబ్బు అడిగితే

వెనుకా ముందూ చూడను. ఇచ్చేస్తాను. నా వీక్నెస్ కనిపెట్టి చాలామంది దాన్ని క్యాష్ చేసుకునే వారు. సరిగ్గా అలాంటి పాత్రే మాస్ చిత్రంలో నాకు రావడం నిజంగా ఒక గమ్మత్తే! వేణు మాధవ్ కేన్సర్ అని అబద్ధం చెప్పి నా దగ్గర డబ్బు గుంజుతాడు. ఆ సీన్ బాగా పండింది. ఈ సీన్ చూశాక ప్రతి ఒక్కరూ నాకు అలాంటి సీన్లే ఇవ్వడం ప్రారంభించారు. అది యాధృచ్ఛికం.

### కమెడియన్ విలన్

యమదొంగ, మాస్, ఆట, నువ్వొస్తానంటే నేనొద్దంటానా, అనుకోకుండా ఒకరోజు, ఇడియట్ లతోపాటు చిరంజీవిగారితో నటించిన చిత్రాలు... ఇలా ఎన్నో నాకు నచ్చినవీ, జనం మెచ్చినవీ ఉన్నాయి. హిందీ చిత్రాల్లో నటించాను. సంజయ్ దత్‌గారి 'దౌడే', సునీల్‌శెట్టి 'భాయ్' చిత్రాల్లో నటించాను. భాయ్ చిత్రం తెలుగులో 'అన్న'. ఇందులో రాజశేఖర్ నటించారు. రజనీకాంత్‌గారి 'బాద్‌షా', విజయ్ హీరోగా చేసిన తమిళచిత్రం 'చిట్టుకురివి'... ఇలా ఎన్నో భాషాచిత్రాల్లో విలన్‌గా, ఎక్కువ సినిమాల్లో కమెడియన్ విలన్‌గా నటించాను.

### విదేశీ అభిమానులు

అనేక స్వచ్ఛంద సంస్థలు, ప్రైవేటు సంస్థలు నన్ను సత్కరించాయి. అవార్డులిచ్చాయి. నా అభివృద్ధికి తోడ్పడిన సంస్థలకు ప్రత్యేక ధన్యవాదాలు. ముఖ్యంగా దుబాయ్, జపాన్, సింగపూర్, మలేసియా, ఉత్తర భారతదేశ సినీప్రేక్షకుల అభిమానం సంపాదించుకున్నాను. అదొక అదృష్టంగా భావిస్తాను.

### క్యారెక్టర్ యాక్టర్గన్నావాలి

క్యారెక్టర్ యాక్టర్ పాత్రలు చేయాలన్నది నా చిరకాల వాంఛ. ఆ మధ్య 'ఆట', 'అనుకోకుండా ఒకరోజు' చిత్రాల్లో నాకు మంచి పేరు వచ్చింది. ఆ రోజే చంద్రశేఖర్‌గారు, క్యారెక్టర్ నటుడిగా నాకు మంచి భవిష్యత్తు ఉందని ఆశీర్వదించారు. అలాంటి అవకాశాలు వస్తాయనే ఆశిస్తున్నాను.

నాకు ఎలాంటి ఆర్థిక ఇబ్బందులూ లేవు. నటజీవితంలో ఇంకా మంచి పాత్రలు పోషించాలని కోరుకుంటున్నాను.



నవ్యవీక్లీ చదువుతూ...

### ఒంటరిపోరాటం

కొంతమంది దర్శకులు, ప్రొడ్యూసర్లు, నటుల సహాయ సహకారాలతో సినిమా పరిశ్రమలో నేను మూడు దశాబ్దాలుగా నిలదొక్కుకుని నిరాటంకంగా కొనసాగుతున్నాను. చిన్నచిన్న పాత్రలు పోషిస్తూ ఇండియన్ ప్రొడక్షన్ ద్వారా తెలుగు, తమిళంలో ఒక చిత్రానికి నిర్మాతగా కూడా వ్యవహరించాను. ప్రస్తుతం 'మా' అసోసియేషన్ కార్యవర్గ సభ్యుణ్ణి.

### సుల్తాన్‌బజార్ బిడ్డని

నా వాళ్ళంతా నన్ను యాదవ్ అన్నా అనీ, నర్సింగ్ అన్నా అని పిలుస్తారు. నాకంటే పెద్దవారు నర్సింగ్ తమ్మీ అంటుంటారు. ఈ సుల్తాన్ బజార్‌లో ఉన్నవాళ్ళందరికీ ఏదోఒక రకంగా నా వంతు సహాయం చేయడం కర్తవ్యంగా భావిస్తాను. పేద, బడుగు, బలహీన వర్గాల వారికి అండగా ఉంటూ నాకు తోచిన సహాయం చేయటం నా దినచర్య.

### కాంగ్రెస్‌లో చురుకైన నేతగా

కాంగ్రెస్‌పార్టీలో చురుకైన నాయకునిగా ఉన్నాను. హైదరాబాద్ నగర కాంగ్రెస్ కమిటీలో చురుగ్గా పనులు చేస్తూ పార్టీ సాంస్కృతిక విభాగం నగర ప్రధాన కార్యదర్శిగా కొంతకాలం పనిచేశాను. 1986లో హైదరాబాద్ మున్సిపల్ కార్పొరేషన్‌కు ఇండిపెండెంట్ అభ్యర్థిగా కాగడా గుర్తుపై పోటీచేసి 15 ఓట్ల తేడాతో ఓటమి చవిచూశాను. గెలుపోటముల ప్రసక్తి లేకుండా, సుల్తాన్ బజార్, తిలక్‌రోడ్, అబిడ్స్ ప్రాంత ప్రజలకు అనునిత్యం అందుబాటులో ఉంటాను. ఒక అన్నగా, తమ్ముడిగా, బిడ్డగా, ఆత్మీయునిగా సేవలు అందిస్తున్నాను. అందులో ఉన్న తృప్తి, సంతృప్తి మరెక్కడుంటుంది చెప్పండి!

### పరిశ్రమకు సహకారం

చిత్రపరిశ్రమ మద్రాసు నుండి హైదరాబాద్ తరలివచ్చాక ఎంతోమంది దర్శకనిర్మాతలకు నా వంతు సహాయ సహకారాలు అందించాను. లొకేషన్స్, సిటీరోడ్లపై షూటింగ్స్ లాంటి అనేక మంచి చెడుల విషయాల్లో నా బస్తీ ప్రజల సహకారంతో పరిశ్రమకు చేదోడువాదోడుగా ఉండేవాణ్ణి.

### గణపతి ఉత్సవాలు

సుల్తాన్‌బజార్, కోఠీ సెంటర్‌లో గణపతి మండపం నిర్మించి వినాయకచవితి పండుగ ఘనంగా నిర్వహించడం 30 యేళ్ళుగా ఆనవాయితీ! నేను స్వయంగా దగ్గరుండి అన్నీ చూసుకుంటాను. ఇక్కడ జైన్‌మందిర్ ఎదురుగా, ఏటా మండపం నిర్మించి గణపతి పూజలు చేస్తున్నాం. లక్ష్మీ బజార్ గణేష్‌మండలి తరపున వినాయక ఉత్సవాలు క్రమం తప్పకుండా చేస్తాం. ఇది వినాయకుడు, ఇక్కడి ప్రజలు నాకు కల్పించిన ఒక ప్రత్యేక హోదా. ఎంత బిజీగా ఉన్నా, షూటింగ్‌లో ఉన్నాగానీ, ఆ పదకొండురోజులూ నిరాటంకంగా ఉత్సవాలు కొనసాగిస్తాం.


కుటుంబసభ్యులతో...

### ఆ కృష్ణుడే కాపాడాడు

2007లో బెంగళూరులో కన్నడచిత్రం 'సత్యా ఇన్ లవ్' ఫైటింగ్ సీన్ల చిత్రీకరణ సమయంలో నా మెడమీద బలమైన దెబ్బ తగిలింది. అక్కడ రక్తం గడ్డకట్టింది. అయినా పట్టించుకోలేదు. కానీ తర్వాత కళ్ళు తిరిగాయి. దర్శకుడు రాఘవగారు నా పరిస్థితి చూసి అప్పటికప్పుడే సాయంత్రం ఫ్లైట్‌కి టికెట్ బుక్‌చేసి, హైదరాబాద్‌లో ఎయిర్‌పోర్ట్ నుండి డైరెక్ట్‌గా హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు. రెండు మూడు గంటలు లేటైతే ప్రాణానికే ప్రమాదం వచ్చి ఉండేదని డాక్టర్లు చెప్పారు. నేను కృష్ణ భక్తుణ్ణి! నిజంగా నేను నమ్ముకున్న నా కృష్ణుడే నన్ను కాపాడాడు. 2008లో ఈ చిత్రం విడుదలైంది.

### ఎవరిపని వాళ్ళు చెయ్యడంలేదు

ఆర్టిస్టులకు మంచి మర్యాద ఉండేది ఆ రోజుల్లో. అనుభవజ్ఞులే చిత్ర నిర్మాణంలో దర్శకులుగా, నిర్మాతలుగా బాధ్యత వహించేవారు. కిందిస్థాయి ప్రొడక్షన్ బోయ్ నుంచి అందరూ దర్శకులు, ఆర్టిస్టులకు ఎంతో మర్యాద ఇచ్చేవారు. ఎవరి పనులు వాళ్ళే చేసేవారు. కానీ ఇప్పుడిది పచ్చి వ్యాపారమైపోయింది. ప్రతిదానికీ తడుము కోవాల్సిందే! ఎవరి పని వాళ్ళు చెయ్యరు. గతంలో ఖచ్చితమైన నిర్ణయంతో నటులకు పాత్రలు కేటాయించేవారు. కానీ ఇప్పుడలా కాదు. ఏ కొద్దిమందో తప్ప ఈ రోజుల్లో అంతా సహదర్శకులమీదే వదిలిపెట్టి చిత్రనిర్మాణం సాగిస్తున్నారు.

### కుటుంబం

నా భార్య చిత్ర. మాకు ఒక కుమారుడు. పేరు రుత్విక్ యాదవ్. ప్రస్తుతం తొమ్మిదో తరగతి చదువుతున్నాడు. బాలనటుడుగా సినిమాల్లో నటిస్తున్నాడు. ప్రస్తుతం మెగాస్టార్ చిరంజీవిగారి 150వ చిత్రంలో, రవితేజగారి మరో చిత్రంలో నటిస్తున్నాను. మరో రెండు చిత్రాల్లో చేస్తున్నాను.

**-కె.హరనాథ్, సెల్: 97035 42598**

